# మీ పాపాయి బరువు వయస్సుకు తగ్గట్టుగా వున్నదా?




మీ పాపాయి సరియైనంత నిద్ర పోతున్నాడా?
పాపాయికి మొదటి పన్ను ఎప్పుడు వస్తుంది?
నేను పాపాయికి కావలసిన పోషణ తత్వాలన్నిటినీ ఇస్తున్నానా?
పాపాయికి ఎలాంటి ఆధారం లేకుండా నిలకడగా ఎప్పుడు కూర్చోగలడు? నిలబడగలడు?

క్రొత్తగా తల్లులయినవారు ఎదుర్కొనే ఈ ప్రశ్నలకే కాదు, మరెన్నో ఇతర ప్రశ్నలకు జవాబులు అందిస్తుంది 'పాపాయి మొదటి ఏడాది పుస్తకం'. క్రొత్త ఫారెక్స్ నుండి ఇది మీకొక ఉచిత కానుక.

'పాపాయి మొదటి ఏడాది పుస్తకం'లో పాపాయి పట్ల తీసుకోవలసిన శ్రద్ధను గురించి మీకు సహాయకరమైన వివరాలు ఎన్నో వున్నాయి. పాపాయి ఆహార సమయాన్ని ఆనందకరంగా చేయడానికి ప్రత్యేకంగా రూపొందించబడిన 23 రుచికరమైన ఫారెక్స్ వంట పద్ధతులు కూడా ఇందులో వున్నాయి.

నేడే మీ ప్రతి కొరకు వ్రాయండి.

గ్లాక్సో పాలతో కూడిన

## ఫారెక్స్

ఘన ఆహారం

మంచి ఆరోగ్యానికి మూలస్థానం—**గ్లాక్సో**



ఈ కూపన్ దిగువ చిరునామాకు పంపండి.
గ్లాక్సో లాబొరేటరీస్ (ఇండియా) లిమిటెడ్ పో. ఆ. బాక్స్ 19119 **(FCM-31)** బొంబాయి 400 025.
Glaxo Laboratories (India) Limited, P.O.Box 19119 **(FCM-31)**,
Bombay 400 025.
దయచేసి నాకు ఒక "పాపాయి మొదటి ఏడాది పుస్తకం" ప్రతి పంపండి.
తపాలు మరియు ఇతర ఖర్చులకోసం రూ. 1/- తపాలా బిళ్లలు జతపర్చబడినవి.

పేరు : ______________________

చిరునామా : ______________________

______________________

CLARION/B/GX 7/173 TEL

# చతుర

సంపుటి : 8 ఫిబ్రవరి 1985 సంచిక : 1


## ఈ నెల సమగ్ర నవల

"మనిషనేవాడు రోజురోజూ, క్షణక్షణమూ ఎదుగుతాడు. ఎదుగుదల కొన్నాళ్లు శారీరకం, ఆ తర్వాత మానసికం! ఎదుగుదల ఆగిపోయినరోజున మనిషి క్షీణించనారంభిస్తున్నాడన్నమాట! నువ్వు ఏమైనాఅనుకో-నా ప్రాణాలుపోయినా సరే, నేనీ సాహసాన్ని చేసేతీరుతాను. ఓడినా కూడా అదీ నా గెలుపుగానే భావిస్తాను! ఇంక ఈ విషయంలో నువ్వెంత తక్కువ మాట్లాడితే అంత మంచిది" అని తాను అమితంగా ప్రేమించే భార్యతో నిష్కర్షగా అనేసి ఇంట్లోంచి బైటపడి, సముద్రపు ఒడ్డుకు వెళ్లాడతను.

ఆ నీలిరంగు నీళ్లు అతన్ని ఆహ్వానిస్తున్నట్టుగానే అనిపించింది. 'ఇంతటి అనంతజీవితాన్నీ, ఇంతటి అగాథ లక్ష్యాన్నీ వదులుకుని వెనక్కు తిరిగి వెళ్లిపోవడం తెలివితక్కువతనం మాత్రమేకాదు. అది తన దౌర్భాగ్యంకూడా అవుతుంది. స్త్రీలకు సహజంగా భయాలూ, ఆందోళనలు అధికం. కాని, వాటివల్ల లక్ష్యానికి దూరం కావడం సాహసికుల పద్ధతి కాదు అనుకున్నాడతను.

ఇంతకీ, అతని లక్ష్యం ఏమిటి?

ఏం సాధించాలన్న ఆశయంతో అతను...

# సాగరమథనం

...చేసేందుకు అన్నింటికీ తెగించి సిద్ధమయ్యాడు?

ఆ ప్రయత్నంలో అతను ఎదుర్కొన్న అవాంతరాలేమిటి? ఆ సాహస ప్రయత్న ఫలం చివరికేవిధంగా పరిణమించింది?

## పాలకోడేటి సత్యనారాయణరావు

కలంనుంచి అరుదైన ఇతివృత్తంతో, ఆసక్తికరమైన కథనంతో వెలువడిన 'సాగర మథనం' ఈ నెల చతుర సమగ్ర నవల!

ముఖచిత్రం: దేవదాస్ కుసుమ్

# రచయితలకు ఆహ్వానం

వైవిధ్యంగల ఇతివృత్తాలతో, ఆసక్తికరమైన రచనా సంవిధానంగల నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. ప్రచురించే ప్రతి నవలకు రు.1500/-, అత్యుత్తమ నవలకు రు. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే!

'చతుర'లో బొమ్మలు, ఇతర శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్కన నవల వ్రాత ప్రతిలో మొత్తంమీద 26 వేల పదాలకు తక్కువ కాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో ఒక పేజీలో ఎన్ని పదాలు వచ్చాయనేదానినిబట్టి మొత్తం నవలలోని పదాలను సుమారుగా లెక్క చూసుకోవచ్చును. ప్రస్తుతం వివిధ మాస పత్రికలు ప్రచురిస్తున్న 112 పేజీల నవలలు 'చతుర'లో 70 పేజీలు మాత్రమే అవుతాయి.

* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలించబడతాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరంలేనివారే నవలలను పంపించగలరు.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

**చతుర**

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.

# చతుర ప్రపంచం

## దురాచారం

స్వప్న ఘోష్ అనే యువతికి పెళ్ళిచూపులు జరిగాయి. వరుడికీ, అతని కుటుంబానికీ ఆమె చూడగానే నచ్చింది. ఏప్రిల్ 22 వివాహపు తేదీగా నిర్ణయమైంది. శుభలేఖలు అచ్చయి బంధుమిత్రులకి పంచబడ్డాయి కూడా. విశేషమేమంటే వరుడి తల్లిదండ్రులు కట్నమేమీ లేకుండా ఆమెను కోడల్ని చేసుకునేందుకు సిద్ధపడ్డారు. దీనికి స్వప్న ఇంట్లో అంతా సంతోషించారు.

కాని, పెళ్లిరోజు దగ్గరపడేకొద్దీ వరుడి తరపువారి డిమాండ్లు ఎక్కువ అయ్యాయి. వరుడి తండ్రికి హఠాత్తుగా వధువు కొంచెం నలుపనే విషయం గుర్తొచ్చి, టెలివిజన్ కొనిపెట్టమని అడిగారు.

తర్వాత వాళ్లు డైనింగ్ టేబిల్, కుర్చీలు కోరారు. వరుడి కుటుంబ హోదాకి అవి ఇంట్లో వుండక తప్పదట.

ఏప్రిల్ 15వ తేదీ వివాహం నిశ్చయించుకోవలసిన రోజు. ఆరోజు తాము అడిగినవి తేవాలంటూ వరుడి తరపు



వాళ్లనుంచి వధువు ఇంటికి లేఖ వచ్చింది. పెళ్లికి అన్ని ఏర్పాట్లూ జరుగుతుండగా మధ్యలో ఈ కోరిక అడ్డుపుల్లగా మారింది.

ఏప్రిల్ 10న వధువు కుటుంబానికి అందిన వుత్తరంలో, "మీ అమ్మాయి నలుపు. మీరు మేమడిగిన టెలివిజన్, డైనింగ్ టేబిల్ కొనే స్థితిలో లేరు. మేము అడిగేపని లేకుండానే మీరు ఎంతో కొంత దబ్బిస్తారనుకున్నాం. కాని, మీరు ఏదో కొంత బంగారం మీ పిల్లకు పెట్టుకున్నారు. మా అబ్బాయికి బంగారంతో చిన్న చొక్కా గుండీలు, ఒక వాచీ మాత్రమే పెట్టాలనుకుంటున్నారు. మీరు కట్నమివ్వలేనంత బీద స్థితిలో వుంటారని మేం అనుకోలేదు. ఇప్పుడు మీ సంబంధం కలుపుకోవడం మాకు ఇష్టం లేదు" అని వుంది.

వరుడి తల్లిదండ్రులు ఆవిధంగా కుటిలంగా వ్యవహరించారు. మొదట కట్నకానుకలేవీ అక్కర్లేదన్నది వారే! శుభలేఖలు అచ్చయ్యాక, వధువు కుటుంబం లొంగిరాక తప్పదనే ఆలోచనతో తమకవి కావాలంటూ డిమాండ్లు మొదలుపెట్టారు. అలా స్వప్నకి ఖాయమైపోయిన పెళ్లి కాకుండాపోయింది.

అయితే స్వప్న ఆ విషయాన్ని అంతటితో వదిలిపెట్టలేదు. ఆమె వరుడి కుటుంబం ప్రవర్తించిన రీతినంతా ఓ ప్రముఖ బెంగాలీ దినపత్రికకి రాయగా ఆ లేఖ ప్రచురితమైంది.

ఎన్నో స్త్రీ సంక్షేమ సంస్థలు ఈ కేసుపై న్యాయాన్ని కోరుతూ ప్రభుత్వానికి విజ్ఞప్తిచేశాయి. కాని, ప్రభుత్వం ఇంతవరకూ వరకట్న వ్యతిరేక చట్టం కింద వరుడి కుటుంబంపై ఏవిధమైన చర్యా తీసుకోలేదు!

# నల్లుల్ని తినే రోమనులు

నల్లుల్లో రెండు రకాలున్నాయి. భారత దేశం లాంటి అతి ఉష్ణదేశాలలో వుండే నల్లులు మొదటి రకమైతే, వేడి అంత ఎక్కువగా లేని దేశాలలో వుండే నల్లులు రెండో రకానికి చెందినవి.

వింత ఏమిటంటే, రోమనులు నల్లుల్ని ఇష్టంగా తింటారు. వాళ్లు ఓ గుప్పెడు నల్లుల్ని మింగేసి మంచినీళ్లు గాని, మద్యం గాని తాగేస్తారు. నల్లుల్ని తినడంవల్ల శృంగారంలో ఆసక్తి,



సామర్థ్యాలు పెరుగుతాయని వారి నమ్మకమట!

# నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.



# మీ కుటుంబంలోని వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని ఇవ్వండి!

క్రమం తప్పకుండా కోల్గేట్ ని వాడటంలో మీ కుటుంబంలోని
వారి నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా ఉంటుంది, వారి పళ్ళు యిక దృఢంగా,
ఆరోగ్యంగా ఉంటాయి. కోల్గేట్ రక్షణ చక్రం చేసేది అదే,
వారికది యివ్వడం అయితే.

మీరు పళ్ళు తోముకున్న ప్రతిసారి, కోల్గేట్ యొక్క నమ్మకమైన ఫార్ములా చేసేదిది-చూడండిలాగో.



మీ పళ్ళలో యిరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్ లోని అద్వితీయమైన శక్తిగల నురగ లోపలికి చొచ్చుకుపోయి, అక్కడ గల దుర్వాసన కలిగించే ఆహారపు తునకల్ని, దంతక్షయాన్ని కలిగించే సూక్ష్మజీవుల్ని తొలగిస్తుంది.



క్రమం తప్పకుండా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటే, దాంతో యిక మీకు శుభ్రమైన, తాజా శ్వాస, దాంతోబాటె దృఢమైన, ఆరోగ్యమైన పళ్ళూను.

భోజనం చేసిన తర్వాత ప్రతిసారి మీ కుటుంబంలో వారంతా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటున్నారని ధృవపరుచుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి. వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని యివ్వండి.




## దీని తాజా పిప్పరమెంట్ రుచి మీకెంతో నచ్చుతుంది!

ఆదికాలంలో అయితే నల్లులు ఎక్కువగా జంతువులు, పక్షుల రక్తం తాగి బతికేవి. మనుషులు అరణ్యాల్లో నివసించడం మొదలయ్యాక అవి మానవ రక్తానికి అలవాటు పడ్డాయి.

నల్లులు సాధారణంగా మంచాలు, బల్లలు మొదలైన సామాన్ల తొర్రల్లో వుంటాయి. అవి మానవ రక్తాన్నే కాక, పిల్లులు, కుక్కల్లాంటి పెంపుడు జంతువుల రక్తాన్ని కూడా తాగుతాయి.

మామూలుగా నల్లులు బల్లపరుపుగా వుంటాయి. పూర్తిగా పెరిగిన నల్లి 6 మిల్లీమీటర్ల పరిమాణం వుంటుంది. నల్లుల శరీరానికి ముడుచుకునే లక్షణం వుండటం వల్ల అవి ఎలాంటి ఆకారం గల తొర్రల్లో అయినా దూరిపోగలవు.

నల్లులకి దృష్టి మందంగా వుంటుందని నమ్ముతారు గాని, కొన్ని గజాల దూరం లోంచి కూడా తమ ఎరలను గుర్తించ గలవు. అయితే నల్లులు ఎరల దగ్గరికి ఎలా చేరుకుంటాయనేది ఇంకా నిగూఢం గానే వుంది.

నల్లులు మంచం ఎక్కడానికి వీల్లేకుండా ఏర్పాట్లుచేసుకున్నా సరే,అవి గది కప్పు మీదకి పాకి అక్కడినుంచి మంచంమీద వున్న వారి మీదకు దూకి రక్తం తాగుతాయి.

నల్లులకి ఎంత రక్తం కావాలనేది అది నివసించే ప్రాంతపు శీతోష్ణస్థితిపై ఆధార పడి వుంటుంది. శీతలప్రాంతాలలో వుండే నల్లులు 500 రోజుల వరకూ రక్తం తాగకుండా వుండగలవు. శీతోష్ణస్థితి 15 సెంటీగ్రేడ్ వున్నచోట ప్రతి ఆరు రోజులకి, 25 సెంటీగ్రేడ్ మించిన చోట ప్రతిరోజూ నల్లులకి రక్తం కావాలి.

నల్లిని నలిపితే ఘాటైన వాసన వస్తుంది. ఈ వాసన నల్లి గొంతు దగ్గిర వుండే ఓ గ్రంథినుంచి వెలువడుతుంది. నల్లికి కడుపు నింపుకోడానికి 5 నుంచి 10 నిముషాలు పడుతుంది. రక్తంతో నిండగానే బల్లపరుపుగా వుండే దాని శరీరం సాగి, ఉబ్బుతుంది.

నల్లులు సాధారణంగా తెల్లారుజామున 3 నుంచి 6 గంటల మధ్య రక్తం తాగు తాయి. ఆ సమయానికల్లా నిద్రనుంచి లేస్తే వాటిని తప్పించుకోవచ్చు. నల్లులు లైటు వెలుగులో బైటకు రావు. కనుక లైట్లు వుంచి నిద్రపోవచ్చు!

ఆడనల్లి సాధారణంగా రోజుకి మూడు గుడ్లు పెడుతుంది. రక్తం ఎంత ఎక్కువ తాగితే, అన్ని ఎక్కువ గుడ్లు పెడు తుంది. గుడ్డు నుంచి నల్లి పుట్టడానికి దాదాపు 3 వారాలు పడుతుంది. 3 నెలలకి అది పూర్తిగా పెరిగి మానవ రక్తం జుర్రుకోడానికి బైలుదేరుతుంది.

# ఆ వేట కథ

ఆదివాసుల జీవన విధానం మిగిలిన వారికి భిన్నంగా వుంటుంది. అరణ్య, పర్వత ప్రాంతాల్లో నివసించేవారి పండుగలు, ఆచార సాంప్రదాయాలు, దుస్తులు, జీవనరీతులు అన్నీ పట్టణాలు, నగరాల్లో నివసించే ప్రజలకి భిన్నంగా వుంటాయి. వారి ఆచారాలు కొన్ని బైటివారికి అసలేమీ తెలియవు. అలా మొగలుల కాలంలో పుట్టిన కొన్ని ఆచారాలు బీహార్‌లోని 'పాలమావు', 'రాంచి' జిల్లాలలో నివసించే 'ఒరావోన్', 'ముండా' అనబడే ఆదివాసులలో ఇప్పటికీ ప్రబలంగానే వున్నాయి. 12 ఏళ్ళకోసారి ఫాల్గుణ లేక చైత్ర (ఫిబ్రవరి, మార్చి) మాసాలలో ఆ



జాతి స్త్రీలు ఓ వింత ఆచారాన్ని పాటిస్తారు.

ఆ కాలంలో ఆ జాతి స్త్రీలు పురుషుల దుస్తులు ధరించి, కత్తులు, బల్లాలు, విల్లంబులు, చేతికర్రల్లాంటి ఆయుధాలతో చిన్న చిన్న జంతువుల్ని వేటాడేందుకు బైలుదేరుతారు. తమకు దొరికిన కూరగాయలు, ఇతర ఆహార వస్తువులను కూడా వాళ్లు సేకరిస్తారు. సాయంత్రానికి వాటన్నిటితో పాటు ఇంటికి చేరుకుని, వాటిని వండి విందు చేసుకుంటారు.

'ఈ ఆచారం ఎలా పుట్టింది?' అనే దానికో కథ వుంది. 'ఒరావోన్' జాతి వాళ్ల రాజ్యానికి రాజధాని 'రోహతస్ ఘర్'. ఒకసారి 'రోహతస్' రాజైన పురుగాన్ ఠాకూర్ కోటను మొగలులు ముట్టడించి, ఆ యుద్ధంలో ఓడిపోయారు. వాళ్లు రెండోసారి ప్రయత్నించినపుడు కూడా విఫలులే అయారు.

అయినా మొగలులు పట్టువదలకుండా మూడోసారి ఓ గొల్లభామకి కానుకలిచ్చి సంతోషపర్చి, ఆమెను ప్రసన్నం చేసుకున్నారు. పండుగరోజుల్లో తమ జనం తాగి ఏమీ పట్టించుకోకుండా తిరుగుతారు గనక ఆ సమయంలో 'రోహతస్ఘర్'ని ముట్టడిస్తే విజయం పొందవచ్చునని వారికి సలహా ఇచ్చిందామె. ఆమె సలహా ప్రకారం మొగలులు ఆ రాజ్యాన్ని ముట్టడించినప్పుడు పురుషులెవరూ యుద్ధానికి సిద్ధంగా లేరు. దాంతో స్త్రీలే యుద్ధానికి వెళ్లారు. మొగలులు ఆ ముట్టడిలో 'ఓరావోన్' జాతివాళ్లను ఓడించగలిగారు. అప్పట్నుంచి ఆ యుద్ధం జ్ఞాపకార్థం 'ఓరావోన్' జాతి స్త్రీలు 12 ఏళ్లకోసారి వేటకు వెళ్తున్నారు.

మరోగాథ కూడా వుంది! ముండా జాతి రాజు తన రాజధానిని 'సుతియాంబె' నుంచి 'ప్రపిర్ ఘర్'కి మార్చాడట. అది జరిగిన కొన్నాళ్లకి రాణికి బాగా జబ్బు చేసిందట.

ఓ జ్యోతిష్యుడు రాణి కోలుకోవాలంటే ఇద్దరిని బలిఇవ్వాలని రాజుతో చెప్పాడట. దానికి రాజు పడవవాడితో ఓ ఇద్దరు బాలుర్ని ఎక్కించుకుని పడవ నది మధ్యలోవుండగా నీటిలోకితోసి ముంచేయ మని చెప్పాడట దానికి ఆ పడవవాడు సరేనని తీరా ఆ రాజుని, ఆతనికి సంబం ధించినవారినే నీట్లో ముంచేశాడట.

అది జరిగాక ఆ రాజ్యంలో తీవ్రమైన క్షామమేర్పడి, అది 12 ఏళ్లపాటు కొనసాగిందట. ప్రజలు ఆ కాటకాన్ని ఏమాత్రం తట్టుకోలేని స్థితికి చేరుకున్న ప్పుడు జ్యోతిష్కులు తమ స్త్రీలను వేటకు పంపితే వర్షాలు కురిపించే దేవుడైన ఇంద్రుడు శాంతిస్తాడని చెప్పారట. ఆవిధంగా స్త్రీలు ఆయుధ ధారులై వేటకు వెళ్లగానే కుంభవర్షం కురిసిందట. అప్ప ట్నుంచీ మందాజాతి స్త్రీలు ఆ ఆచారాన్ని కొనసాగిస్తున్నారట!

# వింత మహిళ

కన్యాకుమారి పట్టణంలో 'మాయమ్మ' అనే ఓ వింత మహిళ వుంది. ఆమెకు ఎప్పుడూ తోడుగా రాజేంద్రన్ అనే సహాయకుడు, 20 కుక్కలు, 40 కుక్కపిల్లలు వుంటాయి. చాలామంది ఈ వృద్ధురాలి గురించి 'కన్యాకుమారియే తిరిగి పునర్జన్మ ఎత్తింది' అంటుంటారు.

మాయమ్మ ఎప్పుడూ సముద్రపు ఒడ్డున కూర్చుని సముద్రతరంగాల హోరు వింటూనో, కునుకు తీస్తూనో గడుపు తుంది. ఆమె చుట్టూ ఎప్పుడూ అనేక మంది భక్తులు వుంటారు. వాళ్లంతా తమంతట తామే ఆమెకు భక్తులై తమ జీవితాన్ని ఆమె సేవకై వినియోగించాలని నిర్ణయించుకున్నవారే. ఆమెకు ఎలాంటి ప్రచారం లేదు.

భక్తులు ఆమెకు అనేక శక్తులున్నట్టు



చెబుతుంటారు. 'మాయమ్మను ఎవరయినా ఒక్కసారి కలుసుకుంటే చాలు, వారి సమస్యలన్నీ మటుమాయమైనట్టే!' అని వారి నిశ్చితాభిప్రాయం. లాటరీ తగలడం, పెళ్ళి కావడం, జబ్బులు తగ్గిపోవడం - ఇవన్నీ ఆమెను కల్సినవారికి సంభవిస్తాయట!

మాయమ్మ శిష్యులు ఆమెను, ఆమె కున్న కుక్కలు, కుక్కపిల్లలను గురించి శ్రద్ధ వహించడానికి 'మాయమ్మ సమాజం' అనేదాన్ని నడుపుతున్నారు. మాయమ్మ ప్రధాన సహాయకుడయిన రాజేంద్రన్ స్థానిక భవంతుల్లో మొజాయిక్ పనిచేసేందుకు 10ఏళ్ళ క్రితం కన్యాకుమారి వచ్చాడు. ఆమెకుగల దైవ శక్తులు రాజేంద్రన్‌ను ఆకట్టుకోవడంతో ఆమెకు ముఖ్య భక్తుడిగా మారిపోయాడు. ఆమెకు ఆహారాదులు సమకూర్చడం, ఆ కుక్కల గురించి శ్రద్ధ తీసుకోవడం, బయట వ్యవహారాల్లో తోడ్పడటం- అన్నీ రాజేంద్రన్‌యే చేస్తుంటాడు.

మాయమ్మ ప్రాతఃకాలమే నిద్రలేచి, సముద్రంలో స్నానం చేస్తుంది. క్రితం రోజు రాత్రి తాను తగలేసిన చెక్కల బూడిదను సేకరించి ఆ బూడిదను సముద్రపు ఒడ్డున వివిధ ప్రాంతాలలో కలిపేస్తుంది. ఆవిధంగా మాయమ్మ సముద్రాన్ని శుద్ధిచేస్తోందని భక్తులు అంటారు.

తర్వాత ఆమె వివేకానందుడి కాంస్య విగ్రహం దగ్గరికెళ్ళి అక్కడే నిద్రపోతుంది. తిరిగి ఆమె మధ్యాహ్నం 3 గంటలకి నిద్రలేస్తుంది. అప్పటికి రాజేంద్రన్ ఆమెకూ, ఆమె కుక్కలకీ ఆహారం సిద్ధంచేసి వుంటాడు. ఆమె ఆహారం కొద్దిగానే స్వీకరించి, భక్తులను కలుసుకోవడం ప్రారంభిస్తుంది. ఆమె తన భక్తులకి ప్రసాదంగా కొందరికి అరటిపండును, మరికొందరికి 'టీ'ని ఇస్తుంది.

సూర్యాస్తమయానికి ముందు మాయమ్మ, ఆమె భక్తులు, కుక్కలు కన్యాకుమారిలోని కొన్ని వీధులవెంబడి తిరుగుతారు. వాళ్ళు అలా తిరుగుతున్నపుడు హోటల్ యజమానులు కొందరు వాళ్ళంతట వాళ్ళే వచ్చి కుక్కలకి ఏదో ఒకటి పెడుతుంటారు.

ఇటీవల ఈ వృద్ధురాలు స్థానిక పారిశ్రామికవేత్త అయిన శివశంకరన్ పిళ్లై ఇంట్లో రాత్రివేళల్లో నిద్రిస్తోంది. పిళ్లై తాను వ్యాపారంలో అంత బాగుపడటానికి మాయమ్మకున్న శక్తులే కారణమని చెబుతుంటాడు. మాయమ్మ పెంచే కుక్క తన యజమానురాలు ఉదయం నిద్ర లేచేంతవరకూ పిళ్లై ఇంటి బయట పడుకుని వుంటుంది.

చాలామంది విమర్శకులు మాయమ్మకు నిజానికి అద్భుతమైన శక్తులేవీ లేవని చెబుతున్నారు.ఆమె తిరిగి అవతారమెత్తిన దైవమేమీ కాదని కూడా అంటున్నారు వాళ్లు.

"40 ఏళ్ళ క్రితం మహారాష్ట్రకు చెందిన ఆమె కన్యాకుమారికి ఒక యాత్రికురాలిగా వచ్చింది. ఎందువల్లనో ఆమె కన్యాకుమారిలోనే స్థిరపడిపోయింది. మొదట్లో చేపలు పట్టుకుని బతుకుతుండేది. అప్పట్లో తోడేళ్లు ఆమెపై దాడిచేస్తే ఆమెను కుక్కలే రక్షించాయి.ఆ కృతజ్ఞత కొద్దే ఆమె కుక్కలను పెంచుతోంది" అంటారు వాళ్లు.

❋




ఆకాశంలో వెలిగేది ధ్రువతార
సినీ జగతిలో వెలిగేది సితార

- ఆబాలగోపాలాన్ని 'హలో' అంటూ పలకరిస్తుంది సితార
- మీరు అభిమానించేది ఏ తారనైనా సరే– మీకు కావలిసింది సితార
- మల్టీకలర్ ముఖచిత్రమే కాదు, అనేక రంగుల సెంటర్ స్ప్రెడ్‌తో మిమ్మల్ని మురిపించి, మైమరపిస్తుంది సితార
- సినిమాకు సంబంధించిన అన్నిరకాల వార్తలకు, వ్యాఖ్యలకు, కబుర్లకు, విమర్శలకు పెట్టింది పేరు సితార

# సాగర మధనం

పాలకోడేటి సత్యనారాయణరావు



కిటికీ ముందు నిలబడి కనపడని బయటి ప్రపంచాన్ని చూస్తున్నాడు ఈశ్వర్. అతనికేమీ కనపడటంలేదు. కానీ చూపులు మాత్రం దేన్నో చూస్తున్నట్లుగానే సాలోచనమైనట్టున్నాయి.

మిన్ను, మన్ను ఏకమయ్యేలా కురుస్తోంది వర్షం. అప్పటికి అది నాలుగో రోజు వర్షం అలా ఏకధారలా కురవటం. ఇంకో రెండు రోజులు ఈ వర్షం ఇలాగే కురిస్తే ప్రాణులన్నీ నిర్జీవాలయిపోయే ప్రమాదం ఉంది.

బంగాళాఖాతంలో తుఫాను. సముద్రంలో ఎక్కడో ఆరంభమయిన చిరుగాలి శక్తి స్తోమతలు నింపుకొని ఉవ్వెత్తున ఎగిసిపడే కెరటాల రూపంలో విరుచుకు పడుతోంది. ఉప్పెన ప్రమాదం కూడా ఉందని ప్రభుత్వం హెచ్చరికలు చేస్తూనే ఉంది. ఏ క్షణంలో ఈ కెరటాలు మరింత జోరుగా ముందుకొచ్చి, చెలియలికట్ట దాటి, జనారణ్యాలను కబళిస్తుందో ఎవరూ చెప్పలేకుండా ఉన్నారు. జనం అంతా ప్రాణాల్ని అరిచేత్తో పట్టుకొని బతుకుతున్నారు. చావునుంచి తప్పించుకోవాలని తాపత్రయపడుతున్నారు.

బంగాళాఖాతంలో తుఫానులు రావటం కోస్తాజిల్లాలకు కొత్తేమీకాదు. అది ఆ జిల్లా ప్రజల చరిత్రలో ఓ భాగం. తుఫానుకు ముందు ఎలా తప్పించుకోవటమా అనీ, తుఫాను తర్వాత ఈ జీవితం ఎలా కొనసాగించటమా అనే ప్రశ్నలూ వారి చరిత్రలో భాగమే అయ్యాయి.

ఇన్ని ప్రభుత్వాలు, ఇన్ని సహాయక సంస్థలూ ఏవీ వీటి గురించి పట్టించుకోవు. తుఫానుల సమయంలో ప్రభుత్వాలు వాగ్దానాల వర్షాలు కురిపిస్తాయి. శాశ్వత పరిష్కార చర్యలు తీసుకొంటామనీ, తుఫాను రాకుండా అరికట్టలేం కాబట్టి తుఫానువల్ల సంభవించే నష్టాన్ని తగ్గించే యత్నాలు చేస్తామనీ, ప్రజల రక్షణకోసం కోస్తా అంతటా పెద్దపెద్ద షెల్టర్లు నిర్మిస్తామనీ... వాగ్దానాలు ! తుఫాను తగ్గిపోగానే వాగ్దానాలన్నీ ఆ తర్వాత ఎండకు ఎండిపోతాయి. వర్షాలు కురిసినంత కాలం, ప్రాణభీతి ఉన్నంతకాలమూ వాగ్దానాల్ని తల్చుకొని బతికే జనం, ఎండలు రాగానే వాటి గురించే మర్చిపోతారు.

ఫలితం – మళ్లీ తుఫాను, మళ్ళీ వాగ్దానాలు !!

మధ్యతరగతివారికి, ఉన్నత వర్గాల వారికీ ఫర్వాలేదుగానీ, పొట్టచేత బట్టుకొని చేతి కష్టంతో ఏరోజుకారోజు కడుపు నింపుకొనే కూలి జనం సంగతేమిటి? ఇప్పుడు పనులుండవు. తుఫాను తగ్గాక, పంటలు ఉండవు గాబట్టి పనులూ ఉండవు. పనులు ఉండవు కాబట్టి కడుపు నిండే మార్గమూ ఉండదు.

ఈశ్వర్‌కు ఆ క్షణంలో గంగులు గుర్తుకొచ్చాడు. క్షణం ఈశ్వర్ గుండె కోతకు గురయింది.

ఎలా ఉంటున్నాడో ఈ క్షణంలో గంగులు?

తుఫాను తగ్గేసరికి ... ఉంటాడో ఉండడో అసలు ! గంగమ్మ తల్లి కన్నబిడ్డలు వాళ్ళు. గంగపుత్రులు. ఈ తుఫాను బీభత్సం వాళ్ళకు కొత్తకాదు. కెరటాలెత్తి రావటం, ఆ కెరటాలమీదే నివసించటం వారికి తప్పనిసరి. నిత్యమూ ఆటుపోట్లకు గురవటమే వారి జీవన విధానం. అయినా... ఇంతటి తుఫాను ఎంతటి వారినైనా లొంగదీసుకునేలా ఉంది. ఎంత అలవాటుపడ్డ ప్రాణమైనా, ప్రకృతి ఇలా ఎత్తివస్తే తల ఒగ్గక తప్పదేమో !





అయినా గంగులుకు ఏమీకాదు, కాకూడదు అనుకొన్నాడు ఈశ్వర్.

గంగులు ఈశ్వర్‌కు ఏమీకాడు. సముద్రం ఒడ్డున ఇసకలో నత్తగుల్లలు, శంఖాలూ ఏరుకొనే రోజులనుంచి ఈశ్వర్‌కు గంగులు తెలుసు. చిన్న కర్ర పడవను తోసుకొంటూ అలల మీదకు అలవోకగా వెళ్ళిపోయే గంగుల్ని చూస్తోంటే, ఈశ్వర్‌కు ఆశ్చర్యంగా ఉండేది. అల వస్తోందంటేనే అడుగు వెనక్కు పడేది తనకు. అలాటిది గంగులు అలలంటే భయపడడు సరికదా, వాటితో సవాలు చేస్తున్నట్లుగా వాటి మీదకు సవారీకి వెళ్ళినట్లుగా వెళ్ళిపొయ్యేవాడు.

ఒకరోజు అలాగే ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయిన ఈశ్వర్ దగ్గర కొచ్చాడు గంగులు.

"నీకు సముద్రమంటే భయంలేదూ?" అనడిగాడు ఈశ్వర్.

"బయిమా... ఎందుకు?" అన్నాడు గంగులు ఆశ్చర్యంతో.

ఈసారి ఆశ్చర్యపోవటం ఈశ్వర్ వంతు అయింది. నిజమే, భయం ఎందుకు! సముద్రంలో అలలుంటాయి. కెరటాలు ఉంటాయి. కెరటాల అడుగున చేప లుంటాయి. తిమింగలాలు ఉంటాయి... ఇంకా ఎన్నెన్నో ఉంటాయి. భయం అందుకు...! అదే అన్నాడు.

గంగులు నవ్వాడు. "అలలన్నీ ఈడనే ఉంటాయి. సంద్రం మీదకుపోతే అల లుండవు. ఇక చేపలు పట్టేవోడికి సంద్ర మంటే బయిమైతే ఎట్టా ?" అన్నాడు.

ఈశ్వర్‌కు జ్ఞానబోధ జరిగింది.

చేపలుపట్టేవాడికి నీళ్ళంటే, సముద్ర మంటే భయం ఉండదు. మరి ఇతరులకు మాత్రం భయం దేనికి? భయం కేవలం మానసికమైనది. ఎందులోనూ భయ మన్నది లేదు. భయపడటమన్నది మన లోనే ఉంది. మనసుల్లో భయం లేకు ఎక్కడా భయంలేదు. ఏదీ భయపెట్టదు.

ఈశ్వర్ భయపడటం మానేశాడు. సముద్రమంటే అంతక్రితం ఉన్న భయం ఇపుడు లేదు. ఆసక్తి ఉంది. సముద్రానికి అవతల, సముద్రానికి లోపల ఏముందో తెలుసుకోవాలన్న అభిలాష ఉంది.

ఆ అభిలాషవెనుక గంగులు అదృశ్య హస్తం ఉంది. అతను నిరంతరం సముద్ర గర్భంలోంచి వలలువేసి తెచ్చే మత్స్య సంపద ఉంది.

"సముద్రం నీళ్లు మనం తాగలేంగదా! మరి చేపలెలా తాగుతాయి?"

"సముద్రంలో చేపలు మామూలు నీళ్ళలో కూడా బతుకుతాయా?"

"సముద్రంలో ముత్యాలు దొరుకు తాయా? శంఖాలలో ఏం ఉంటాయి??"

గంగులు ఆ ప్రశ్నలు విని నవ్వేవాడు. ఆ తర్వాత ఆ ప్రశ్నలకు జవాబులు తనకు తోచినట్లు చెప్పేవాడు. కొన్ని ప్రశ్నలకు సమాధానం తెలీకపోయినా తెలీదని చెప్పేవాడు కాదు. ఏదో కల్పించి అయినా చెప్పేవాడు. ఏ ప్రశ్నకైనా తాను జవాబు చెప్పలేకపోతే, ఆ పిల్లాడి ముందు తన పరువు పోతుందన్న భయం గంగులుది.

"సముద్రం మీదకు మీరు వెళ్లినపుడు మిమ్మల్ని సముద్రం మింగెయ్యదా?" అనడిగాడు ఈశ్వర్ ఒకసారి.

"మేం రోజు నిద్దర లేవగానే సంద్రానికే దణ్ణం ఎట్టుకొంటాం ! మమ్మల్ని ఆ గంగమ్మ తల్లే సల్లంగా చూస్తుంది. మాకే బయిమూ నేదు. ఏ కెరటమూ మమ్మల్ని దెబ్బకొట్టలేదు. ఆపదలో ఉన్నప్పుడు ఆ

# ప్రకృతి చెప్పే పాఠాలు...





ప్రకృతి నుంచి మనం నేర్చుకోదగ్గవి ఎన్నో ఉన్నాయి. కొద్ది కొద్దిగా కూడబెట్టి దాన్నే పెద్ద మొత్తంగా చేసే నేర్పు కూడా అందులో ఒకటి. ఈ సూత్రాన్ని ఆచరణలో పెట్టడానికి మార్గదర్శి మీకు తోడ్పడుతుంది. చిన్న చిన్న మొత్తాలలో పొదుపుచేసి పెద్ద మొత్తం పొందే అవకాశాలు మీ అందుబాటులో ఉంచుతుంది.

అంతేకాదు, రెండు దశాబ్దాల వ్యాపారానుభవం ఉన్న మార్గదర్శి మీరు పొదుపుచేసే మొత్తాలకు పూర్తి భద్రత సమకూరుస్తుంది. లాభసాటి డివిడెండ్లు కూడా వరుసగా ఆ మొత్తాలకు తోడవుతూ ఉంటాయి. మార్గదర్శిలో పొదుపు భవిష్యత్తుకు మదుపు అని లక్ష మందికి పైగా ఇప్పటికే గ్రహించారు. మరి, మీ మాటేమిటి ?

డబ్బు కోసమేనా మీ చింత - మార్గదర్శి వున్నది మీ చెంత!



## మార్గదర్శి

చిట్ ఫండ్ ప్రైవేటు లిమిటెడ్

మార్గదర్శి హౌస్, అబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

**శాఖలు: ●అబిడ్ సెంటర్, హైదరాబాద్ ●లక్డీకాపూల్, హైదరాబాద్ ●చిక్కడపల్లి, హైదరాబాద్ ●అమీర్‌పేట, హైదరాబాద్ ● చాంద్రా కాంప్లెక్స్, ఎమ్.జి.రోడ్, సికిందరాబాద్ ●బిసెంట్ రోడ్, విజయవాడ ●బందరు రోడ్, విజయవాడ ●మెయిన్ రోడ్, గుంటూరు ●మెయిన్ రోడ్, కాకినాడ ●ఇన్నీసుపేట, రాజమండ్రి ●పెహూరి రోడ్, కర్నూలు ●మెయిన్ రోడ్, విశాఖపట్నం ●జె. పి. ఎన్. రోడ్, వరంగల్, ●వైరారోడ్, ఖమ్మం**

కెరటాలే మమ్మల్ని ఒడ్డుకు చేరుస్తాయి" గంగులు ఇచ్చిన జవాబు ఈశ్వర్ మనసులో ముద్రితమయింది.

విశ్వాసం. అచంచల విశ్వాసం వారికి రక్షణ ఇస్తోంది. జీవికనిచ్చే సముద్రం జీవితాన్ని దెబ్బతీయదనే నమ్మకమే వారిని సముద్రం మీదకు నడిపిస్తోంది.

పాఠశాలలు, కాలేజీలు ఏవీ నేర్పని ఎన్నో జీవితపాఠాల్ని గంగులు ఈశ్వర్‌కు నేర్పాడు. ఆ సంగతి గంగులుకు తెలీదు గాని ఈశ్వర్‌కు తెలుసు. అలాంటి గురు తుల్యుడు గంగులు ఈ క్షణంలో...ఈ తరగని తుఫానులో ఏ అవస్థలపాలవు తున్నాడోనన్నదే ఈశ్వర్ భయం!

తుఫాను తగ్గగానే ముందు చేయాల్సిన పని గంగుల్ని వెళ్ళి చూసిరావటమే!

కానీ ఈ తుఫాను ఎప్పటికి తగ్గేను? ఎప్పటికీ ప్రకృతి రవ్వంత శాంతించేను? ఎన్నటికీ ఉధృతం ఉపశమించేను??

రేడియో తన రణగొణల మధ్య తుఫాను హెచ్చరికలు చేస్తూనే ఉంది. వింటున్నకొద్దీ అతనికి విసుగొస్తోంది. ఏ ప్రకటన విన్నా భాష మారటం లేదు. భావం మారటంలేదు. 'బంగాళాఖాతంలో ఏర్పడ్డ తుఫాను తీరానికి ఇన్ని కిలో మీటర్ల దూరంలో కేంద్రీకృతమయివుంది. ఫలానా సమయానికి ఇది తీరం దాటే అవ కాశం ఉంది. దీని కారణంగా ఇన్ని కిలో మీటర్ల వేగంతో గాలులు ప్రచండంగా వీస్తాయి....' ఇదే ఏ ప్రకటన విన్నా! అందుకే ఈశ్వర్ ఆ హెచ్చరికలు వినటం మానేశాడు.

గదిలో ఏదో అలికిడి అయితే వెనక్కు తిరిగాడు ఈశ్వర్. రెండు కప్పులతో టీ తెస్తూ భార్య ఉమ!

ఈశ్వర్‌కు ఉమంటే ఆ క్షణంలో చెప్పలేనంత ఇష్టం కలిగింది. ప్రపంచం తల్లకిందులవుతోందా అన్న రీతి ప్రళయం ముంచెత్తుతోంటే, నిశ్చింత టీ కాచి తేగలగటం గొప్ప విషయంకాదూ!

భార్య చేతిలోంచి టీ కప్పు అందు కొంటూ అదే అన్నాడు.

ఉమ నవ్వింది. "రోమ్ కాలుతోంటే నీరో వయొలిన్ వాయించుకొన్నాడంటారు. నాలో మీకు అదే కనిపిస్తోందేమోగానీ నాకు అది తప్పనిపించటం లేదు. ఈ తుఫాను నేను ఆపగలిగేదికాదు. తుఫాను నష్టాన్ని అంచనా కట్టి ఆదుకోగలిగేది నేను కాదు. మరెందుకు బాధపడటం?" అంది.

అలా అందేకానీ ఉమ మనసులో కూడా విషాదం గూడు కట్టుకొనే ఉంటుం దని ఈశ్వర్‌కు తెలుసు. లోపలి బాధను పైకి వ్యక్తం చెయ్యకుండా పెదాలమధ్య చిరునవ్వుతో అణచివేసే ప్రయత్నం ఆమెది.

ఈశ్వర్ దీర్ఘంగా నిట్టూర్చాడు. "ఎప్పుడు తగ్గుతుందో ఈ తుఫాను?"

"జోస్యం చెప్పనా? నిజం చెప్పనా??"

"రెండూ చెప్పు!"

"నా జోస్యం ప్రకారం ఈ తుఫాను ఇంకో రెండు మూడు రోజులయినా ఉంటుంది. కానీ ఇది ఈరోజు సాయం త్రానికే తగ్గు ముఖం పడుతుందని రేడియో అంటోంది"

ఈశ్వర్ ఉలిక్కిపడ్డాడు. కిటికీలోంచి చూస్తే ఇంకా దట్టంగా కురుస్తున్న వర్షం. అయినా రేడియో అలా అందంటే మనసులో చెప్పలేని హర్షం.

"నిజమా?" అనడిగాడు ఈశ్వర్.

"నిజమే! ఇప్పుడే విని వచ్చాను" అంది ఉమ.

"అదొక్కటీ గొప్ప విషయం- ఇంతటి తుఫానులోనూ రేడియో పని చెయ్యటం"

"అదొక్కటే ఏం ఖర్మ నేను లేనూ? మూడు రోజులనుంచీ ఎడతెగని వర్షం. అయినా మీకు టీ ఇస్తూనే ఉన్నా! పాలు ఎక్కడివి అనైనా అడిగారుకాదు" అంది ఉమ. ఈశ్వర్ ఆ ప్రశ్న అడగలేదు కానీ ఉమ ఆ మాట అన్నాక మాత్రం 'నిజమే సుమా!' అన్నట్లుగా మెచ్చుకోలుగా చూశాడు.

"స్త్రీలకు ముందుచూపుంది. అది మీరు గుర్తించటం మంచిది" అంది ఉమ.

"నాకెందుకో గంగులు గుర్తొస్తున్నాడు" అన్నాడు ఈశ్వర్.

ఉమ సాలోచనగా భర్తకేసి చూసింది. "ఎందుకో ఏమిటి? మీకు గంగులు ఆరో ప్రాణం! రోజుకోసారి అయినా అతన్ని చూడందే మీరుండలేరు? ఏదో జన్మలో మీకూ, అతనికీ ఏదో తీరని బంధం ఉండే ఉంటుంది" అంది ఉమ.

"ఏదో జన్మలో ఎందుకూ? ఈ జన్మలోనూ ఉండేవుంటుంది!"

ఎక్కడో ఏదో శబ్దం వారి సంభాషణను తెంచివేసింది. ఏదో పెద్ద చెట్టు కూలిన శబ్దం.

"ఆ చెట్టుతోబాటు ఎన్ని జీవితాలు కూలిపోయాయో!" అన్నాడు ఈశ్వర్.

"గీతలో కృష్ణుడంటాడు - 'పాపం పెరిగి దుష్టుల సంఖ్య మితిమీరినపుడు నేను మళ్లీమళ్లీ అవతారం ఎత్తుతూనే ఉంటాను. వారిని సంహరిస్తూనే ఉంటాను' అని. ఈ కలికాలంలో దేవుడు ఇలాటి వైపరీత్యాల రూపంలో పుడుతున్నాడేమో ననిపిస్తుంది నాకు! లేకుంటే ఈ తుఫానులు, ఈ ఉప్పెనలు, ఈ కరువులు కాటకాలూ.. ఇంతకుముందెప్పుడూ మనం కనీ వినీ ఎరగంగదా! ఇపుడో.. ప్రతీ ఏడాదీ ఇదే చరిత్ర.."

"అంటే, ఇటీవలి కాలంలోనే పాపుల సంఖ్య పెరిగిపోయిందంటావ్?"

"అయి ఉండొచ్చు. మిగిలినవారి మాట ఎలా ఉన్నా, కీర్తిశేషుడైన మన యువరాజు మాత్రం దీనికి సంతోషించి తీరేవాడనే నా నమ్మకం! జనాభా సంఖ్య ఎలా తగ్గించాలా అని తెగ మధనపడేవాడు పాపం! ఇలాటి తుఫానులవల్ల వేలమంది పోతోంటే సంతోషించేవాడుట"

ఉమ అనేది అర్థం అయి ఈశ్వర్ నవ్వాడు. "చచ్చినవాడి గురించి మంచేకానీ చెడు చెప్పుకోకూడదని ఆ గీతలోనే కృష్ణుడెవరితోనూ అనలేదేమిటి?"

ఈసారి ఉమ కూడా ఫక్కుమంది.

"పోన్లెండి...ఈ తుఫాను ఎవరికోసం వచ్చిందోగానీ,వెంటనే తగ్గితే బాగుండును. నాకు బోలెడు కార్యక్రమాలు ఉన్నాయి"

"ఇపుడంతా తీరికేగదా, ఇపుడు చేసుకోవచ్చుగదా!"

"అహహ! నా కోరికలేవీ ఇన్‌డోర్‌లో తీరేవికావు. తుఫాను వెలియగానే వెళ్లి వారం రోజులపాటు ప్రతి సినిమా చూసి రావాలి! అదీనా కోరిక" అంది ఉమ.

ఈశ్వర్ ఆశ్చర్యపోయాడు. ఎంతగా పెరిగిపోయిందీ జాడ్యం! రెండు రోజులు సినిమా లేకుంటే ప్రాణాలు వదిలిపెట్టే స్థితికి వచ్చేశారీ జనం! నలుగురొక చోట చేరినపుడు మొదటి అయిదు నిమిషాలు ఏం మాట్లాడుకొన్నా, ఆరో నిమిషం మాట్లాడుకొనేది మాత్రం సినిమాల గురించే అవుతోంది! ఈ జాడ్యం వదిలే అవకాశం ఏదీ లేదా ??




"ఏమిటి ఆలోచిస్తున్నారు?" అడిగింది ఉమ.

"ఈసారి తుఫానువస్తే సినిమా టాకీసులు మాత్రమే ఆ దెబ్బకు గురి అయితే ఎలా ఉంటుందా అని ఊహించు కొంటున్నాను!" అన్నాడు ఈశ్వర్.




ఆఖరికి ఉమే ఓడిపోయింది. ఆరోజు సాయంత్రానికే తుఫాను తగ్గుముఖం పట్టింది. అప్పటికప్పుడు వెళ్ళి గంగుల్ని పలకరించి వస్తానన్నాడు ఈశ్వర్. ఉమ ఒప్పుకోలేదు.

"రేపు ఉదయమే వెళ్లరుగానిలెండి" అనేసింది ఖరాఖండిగా.

ఈశ్వరరావు మర్నాడు ఉదయమే గంగులు ఉండే బెస్తవాడకు బయలు దేరాడు.

ఓ వంద గుడిసెల పల్లె అది. అందరూ మత్స్యకారులే అక్కడ. ఉదయమే భుజాన ఓ నైలాన్ వలను వేసుకొని, ఒడ్డున ఉండే కర్రబోటును అలల మీదికి తొయటంతో ఆరంభమవుతుంది వాళ్ళ జీవితం. మళ్ళీ తిరిగి రావటం సాయంత్రానికే. ఒక్కోసారి అదీ ఉండదు. ట్రాలర్ బోటుమీద బయలుదేరితే, ఆ వేట వారం పదిరోజులు సాగుతుంటుందికూడా. ఎప్పుడు పట్టినవి అప్పుడు తీరం చేరుస్తూ ఉంటారు లేదా అందులోనే నిలవ ఉంచటమూ ఉంది. పల్లెలోకి అడుగు పెట్టగానే అదో రకమైన కంపు ఆవరి ఉంటుంది. మత్స్య గంధమేమో అది

ఈశ్వర్‌కు ఆ దారంతా కొట్టిన పిండి. అందుకే అడుగులు వడివడిగా పడు తున్నాయి.

నిన్నటి వరకు ఎగిరెగిరి పడిన సముద్రం ఇపుడేమీ ఎరగని సంగనాచి లాగా ఉంది. ఎందర్నో ఎత్తుకెళ్ళి అమాయకత్వం నటిస్తున్న బూచిలావుంది. ఈశ్వర్ అడుగులు వేస్తూ వేస్తూ ఉన్న ట్లుండి ఆగిపోయాడు...ఏదీ ఆ బెస్తవాడ? నిన్నటి వరకు ఇక్కడే ఉండాలే? ఇపుదేమయిందీ ??

దాదాపు పరుగున అక్కడికి చేరాడు ఈశ్వర్.

అక్కడ ... గతంలో ఇక్కడ కొందరు నివసించేవారన్న ఆనవాళ్లు సైతం లేవు. నీళ్ళతో నానినట్టుగా నేలంతా చిత్తడిగా వుంది. అంతే తప్ప ఎక్కడా జనసంచారం లేదు. ఈశ్వర్‌కు గుండె చెరువయింది. కొంపదీసి ... ఇన్ని గుడిసెలూ, ఇందరు ప్రజలూ ఒకేసారిజల రక్కసికి బలి అయిపోయారా?

ఏదో పోగొట్టుకున్న వాడిలాగ ఈశ్వర్ అక్కడే కొంతసేపు తిరిగి, వెనక్కి వస్తోంటే దూరంగా ఎవరో కనపడ్డారు. ఈశ్వర్ పరుగు తీశాడు. అక్కడున్న వ్యక్తిని అందుకొన్నాడు.

"మీరా బాబూ!" అన్నాడు ఆ వ్యక్తి.

"ఏం నారయ్యా! గంగులూ వాళ్ళు..." ఏమని అడగాలో అర్థంకాక ఈశ్వర్ ప్రశ్నను ఆపేశాడు.

"అందరూ క్షేమంగానే ఉన్నారండి. షెడ్‌లో ఉన్నారు!" అన్నాడు నారయ్య.



ఈశ్వర్ నిట్టూర్చుకొన్నాడు. తనదే తప్పు–తనే గుర్తుపెట్టుకోలేదు. తుఫానులు వరసగా వచ్చి దెబ్బ తీస్తున్నాయని, ఆ దెబ్బనుంచి తట్టుకోవటానికే వీలుగా షెల్టర్లను కోస్తా అంతటా నిర్మించారు. అలాటి ఒక షెడ్ ఇక్కడే ఉంది. తుఫాను ప్రమాదం ఉందన్న వార్త రాగానే పల్లపు ప్రాంతాల వారినీ, లోతట్టు ప్రాంతాల వారినీ సురక్షిత ప్రాంతాలకు తరలించటం పరిపాటి అవుతోంది. సురక్షిత ప్రాంతాలు సమీపంలో ఉన్నట్లయితే, షెల్టర్లలోకి తరలిస్తున్నారు. గంగుల్ని, అతనితోబాటు వాడలోని అందర్నీ కూడా అక్కడికే తరలించారు ఈసారి.

ఈశ్వర్‌కు రవ్వంత గుండె ధైర్యం వచ్చింది. ఆస్తి నష్టం ఎంతైనా పూడ్చుకోవచ్చు. కానీ ప్రాణ నష్టం ... అది పూడ్చుకోలేని లోటు. డెబ్భయి కోట్ల జనాభా ఉన్న ఈ దేశంలో రోజూ కొన్ని లక్షల మంది పుడుతూ ఉండొచ్చు. పుట్టేవారు ఎవరైనా కావచ్చు కానీ పోయిన వారు మాత్రం కాలేరు...రాలేరు.

ఈశ్వర్ ధైర్యంగా షెల్టర్‌కేసి నడిచాడు. తుఫాను తగ్గింది కాబట్టి జన సంచారం కూడా పెరిగింది. ప్రకృతికి భయపడి ఎక్కడికక్కడ తలదాచుకొని ప్రాణరక్షణ చేసుకొన్న ప్రాణికోటి అంతా మళ్ళీ తలఎత్తి బయటకొచ్చే ప్రయత్నం చేస్తున్నారు.

ఈశ్వర్‌కు నవ్వొచ్చింది.

అడుగు తీసి అడుగు వేస్తోంటే తుఫాను దెబ్బ ఏమిటో అతనికి స్పష్టంగా అవగాహన కాసాగింది.

తూర్పు తెల్లవారక మునుపు నిద్ర లేచి, దుకాణాన్ని తెరిచి పైసల్ని రూపాయిలుగా మార్చుకొనే ప్రయత్నం చేస్తూ వచ్చిన ఆదినారాయణ శెట్టిదుకాణం నిన్నటి వరకూ ఇక్కడే ఉండేది. ఇపుడేదీ ?? ఆనవాలు సైతం లేదు.

అటు పక్కన దేశంలోని, విదేశాల్లోని వార్తల్ని, వింతల్ని ప్రజలకు అందిస్తూ వచ్చిన కమ్యూనిటీ సెంటర్ రేడియో సెట్ అక్కడే ఆ చెట్టు కొమ్మకే ఉండేది. అదేదీ? అసలాచెట్టేదీ??

ఇంకో రెండడుగులువేస్తే, ఇక్కడి వారి యోగక్షేమాలు అక్కడికి చేరుస్తూ, ఇక్కడ వారికి ఇతరుల కులాసా తెలియ చేస్తూ ఉండిన పోస్టాఫీస్ ఇక్కడే ఉండాలి...అది లేదు. కానీ ఇక్కడే ఉండేదన్న గుర్తుగా పోస్ట్ డబ్బా మాత్రం అక్కడే ఉంది.

మరో నాలుగడుగులు వేస్తే కూలిన గోడలు, నేల రాలిన మేడలు.

ఈశ్వర్‌కు మనసు కలుక్కుమంది. ఇంత నష్టం ఎన్నాళ్ళకు పూడేనో? ఎన్ని కేంద్రి రాష్ట్రి ప్రభుత్వాల సంఘాలు వచ్చి అంచనాలు సిద్ధంచేసి ఆర్తులను ఆదుకోనేను...?? ఏం జరిగినా ఈ నష్టం అపారం. ఎవరెవరు ఉన్నారో, ఇంకెవరెవరు అజ లేకుండా పోయారో గుర్తు తెలిసేసరికి ఓ రెండు మూడు రోజులు పడుతుంది. అప్పుడు బయటపడుతుంది- సరిగ్గా ఎందర్ని ఈ తుఫాను, ఉప్పెనలు బలి తీసుకొన్నాయో!

షెల్టర్ ఎత్తుగా ఉంది. విశాలమైన మెట్లమీంచి ఈశ్వర్ షెడ్‌లోకి చేరుకొన్నాడు. షెడ్ అంతా గోలగోలగా ఉంది. ఎవరెవరు ఎక్కడ ఉన్నారో, ఎలా ఉన్నారో ఏదీ అర్థం కావటంలేదు. అంతా ఒకటే గందరగోళం. పిల్లల ఏడుపులు, పెద్దల కేకలు, కొంచెం ఎదిగినవారి ఆటలు, మరీ ఎదిగిన వారి మూలుగులు...మధ్య మధ్యలో పెద్దల, వలంటీర్ల అదలింపులు.

ఈశ్వర్ నెమ్మదిగా ముందుకు నడిచాడు. అడుగుతీసి అడుగువేసే జాగా లేదు. అరంగుళం జాగాలో ఆరుగురున్నట్లుంది. ఊళ్ళోని జనం అంతా ప్రాణ భీతికి ఏకంగా కదిలివచ్చినట్లున్నారు. షెల్టర్ అంతా బిలబిలమంటోంది.

ఇంకో రెండడుగులు ముందుకేశాక గంగులు కనిపించాడు. ఓమూల కూర్చొని వలతాడు ముళ్ళు విప్పుకొంటున్నాడు. నిన్నటివరకు బీభత్సాన్ని సృష్టించిన తుఫాను గురించిన బాధేమీ అతనికి ఉన్నట్లు లేదు. తుఫాను తగ్గిందిగాబట్టి మళ్ళీ జీవన సంద్రంలోకి సమరానికి దిగాలన్న ధ్యాసే అతన్ని ఆవరించినట్లుంది.

ఈశ్వర్‌ను చూసి గంగులు చేతిలోని వల కింద పడేశాడు. లేచి నిలబడ్డాడు.

అప్పుడు ... అప్పుడు చూశాడు ఈశ్వర్ గంగుల్ని పరీక్షగా - పండు ముసలి - కాదేమో - జీవితం తెచ్చిన వార్ధక్యమేమో అది ! ఏదైతేనేం ముఖం అంతా ముడతలుపడి ఉంది. జీవితంలో తిన్న ఎదురుదెబ్బలన్నీ ముడతలుగా మారినట్టుంది. కళ్ళల్లోనూ ముసలితనమే. ఆశలన్నీ చచ్చిపోయినట్టు కళ్ళ కింద నల్లని మచ్చలు. వంగిపోతున్న శరీరం. క్రీస్తు పుట్టుక మునుపు నాటినుంచి ధరిస్తున్నట్లున్న సీర్కావి రంగు గోచిగుడ్డ.

"ఎలా ఉన్నావు గంగులూ ?" అనడిగాడు ఈశ్వర్.

గంగులు ఏమీ జవాబివ్వలేదు. కానీ

 

ఆ చూపు మాత్రం ఎంతో తెలియజేసింది.

"మీరాస్తారనే ఉండిపోయా! పదండి" అన్నాడు గంగులు.

ఈశ్వర్ ముందు నడుస్తోంటే గంగులు వెనకనే నీడలాగ నడవసాగాడు.

ఒకటే చిత్తడి. రోడ్డు, కాలవ, దుబ్బులు, పుంత ఏదీ తేడా తెలీటంలేదు. అన్నిచోట్ల ఒకటే వాసన, నీటిలో తడిసిన వాసన. ఇదంతా సర్దుకోవాలంటే వారం పది రోజులు పట్టొచ్చు!

"పెద్ద తుఫానే వచ్చింది" అన్నాడు ఈశ్వర్, షెల్టర్ దిగి ఊళ్ళోకి వచ్చాక.

"ఊరంతా పోయిందంటే, ఇక వేరే చెప్పేదేముంది?" అన్నాడు గంగులు. "ఉప్పెనలు రావటం ఎరుగుదునుకానీ, ఇంత నష్టం నేనెరగను. కలికాలం వచ్చి నపుడు సంద్రం ఊళ్లన్నిటినీ ముంచే స్తుందని వీరబ్రహ్మంగారెప్పుడో చెప్పనే చెప్పారు. అదిట్టా ఆరంభం అయి ఉంటాది!"

"ఈ ఉప్పెన బ్రహ్మంగారు చెప్పా రని రాలేదు. ఉప్పెన రావటానికి ఎన్నో కారణాలుంటాయి. సైన్సు ప్రకారం చెప్పాలంటే..." ఈశ్వర్ ఏదో చెప్పబో యాడు. గంగులు అది చెప్పనీయలేదు. "మీ సైన్సు ఏంటి చెప్తోందో మాకేల బాబూ! మాకది అక్కర్లేదు. నిజం కళ్ళముందు స్పష్టంగా కానవస్తోంటే ఇంకా సైన్సెందుకు బాబూ? మనిషికి ఆశ లావయింది. ఎదటోణ్ణి ముంచే యత్నాలు పెరిగాయి. అందుకే ఎప్పుడూ గట్టు దాటని సంద్రం గట్టు దాటి ఊళ్ళో బడింది. లేకుంటే ఎందుకిలా జరిగిందో చెప్పండి?" అన్నాడు గంగులు.

అతను అడిగిన ప్రశ్నకు సమాధానం తన దగ్గరలేదు. గంగులు అన్న కారణం వల్లనే ఉప్పెన వచ్చి ఉండకపోవచ్చు. అయినా అతను అనేది నిజమే. ఎటు చూస్తే అటు దగా. దేశాల మధ్య,రాష్ట్రాల మధ్య, భాషల మధ్య, కులమతాల మధ్య మనుషుల మధ్య ఎటు చూస్తే అటు దగా దగా. ఎపుడు వీలవుతుందా ఎదుటి వాడిని కబళించి వేద్దామా అనే ఆలోచన మనిషిని ఆవరించి ఉంటున్న రోజులివి.

"నాకిప్పుడు ఎనభై ఏళ్లు కొంచెం అటూ ఇటూగా! పుట్టిననాటినుంచీ ఈ సంద్రం అలలమీదే పెరిగాను. ఎప్పుడూ అకారణంగా ఈ సంద్రం కోపగించి ఎరగదు. ఇపుడు ఈ ఉధృతం వచ్చిం దంటే ఎక్కడో ఏదో కారణం ఉండే ఉంటుంది"

"అంటే ఎవరో ఏదో కూడనిపని చేసివుంటారంటావా?" అనడిగాడు ఈశ్వర్. అలా అంటున్నపుడే అతనికి నిన్న రాత్రి భార్య చెప్పిన గీతార్థం గుర్తు కొచ్చింది.

"ఎవరో ఎందుకు చేస్తారు బాబూ! ఎప్పుడూ ఉన్నోడే ఏదో ఒకటి చేస్తాడు. లేనోడు లేనోడిని ఏం మోసం చేస్తాడు? మా పక్కింటి ఈరిగాడు నన్ను దోస్తే ఏం దొరుకుతుంది. నాలుగు వలల ముక్కలు. రెండు ఎండు చేపలు. అంతే! ఆమాత్రానికి దోచటం దేనికి? నన్నడిగితే నేనే ఇచ్చేస్తా! ఇంత ఉప్పెనవల్లా మేం నష్టపోయిందేమిటి? మా గుడిసెలు. రేపో మాపో గవర్నమెంటోళ్ళు రానే వస్తారు... తలో పదో పాతికో ఇస్తారు. కాకుంటే ఏకంగా ఇళ్ళే కట్టిస్తారు. కానీ ఆ పెద్ద పెద్ద ఇంటోళ్ళను చూడండి... వాళ్ళ నష్టం ఏమిటి...?పాతికలక్షల ఇల్లొకడిది పోతే, పది లక్షల మేడ ఇంకోడిది పోయింది. ఎందర్ని కొట్టి సంపాదించిన



సొమ్మో అది...ఇట్టా ఆఖరికి నీళ్ళ పాలయింది." అన్నాడు గంగులు. అతడు అంటున్న ప్రతి మాటా పచ్చిగా ఉండి భయం కలిగిస్తోంది.

"నువ్వంటున్నది సాంబమూర్తి ఇంటి గురించా?" అడిగాడు ఈశ్వర్.

సాంబమూర్తి ఊళ్ళో రొయ్యల వ్యాపారం చేసేవాడు. సముద్రం రొయ్యలంటే పట్నాల్లో ప్రజలు మరీ ఎగబడి తింటారు. అది తెలుసుకున్న సాంబమూర్తి పట్నాలకు రొయ్యల ఎగుమతి మొదలుపెట్టాడు. బస్తా రొయ్యలతో ఆరంభమైన ఆ వ్యాపారం ఇవుడు లారీలతో సాగుతోంది. చిన్న గుడిసెతో శ్రీకారం చుట్టిన సాంబమూర్తి ఇవుడు సిరులతో శ్రీనివాసుడే అయ్యాడు. బెస్తవాడ జనం మాత్రం ఓడుగుల బతుకుల్లోనే ఉండిపోయారు.

గంగులు కోపం సాంబమూర్తి మీద అనుకొన్నాడు ఈశ్వర్.

కానీ గంగులు కేవలం వేదాంతం చెప్తున్నాడు. బాధలో బాగా మునిగిపోయిన గంగులు ప్రత్యేకంగా ఎవర్నీ గురించీ చెప్పటం లేదు. "నేననేది సాంబమూర్తి గురించి కాదండీ...లోకం తీరు చెప్తున్నా! అలా చెప్పాలంటే మీకు సాంబమూర్తి గురించి ఎందుకు? పెద్దిరాజు గురించే చెప్పేవాడిని!" అన్నాడు గంగులు.

అలా మాట్లాడుకుంటూనే ఊరు దాటారు. రణగొణ ధ్వని వెనక్కుపోయింది.

తుఫాను బాధితుల ఆక్రందనలు వినిపించటం లేదు. కేవలం సముద్ర ఘోష మాత్రం వినిపిస్తోంది. ప్రజల మీదికి ఎగిరి వచ్చిన సముద్రుడు శాంతించినా, ఇంకా ఆ ఆవేశం చల్లారనట్లుంది. ఎక్కడో అంతర్భాగాలలోంచి ఆవేశం ఉబికి వస్తున్నట్లుగా ఉంది. ఘోష స్పష్టంగా వినిపిస్తోంది.

గంగులు నోట పెద్దిరాజు గురించి చాలాసార్లే విన్నాడు ఈశ్వర్. పెద్దిరాజు ఎవరోగానీ గంగులుపై చెరగని ముద్ర వేశాడు. 'పెద్దిరాజు కోట' అని ఒకటి ఊరికి ఉత్తరాన ఓ చిన్నగుట్టమీద ఉంది. పేరుకది కోటగాని, నిజానికి అక్కడ ఏమీలేదు. పెద్దపెద్ద ఎత్తయిన గోడలు. ఎండకు ఎండి వానకు తడిసి చివికిపోయి కూలిపోయిన గోడలు. గోడలమధ్యకు వెడితే మాత్రం అక్కడ ఒకప్పుడు ఏదో చరిత్ర ఉండే ఉంటుందనిపిస్తుంది. ఎన్నెన్నో గదులు, పెద్దపెద్ద గోడలు. ఆ గోడలమధ్య తిరుగుతోంటే ఈశ్వర్‌కు ఆసక్తిగా, ఉత్సాహంగా, ఉద్వేగంగా ఉండేది.

చాలాసార్లు ఆ కోటగోడలమధ్య తిరుగుతోంటే అతనిలో ఒకే ప్రశ్న తలెత్తేది- ఎవరీ పెద్దిరాజు? ఎందుకీ కోట ఇలా పాడుబడిపోయింది? ఏం జరిగింది??

కాని, ఆ ప్రశ్న ఆ కోటగోడలు దాటి బయటి ప్రపంచంలోకి రాగానే వెనక్కుపోయేది. జీవితంలో వర్తమానానికి చెందిన ప్రశ్నలు వేధించుకు తింటూంటే గత కాలపు చరిత్రలు తెలుసుకోవాలనే ఆసక్తి ఎలా ఉంటుంది?

కానీ, ఈరోజు మాత్రం ఆ పెద్దిరాజు గురించి ఇంకా...ఇంకా వినాలనిపించింది.

అదే అడిగాడు ఈశ్వర్.

గంగులు నవ్వాడు. ఆ నవ్వువెనక ఇన్నాళ్లకా అడిగేది ఈ ప్రశ్న అన్నట్లు భావం ఒకటి కదలాడింది.

చెప్పాల్సింది చాలా ఉందన్నట్లుగా గంగులు ఒకరాతిబండమీదకూర్చున్నాడు ఈశ్వర్ కూడా దగ్గర్లో కూర్చున్నాడు.

దూరంగా సముద్రం ఎగిరెగిరి పడుతోన్న చప్పుడు వినిపిస్తోంది. సముద్రుడిని శాంతించమన్నట్లుగా ఆకాశం లోంచి సూర్యుడు క్రమక్రమంగా పైకి లేస్తున్నట్లుంది. మబ్బుల వెనుకనుంచి వెలుగు బింబం ఒకచోట కేంద్రీకృతమయినట్లు కానవస్తోంది.

గంగులు చెప్పటం ఆరంభించాడు- "పెద్దిరాజుగారి కద పదేళ్లలోనూ చెప్పచ్చు. పది ముక్కల్లోనూ చెప్పచ్చు. పదేళ్ల కద చెప్పే వీలెట్టాగూ లేదు గాబట్టి చిన్న కదే చెప్తాను. మనిషన్నవోడికి ఆశనేది ఉండాల. ఉండి తీరాల. కానీ ఆశ లావయితే మనిషే గల్లంతవుతాడు. పెద్దిరాజు కదంతా అంతే!" అంటూ కట్టె కొట్టె తెచ్చేలలో చెప్పేశాడు ఆ కథ.

ఈశ్వర్‌కు ఆ ఉపోద్ఘాతంలో కథ ఏమీ అర్థం కాలేదు. అందుకే మళ్లీ అడిగాడు పూర్తిగా సరగ్గా చెప్పమని.

"పెద్దిరాజు గారిది చాలా పెద్ద జమీ. ఈ చుట్టుపక్కలంతా ఆయన చేతిలోనే ఉండేది. ఆయన కన్నెర్రచేస్తే కాలం ఆగిపోయేది. కనుసైగచేస్తేనే కాలం కదిలి నడిచేది. అట్టాంటోడికి ఆశ పుట్టింది. ఆశన్నది మనిషికి రాకూడని జబ్బు. ఆ జబ్బు వచ్చినోడు ఇక కోలుకోడు. పైసలు రూపాయిలయినా, రూపాయిలు వందలు, వేలు, లక్షలు, కోట్లయినా ఆ ఆశ తగ్గదు. అది రోజు రోజుకు పెరిగే వ్యాధి.




ఆ వ్యాధి సోకితే, ఇక చెప్పేదేముంది- అంతా జారుడే! పెద్దిరాజుగారి కతా అట్టాగే అయింది.

"ఆయనకప్పటికే పెళ్ళయింది. సుక్కలాటి భార్య. ఆమె ఇక్కడి జనాన్ని బిడ్డల్లా చూసేది. 'అమ్మా' అంటే ఆర్నెల్లు మళ్ళీ దేనికీ చూసుకోబని ఉండేదికాదు. అట్టాంటామెకు ఒక్కటే కొరత. బిడ్డలు కలగలేదామెకు. అదొక్కటే ఆమెకు లోటయింది. ఆ లోటు తీరాలంటే పెద్దిరాజు మళ్ళీ పెళ్లాడాలన్నారు. అసలే జమిందారు. పైగా బాగా డబ్బున్నవాడు. సంబంధాలు వంద లొచ్చాయి. అందులో ఒకటి నచ్చిందాయనకు. ఆమెను పెళ్ళాడాడు. ఆమె తెచ్చిన కట్నకానుకలెంతో కానీ, ఊళ్ళో ఎవరూ వారం పదిరోజులు పొయిలో నిప్పెట్టనేలేదు. అంతగా పెట్టారు ఊళ్ళోని జనానికి. పది రోజులనాడు ఊరంత గుప్పుమంది- పెద్దిరాజుగారి పెద్ద పెళ్లాం కోట గోడమీంచి దూకేసిందట! కాలు జారిందని కొందరు చెప్పారు. కానీ నిజం మాత్రం ఒకటే- పెద్దిరాజుకు ఎప్పటికైనా ఒకరే భార్య ఉండాలనేది ఆమె పట్టుదల. తాను తీర్చలేనిది ఇంకోరు తీర్చేటపుడు ఇక తానెందుకు? అంతే...ఆమెకు కోట గోడ చావునిచ్చింది.

"అప్పుడారంబమైంది పెద్దిరాజు అసలుకద. అంతకు క్రితం వూళ్ళో వాళ్ళు పెద్దిరాజుకు దణ్ణం పెట్టేవారు. కానీ ఆ తర్వాత దూరంగా ఉండేవారు. అది రెండో రాణికి నచ్చిందిగాదు. ఊళ్లో వాళ్లనుఊర్కే తిట్టేది. ఏకారణం దొరికినా ఊరికే శాపనార్థాలు పెట్టేది. అది ఊళ్లో అందరికీ తెలిసిపోయింది. ఫలితంగా అంత పెద్ద కోటలో ఉంటున్నా వాళ్లకు ఒంటరితనమే గతి అయింది.

"అయితే ఏం, పెద్దిరాజుకు కొడుకు పుట్టాడు. చిన్న రాజు అన్నారందరూ. తన తర్వాత వారసుడంటూ పెద్దిరాజు అందరికీ ఆ చిన్నోడిని చూపించి సంబర పడేవోడు. అక్కడితో ఆగితే బాగుండేది. ఊళ్లో అందరూ తన కొడుక్కు కానుక లివ్వాలన్నాడు. చిన్నోడు పెద్దోడు తేడాలేదు. అందరూ తోచింది ఇవ్వాల్సిందే. ఒకరోజు ఆ చిన్నరాజు పుట్టినరోజు. ఇంకోరోజు ఆ చిన్నోడు నవ్వినరోజు ఇంకోరోజు ఆ చిన్నోడు నడిచినరోజు... వంకలు చెప్పేవోడు.

ఊళ్ళోవారి దగ్గర ఉన్నది ఊడ్చుకు పోయేవాడు. ఏమీ అసలేని బతుకు అయిపోయింది ఊరి జనానికి. ఎవరికి వాళ్ళు ఆ జమీందార్ఎప్పుడు చస్తాడాఅనే ఎదురు చూసేవారు. అంత సంపాదించి ఏం చేస్తాడో ఎవరికీ తెలిసేది కాదు.

"అప్పుడొచ్చింది యుద్ధం. అన్ని పక్కలనుంచి ముసురులా పట్టింది యుద్ధం. ఏదీ దొరికేదికాదు ఊళ్ళో. దీపం పెట్టాలంటే కిర్సనాయిలు ఉండేది కాదు. పొయ్యి ముట్టించాలంటే అగ్గిపెట్టె ఉండేది కాదు. బియ్యం సంగతి సరేసరి! అన్నిటికీ కరువే! ఎక్కడోవచ్చిన యుద్ధం ఇక్కడ మమ్మల్ని ఇట్టా దెబ్బతియ్యటం మాకు అర్థం అయ్యేదికాదు. ఒకప్పుడు మా మంచీ చెడ్డా చూసేది తానేనని చెప్పిన జమిందారు మా కష్టాల్ని చూడకపోవటం ఏమిటనేవాళ్లు ఊళ్ళోవాళ్ళు. ఏదో ఒక రోజు వెళ్ళి అడగాలనే వోళ్లు. కాని ఎవరికి వాళ్లు 'ఈ రోజు కాదు... రేప'నేవోళ్లు. ఆ రేపు ఏదో ఓరోజు ఈరోజే అయిపో తుందని అందరికీ తెలుసు. ఆరోజు ఎవర్నూ జమిందార్ని అడగరు. అడగకుండానే



దోచుకొంటారనిపించేది.

"యుద్ధం జరుగుతూనే ఉంది. రోజులు వారాలయి, వారాలు నెలలయి, నెలలు సంవత్సరాలూ అయింది. ఎక్కడా యుద్ధం ఆగే పరిస్థితే కానొచ్చింది కాదు. ఒక్కచిక్కిన జనం ఇంకా చిక్కిపోయారు. రేపోమాపో జర్మనోళ్ళు దేశం మీదకొస్తారని అంతా అనుకొనేవాళ్లు.



ఒక్క బాంబు ఏస్తే లక్షల మంది చచ్చి పోతారని చెప్పేవోళ్ళు. అట్టాంటిబాంబుల్ని వేసి దేశాన్ని తమ ఏలికలోకి తెచ్చుకొంటా రని అనుకొనేవోళ్ళు.

"అట్టాంటి రోజుల్లో ఓరోజు పెద్దిరాజు ఊళ్ళో వడ్రంగుల్ని పిలిపించాడు- ఒక్కళ్ళ్ని ఇద్దర్ని అయితే ఏదో అనుకో వచ్చు. కానీ ఒకళ్ళిద్దర్ని కాదు...ఊరం దర్నీ రమ్మన్నాడు. ఎందుకెందుకు అని అందరూ అనుకొన్నారు. అందరూ పెద్ది రాజు కోటకెళ్ళారు. తిరిగివచ్చి అందరూ మూటాముల్లె సద్దుకొన్నారు. యుద్ధం వల్ల ఒక్కరికీ పనిలేదు. అట్టాంటిది జమిం దార్ పని ఇస్తానన్నాడట కానీ ఉన్న ఊళ్ళో కాదు, పొరుగూర్లో! రోజుకు ఇప్పటి కూలీకన్నా రెట్టింపు కూలీ! కావ ల్సిందేముంది! అందరూ ఇంట్లో పిల్లాపీచుకు చెప్పి పెద్దిరాజు కోటకు వెళ్ళిపోయారు. అక్కడినుంచి ఏ ఊరికెళ్ళారో ఎవరికీ తెలీదు! మళ్లీ వాళ్ళొచ్చింది నెలన్నర తర్వాతనే! అందరూ తిరిగొచ్చేనాటికి బాగా సంపాదించుకొనే వచ్చారు. వాళ్ళంతా వెళ్ళి ఏం చేశారో తెలుసా? ఒక పెద్ద పడవ చేశారంట! ఆ పడవ నిండా

పెద్దిరాజు తన ఆస్తి పాస్తులన్నిటినీ ఎక్కించాడట. భార్యా బిడ్డల్ని పడవలోకి ఎక్కించి ఓ రోజు రాత్రి పడవను పంపాడట! రంగం వెళ్ళిపోయి బతికిపోవాలని ఆలోచనట!! వడ్రంగులు చెప్పిందినిజమో, కాదో తెలీదుగానీ ఆతర్వాతిరోజు నుంచి మాత్రం పెద్దిరాజు చిన్న భార్య, కొడుకు కనపడటం మానేశారు.

"ఊళ్లో గోల పెరిగి పోవటంతో కొంద రెళ్ళి పెద్దిరాజునే నిలదీసి అడిగారు. 'అబ్బే... నా భార్యా బిడ్డలు పుట్టింటికి వెళ్ళార'ని చెప్పాడట ఆ పెద్ద మనిషి. అందరూ నిజమేననుకొన్నారు.

"కానీ అది నిజంకాదని వారం పది రోజులకే బయటపడిపోయింది.

"ఓరోజు పొద్దున్నే పెద్దిరాజు మా బెస్తవాడలోకి వచ్చాడు. ఎవర్ని అయినా రంగానికి పడవ కట్టమన్నాడు. మాకు నవ్వొచ్చింది. 'చేపలు పట్టుకొనేవాళ్ళం. రంగానికి పడవకట్టటమేం'టన్నాం. 'మైలు మైలున్నర వరకు అయితే పర్వాలేదుగానీ అంతకుమించి మేమెక్కడ పోగలం? మా పడవలెక్కడపోతాయి?' అని చెప్పినా వినిపించుకొన్నాడుగాదు! చచ్చి మీ కడుపున పుడతానన్నాడు. భార్యా బిడ్డలను వెతికి పుణ్యం కట్టుకోమన్నాడు. అప్పుడు అడిగితే నిజం చెప్పేశాడు. కోటలోవున్న పూచిక పుల్లనుంచి కోట్లాది డబ్బు అంతా ఆ పడవలోకి ఎక్కించాడట. రత్నాలు, వజ్రాలు, జవహరీ, బంగారు కణికెలు, ఇటికెలు-ఒకటేమిటి, అన్నీ ఆ పడవలోనే ఉన్నాయట! తను రావాల్సినవన్నీ పోగేసి తర్వాత వెళ్దామనుకున్నాడట కానీ, పడవ ఏమయిందో ఇపుడు తెలీటం లేదన్నాడు. రంగం దాకా వెళ్ళొద్దాంఅన్నాడు. ఎక్కడ ఆ పడవకనపడ్డా అక్కడి నుంచివెనక్కు తిరిగి రావచ్చునన్నాడు. ఏడాదికి సరిపడ ఇచ్చి పంపిస్తానన్నాడు. అందరికీ నవ్వొచ్చేది- చేపలు పట్టే పడవలో రంగానికి ప్రయాణం ఏంటని! అయినా మాలో ఒక్కడు ఈరాసామి అని ఉండేవాడు. వాడడిగాడు-'సరే,నేకడతా నా పడవ! ఈ పడవలో రంగం ఎళ్ళేది సందేహమే. అందుకేముందేం ఇస్తావో ఇచ్చెయ్, ఇంట్లో ఇచ్చేస్తా' అని. పెద్దిరాజు ఆతర్వాత వాడి వెంటపడ్డాడు-'ఉన్నదంతా ఊడ్చి పంపేశానురా! ఆ పడవదగ్గరకి చేర్చు, నువ్వడిగిందిస్తా' అన్నాడు. 'అంతా ఊడ్చిపంపి నోడివి నువ్వూ పోలేకపోయావ్?' అనడిగాడు ఈరాసామి. 'అలాకాక వేరుగా వెళ్తే, అత్తారింటికి నేనూ వెళ్ళాననుకొంటారుగదా! జర్మనోళ్ళు రాకుంటే రంగంనుంచి తిరిగి రావచ్చుగదా' అని జవాబిచ్చాడు పెద్దిరాజు. ఊళ్ళో అందరికీ అసలు సంగతి అర్థమయిపోయింది-పడవలో పెళ్ళాం పిల్లాడిని పంపి మిగిలిందంతా పోగేసుకుని తాను వెనకగా వెళ్దామనుకున్నాడు. కానీ..ఆశ బెడిసికొట్టింది. పెళ్ళాం పిల్లలపడవ ఏమయిందో తెలీదు. అసలు సంగతి బయటపెట్టుకోవాల్సి వచ్చింది. పదిమందిలోనూ నవ్వులపాలయిపోయాడు పెద్దిరాజు.

"ఈరాసామి పెద్దిరాజును 'రేపు రండి! పడవ కడతా!' అని చెప్పి పంపాడు. మర్నాడు పెద్దిరాజు పరుగున వచ్చాడు- 'వెళదామా?' అని!!

'పడవ బాగాలేదండీ, రేపు రండి!' అనేవాడు ఈరాసామి. వారం గడిచేసరికి పెద్దిరాజుకు అసలు సంగతి తెలిసిపోయింది, ఈరాసామి పడవకట్టడనీ, అయినా ఆ సంగతి చెప్పడనీ! అక్కడితో మొదలయింది ఊళ్ళో అందర్నీ బతి

 

మాలటం - 'నువ్వు కట్టరా బాబూ!' అంటూ.

"నెలరోజులయ్యేసరికి పెద్దిరాజు పరిస్థితి పూర్తిగా మారిపోయింది. ఆ జమీందారీ హోదా లేదు. ఆ గర్వం లేదు. ఆ ఠీవిలేదు. అన్నీపోయిన బికారి అయిపోయాడు. నా అన్నవాళ్లు ఎవరూ లేరు. ఉన్న ఊళ్ళో ఉండివుంటే సుఖపడి ఉండేవాడు. కానీ ఉన్నదంతా దక్కించుకోవాలన్న ఆశ, ఊళ్ళోవాళ్లు దోచుకొంటారేమోనన్న భయం అతన్ని చంపేశాయి. మనిషికి మతిపోయింది. చిన్నా పెద్దా తేడా లేకుండా ఎవరు ఎదురైనా అడిగేవాడు-'రంగానికి పడవ కడతావా?' అని! కొందరు నవ్వేవారు, ఇంకొందరు వేళాకోళం ఆడేవారు-'ఏంతిస్తావ్ ?'అని. 'బంగారం ఇస్తారా! పడవనిండా బంగారమే ఉందిరా - నీక్కావల్సినంత ఇస్తా! ఎంతకావాలో చెప్పు!' అనేవాడు పెద్దిరాజు. 'ఇంత' అని రెండు చేతులూ బారజాపి పకపకా నవ్వేవారు పిల్లలు. పెద్దిరాజు ఒక్కసారి గొల్లుమనేవాడు. మతిస్థిమితం తప్పి పిచ్చివాడయిపోయాడు పెద్దిరాజు. 'రంగం పిచ్చోడు' అని ఊళ్ళో అందరూ అనేవారు ఆయన్ను. ఎలాటి బతుకు ఎట్టా అయిపోయిందోనను కొనేవాళ్లం మేం! ఆఖరికి ... కోటలో బతకాల్సినవాడు వీధుల్లో పడ్డాడు. ఎవరైనా ఏదైనా పెడితే తినేవాడు. లేకపోతేలేదు. సంద్రం ముందు కూర్చుని ఉండేవాడు. ఎవరు చేపలు పట్టడానికి బయలుదేరినా 'రంగమా? నే రానా?' అని అడిగేవాడు. అందరూ ఈరాసామి లాగే 'రేపు! రేపెడదాం రంగం' అని జవాబిచ్చేవాళ్లం.... అలా నెలా రెండు నెలలు....ఆరేడు నెలలు కూడా గడిని పోయాయి. పెద్దిరాజు రంగం వెళ్ళనేలేదు. అంత బతుకూ బతికి ఆఖరికి ఇంటి వెనక చావు అయింది పెద్దిరాజు బతుకు! ఓరోజు ఓ పడవను చేపలు పట్టేందుకు పక్కకు జరుపుతోంటే పెద్దిరాజు ఆ పడవ వెనకనుంచి ముందుకు దొర్లాడు. అంతే! కోటలో పెరిగినవాడు కట్టెల పాలయినాడు! ఎందుకంటారు... ఆశ... ఇంకా సంపాదించాలని. సంపాదించింది కూడా తెచ్చుకోవాలని! కానీ ఏమయింది ? సంపాదించిందీ రాలేదు. ఇంట్లో పిల్లా జల్లా రాలేదు.ఆఖరికి కుక్క చావయింది!"

గంగులు చెప్పటం ఆపాడు.

ఈశ్వర్ అదంతా ఏకాగ్రతతో విన్నాడు. గంగులు చెప్పింది చెప్పినట్లుగా ఈశ్వర్ మనసులో ముద్రితమయింది. గంగులు కెమేరా చేత పట్టుకుని నడిపిస్తూ చూపించినట్లుగా అనిపించింది. సంఘటన లన్నీ ఒకటి ఒకటిగా తనముందు జరుగుతున్నట్లుగానే కనిపించింది.

క్షణం ఆగి అడిగాడు ఈశ్వర్-

"అసలు పెద్దిరాజు తన సంపాదనఅంతా నిజంగానేపడవలోకి ఎక్కించాడంటావా?"

"నిజమే ! మొదట్లో అందరూ వేళాకోళం అనుకొన్నారుగానీ, పెద్దిరాజు వీధుల్లో పడ్డాక ఎందరో వెళ్ళి కోటంతా గాలించారు. ఎవరికి దొరికింది వారు తెచ్చుకొన్నారు. కానీ అక్కడేముందని వాళ్లకు దొరికేందుకు? అంతా, అంతకుముందే పడవలో రంగానికి వెళ్ళిపోతే...!"

"అంటే పడవ రంగానికి వెళ్ళిపోయిందా?"

"వెళ్ళి ఉంటే పెద్దిరాజూ రంగమే పొయ్యి ఉండేవాడు. పడవ వెళ్ళలేదు గాబట్టి పెద్దిరాజు వీధుల్లో పడ్డాడు"

"మరి ఆ పడవ ఏమయిందంటావ్?"

"ఏమవుతుంది? సంద్రంలో మునిగి



చతుర ... 33

పోయింది. కోట్ల ఆస్తి ఒక్కసారే జలం పాలయింది. ఎన్నేళ్లు ఎన్ని కుటుంబాలను కొట్టి సంపాదించారో, అంతా ఒకేసారి నీళ్ల పాలయింది!"

"మరి డబ్బంతా ఏమయినట్లు ?" యధాలాపంగా అడిగాడు ఈశ్వర్.

"ఏమవుతుంది? సంద్రంలోనే కలిసి పోయింది !"

"అంటే-ఆ డబ్బంతా సముద్రంలోనే ఉండిపోయిందా ?"

"ఉండిపోక ఎవడు తీసుకెళతాడు? అంతా-కోట్ల డబ్బు – అంతా సముద్రం లోనే ఉండిపోయింది !" గంగులు జవాబిచ్చాడు మళ్ళీ.

"అయితే ఇప్పటికీ ... ఆ డబ్బు అక్కడే సముద్రంలోనే ఉందంటావా?"

"ఆ...ఉంది. ఎప్పటికీ అక్కడే ఉంటుంది ! ఆశలకు లోబడినవాడికి అధోగతే మిగులుతోందని చెప్పేందుకు ఆ డబ్బు అక్కడే వుంటుంది'' అన్నాడు గంగులు.

ఈశ్వర్ ఆ మాట వింటూనే ఉన్నా ఆలోచనలు మాత్రం ఎన్నో లోతుల్లోకి వెళ్లిపోతున్నాయి.




కాలంగడిచినకొద్దీ తుఫానుగొడవ అందరి జ్ఞాపకాలలోంచి తప్పుకోసాగింది.




ఓరోజు ఈశ్వర్ ఉమతో కలిసి సముద్రం ఒడ్డుకు షికారుకు వచ్చాడు. ఎప్పటినుంచో మనసులోవున్న ఆలోచనను భార్యకు చెప్పాలనిపించిందా క్షణంలో.

సముద్రం అలలు చిన్నగా లేచి ఆబగా తీరంమీదకు పరుగున వస్తున్నాయి. కానీ మళ్లీ ఏదో నిర్ణయించుకొన్నట్లుగా అంతే వేగంతో వెనక్కు వెళ్లిపోతున్నాయి. ఉమ ఈశ్వర్‌కు రెండడుగులు దూరంలో కూర్చునివుంది. కాలిని ముందుకుజాపి,దాని మీద ఇసకపోసుకొని గూడు కడుతోంది.

ఈశ్వర్ కొంచెంసేపు భార్యకేసి చూసి అన్నాడు నెమ్మదిగా – "ఉమా...ఒకటి అడుగుతా, నిజం చెప్తావా?"

ఉమ తలెత్తి చూసింది. "అడగండి" అంది.

"నేనంటే నీ అభిప్రాయం?"

ఉమ నవ్వేసింది. "సదభిప్రాయమే! లేకుంటే పెళ్లిచేసుకొని, జీవితం అంతా మీతో గడపటానికి ఎందుకొప్పుకొంటాను చెప్పండి!"

"పెళ్లిచేసుకోవటానికి సవాలక్ష కారణాలు ఉండొచ్చు ! ఆనాటికి ఇదే మంచి సంబంధం అనిపించవచ్చు. ఇంకొన్నాళ్లు ఆగితే ముదిరిపోయి, పెళ్లికి దూరం అవుతామేమో అన్న భయం కారణం కావచ్చు. ఉన్న వనరులతో ఇంతకుమించి ఇంకదేనికి నోచుకోము అనుకోవచ్చు. ఏదో గవర్నమెంటు ఉద్యోగస్థుడు, నికరంగా నెలకు ఇంత తెచ్చి పడేస్తాడు, తిండికి, బట్టకు లోటువుండదు అనుకోవచ్చు. ఇలాటి కారణాలు ఎన్నిఅయినా ఉండొచ్చు, నేనడిగేది అదికాదు..జీవితం అంటే నా దృష్టిలో ఏమిటో నీకు ఇప్పటికి అర్థమయి ఉండొచ్చు.ఆ విషయంలో నీ అభిప్రాయం చెప్పు" అనడిగాడు ఈశ్వర్.

"ఆ విషయంలోనూ సదభిప్రాయమే!

నో ప్రాబ్లం. జీవితం జీవించటానికి అని మీకు తెలుసు. అది చాలు నాకు!"

"నిజమే...ఇంతకాలమూ నా ఫిలాసఫీ కూడా అదే. కానీ ఇపుడు మార్చుకో దల్చుకొన్నాను. జీవితం పోరాడటానికి అనిపిస్తోంది ఇపుడు''

"పోరాటమా? నాతో తగువులాడాలని మీకెందుకు అనిపిస్తోంది?

ఈసారి ఈశ్వర్ నవ్వాడు. "తగువు నీతో కాదు... జీవితంతోనే! బతికినంత కాలమూ బడుద్దాయిలా బతకటంకన్నా ఏదో సాధించే పీసడిలా బతకాలనే కాంక్ష నన్ని మధ్య నిలవనియ్యటంలేదు. జీవితాన్ని ఛాలెంజిగా తీసుకుని, ఒక బృహత్తర కార్యాన్ని చేపట్టి గెలవాలనే కాంక్షకోసేస్తోంది. ఇదే పెళ్లికాకమునుపు అనిపించిఉంటే, ఇప్పటికి కార్యరంగంలో ఉండివుండేవాడిని. కానీ ఇపుడు పెళ్లయింది... పెళ్లాం ఉంది.బాధ్యతలున్నాయి.

"పెళ్లయినంత మాత్రాన మిమ్మల్ని మీదారిలోంచి తప్పుకోమనినేననుకదా?" అంది ఉమ.

"అనవని ఇప్పుడనొచ్చు. కానీ..నీకు తెలీదు. ఇప్పుడు నా దృష్టి మారిపోయింది. ఆలోచన అంతా ఒకేదానిమీద కేంద్రీకృతమయింది. గెలిచి తీరాలన్న కాంక్ష ఉంది. కానీ ఒక్కోసారి గెలవలేనేమో నన్న భయమూ కలుగుతోంది. ఓటమి అంటే-ఈ విషయంలో చావే, ఉమా!" అన్నాడు ఈశ్వర్.

ఉమ ఉలిక్కిపడింది. ఆ ఉలికిపాటుకు ఆమె కాలు వెనక్కు జరిగింది. అంత క్రితం ఆమె కట్టిన ఇసక గూళ్లు కుప్పకూలి పోయాయి.

"అసలుసంగతి చెప్పండి, ఏమను కొంటున్నారు మీరు?" సూటిగా అడిగింది ఉమ.

"నాకు ఈ సముద్రంలోకి చూకాలని ఉంది. అగాథాలన్నిటినీ అన్వేషించాలని ఉంది. సాగరగర్భంలో నిక్షిప్తమయివున్న నిధుల్ని వెలికితీయాలనివుంది"

"ఏమిటసలు మీ గొడవ? నాకేమీ అర్థంకావడంలేదు.మీ ధోరణి,మీ మాటలు అన్నీ కొత్తగా ఉన్నాయి!" అంది ఉమ.

"నిజమే...కొత్త ఆలోచనలు నన్ను ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. కొత్త కోరికలు కోసేస్తున్నాయి. అందుకే మాటలు కూడా కొత్తగా ఉంటున్నాయి. ఉమా...ట్రెజర్‌హంట్ అనే మాట నువ్వు వినే ఉంటావు.ఇపుడు నా ఆలోచన అదే!"

"ట్రెజర్‌హంట్? మీరు....?"

"అవును...నేనే! ఇక్కడ ....మనం కూర్చున్న ఈ ఇసుకతిన్నెల ముందున్న సముద్రం ఏమీ ఎరగనట్లుందిగానీ ఎన్ని రహస్యాలు ఇందులో ఉన్నాయో నీకేం తెలుసు? అగాథాల అడుగున కూరుకుని పోయి ఉన్న వాటిని వెలుగులోకి తెద్దామని ఉంది''

"ఏం చేస్తారు?''

"నాలాటి సాహసికుల్ని కొందర్ని పోగుచేస్తాను. ఈ సముద్రంలోనే మునిగి పోయిన నౌకల ఆచూకీ తీస్తాను. వాటిని గుర్తుపట్టి వాటిలో మునిగిపోయి నీటిపాలయిన నిధుల్ని వెలికితీస్తాను!"

ఉమ నవ్వింది. "మీకు ఈ డబ్బు యావ ఎందుకొచ్చింది? నేను మిమ్మల్ని ఏమీ అడగలేదే! ఉన్నదానిలోనే నాకెంతో సంతృప్తిగా ఉంటోంది!"

"నువ్వనుకుంటున్నావనికాదు-నేను ఈ పనిని నాకోసం చేపడుతున్నాను. ఒక గొప్ప పనిచేసి మంచి పేరు తెచ్చుకోవాలని ఉంది. సాధించగలుగుతానా సంతోషం.

సాధించలేనా...ఓడిపోయినా ప్రయత్నించా ననే తృప్తితో జీవితకాలాన్ని గడిపేయ గలను" దృఢనిర్ణయం ఇది అన్నట్లుగా చెప్పాడు ఈశ్వర్.

"మీ ఇష్టం. కానీ మనిషి ఉన్నదానితో తృప్తిచెందితే ఎంతో సుఖపడతాడు. లేని దానికి ఆశపడితే కష్టాలపాలవుతాడని నా అభిప్రాయం"

"ఇంకోసారి చెప్తున్నా నీకు. ఇది కేవలం నాకు ఏదైనా చేయాలనే కోరికతో చేపడుతున్నదేతప్ప ఆశ అణుమాత్రమూ లేదు. సాధించాలనే ఆశమాత్రం ఉంది"

"మీ ఇష్టం. కానీ ముందున్నది సముద్రం..లోతు తెలీని సముద్రం. మీరు కనీసం ఈతఅయినా వచ్చునో రాదో... అదే నా భయం!"

"ఉన్నదాన్ని సాధించటంలో గొప్ప ఏముంది? లేనిదాన్ని చేజిక్కించుకోవటమే గొప్ప! నువ్వు సరేనంటే...నీ అంగీకారం నాకుంటే దేన్ని అయినా సాధిస్తాననే నమ్మకం నాకుంది"

"మీ ఇష్టం. కానీ..."

ఈశ్వర్ ఉమను ఆపేశాడు- "మీ ఇష్టం అని అంటూనే ఉన్నావు. అయినా వెంటనే ఏదో అభ్యంతరం చెప్తూనే ఉన్నావు"

"ఈసారి చెప్పేది అభ్యంతరంకాదు- నిర్ణయం మీదే కానీ ఇంట్లో జనాభా సంఖ్య పెరగబోతోంది. ఆలోచించి చెయ్యండి ఏ పని చేసినా అనిమాత్రం చెప్తున్నా" అంది ఉమ. ఈశ్వర్‌కు ముందు అది అర్థం కాలేదుకానీ వెంటనే అర్థంచేసుకుని, "నిజమా?" అన్నాడు.

"నిజమే!" అంది ఉమ.

"మరి చెప్పావ్‌కాదేం? కంగ్రాట్స్"

"థాంక్స్! మీక్కూడా బాధ్యతలు పెరుగుతున్నాయి. ఏం చేస్తారో భారం మీదే" అంది ఉమ.

"ఉమా! నువ్వు సరేననటంతో నాకు సగం గెలిచినట్లుగా ఉంది. కానీ ముందే చెప్తున్నా! ఇది తాడో పేడో తేల్చేసే విషయం. గెలిచానా గెలుస్తాను, లేకుంటే లేదు! పైగా మన దేశంలో ఇలాటి ప్రయత్నం ఎవరూ చేపట్టి ఎరగరను కొంటాను. అందుకే చాలామంది చాలా రకాలుగా అనుకొనే ప్రమాదమూ ఉంది, అనే అవకాశమూ ఉంది. దూషణ భూషణ లను పట్టించుకోగలిగితేనే పనిచెయ్యగల నని నా నమ్మకం! అందులో కూడా నీ సహాయం అవసరం అవుతుంది. నాకే ముందీ...నిన్ను ఈ ఒడ్డుమీద వదిలేసి వెళ్ళి పోతాను. ఈ జనంమధ్య మాటలు పడా ల్సినదానివీ, బాధలు భరించేదానివీ నువ్వే!! అందుకే నీకు మరీమరీ చెప్తున్నా ను-నువ్వు ఊ అంటేతప్ప..." ఈశ్వర్ ఇంకేమీ అనలేకపోయాడు.

"మీ ఇష్టం అన్నానుగా...మీ ఇష్టం!"

ఉమ అలా అన్నాక ఈశ్వర్‌కు ధైర్యం పెరిగింది. గంగులు చెప్పిన విష యాలన్నీ అప్పుడు చెప్పాడు. అన్నీ జాగ్రత్తగా వింది ఉమ.

"ఇంతకీ అది మునిగిందెక్కడ?"

"అదీ తెలుసుకుంటాను!"

"అలా మునిగిపోయిన నౌకల్ని తీయనిస్తారా? అసలు సముద్రంమీదకు మనల్ని వెళ్ళనిస్తారా? ఇలాటి పనులు చేస్తామంటే గవర్నమెంటువాళ్లు ఊరు కుంటారా?"

ఈశ్వర్ నవ్వాడు. "ఏం....ఎందుకు పడ్డంటావు? కొందరికి ప్రపంచమంతా కాలినడకన చుట్టిరావాలన్న కోరిక ఉంటుంది. మరికొందరికి మంచు కొండల

మీదకు వెళ్ళాలని ఉంటుంది. ఇంకొందరికి ఒంటికాలిమీద ఏడు కొండలూ ఎక్కాలని ఉంటుంది. నాకు ఈ కోరిక...తప్పేమిటి? మనుషుల్లో ఏదో చెయ్యాలన్న తపన లేకుంటే ఎలా?ఆ తపనేలేకపోతే ఈరోజున చంద్రుడిమీదకు మనిషి వెళ్ళగలిగేవాడా చెప్పు!"

"అవన్నీవేరు ... ఇలా సముద్రం లోపలికి వెళ్ళటం..."

"ఇదీ అలాంటిదే! దూకదల్చినవాడికి దూకేంతవరకే ఆలోచన. ఒక్కసారి దూకాక ఇక భయంవుండదు. గెలవాలన్న కోరికే ఉంటుంది. నాకు కోరిక ఉంది. పట్టుదలవుంది. గెలిచి తీరాలన్న ఆకాంక్ష వుంది. అందుకే గెలుస్తానన్న నమ్మకమూ ఉంది!"

ఉమ ఇంకేమీ అనలేదు. భర్త ఉత్సాహం చూస్తోంటే ఆమెకు బాగానే ఉంది కానీ మనసు పొరల్లో ఎక్కడో,ఏదో తెలినిభయం ఆమెను ఆవరించసాగింది. సముద్రం మీదనుంచి చీకటి తెర నెమ్మదిగా విస్తరించసాగింది.

ఉమ కాసేపు కూర్చున్నాక, లేచింది. "వెడదామా?" అంది.

ఈశ్వర్ లేచాడు. అతనికి చీకటి పడ్డట్టు తెలీటంలేదు. ఏదో తెలీని ఆవేశం అతన్ని ఆవహిస్తోంది. తాను ఆ పని ఎలా చెయ్యదల్చుకొన్నదీ భార్యకు అంతా వివరంగా చెప్పనారంభించాడు.

* * * *

ఉమ 'సరే'నన్నాక ఈశ్వర్ ఇక క్షణం కూడా ఆలస్యం చెయ్యలేదు. ఒకరోజులో చెయ్యగల పనికాదది. ఒక్కడుచేసే సాహసకార్యమూ కాదది. ఎందరో ప్రోత్సాహం ఇవ్వాలి, మరెందరో సాయపడాలి. ఇంకొందరు కూడా దూకగలగాలి. వీటన్నిటినీ సమన్వయపరుచుకొంటూ సాగాలి. అప్పుడు ప్రకృతి కూడా ఆశీర్వాదాలిచ్చి ఆదుకొంటేనే తను గెలవగలడు.

ఈశ్వర్‌కు ఆ సంగతి తెలుసు-తెలుసుకోవాల్సినవి ఇంకెన్నో ఉన్నాయి.అసలు నౌక ఎలా మునిగిపోయింది? నౌక బరువెంత? దానిలో ఉన్న వస్తువుల బరువెంత? నౌక మునిగినపుడు తుఫానొచ్చిందా? లేకపోతే దాన్ని సరిగ్గా నడపలేకనే నాశనం చేసుకొన్నారా...? అన్నీ ప్రశ్నలే. అన్ని ప్రశ్నలకూ సమాధానం సరిగ్గా వెతుక్కోగలిగితే, అప్పుడు...అప్పుడు ఆలోచించే అవకాశం ఉంటుంది దాన్నెలా పైకితీయాలో!

నౌక ఎలా మునిగిపోయింది? ఏ ప్రాంతంలో మునిగిపోయిందనేది అసలు ప్రశ్న. ఉజ్జాయింపుగా నౌక మునిగిన ప్రదేశం తెలిస్తే ఆ తర్వాతే దాన్ని ఆచూకీ తీసే అవకాశం.




ఈశ్వర్ మళ్ళీ గంగులు దగ్గరికి వెళ్ళాడు.

గంగులు వల సరిచేసుకుంటున్నాడు. ఈశ్వర్‌నుచూసి పలకరింపులా నవ్వాడు.

తుఫాను బాధితులందరికీ తలో అయిదొందలూ ఇచ్చారట. పడవల్ని కొనుక్కొనే వాళ్ళకు అప్పులు ఇస్తామన్నారట.

రోజూ పట్టిన చేపల్ని అమ్మగా వచ్చిన డబ్బులో కొంచెం కొంచెంతీర్చే సదుపాయం ఇస్తారట! గంగులు ఉత్సాహంగా చెప్పుకొచ్చాడు.

ఈశ్వర్‌కు నవ్వొచ్చింది. ఎంత అమాయకులు వీళ్ళు! నాయకుల మాటల్ని నమ్మి మోసపోయే నిష్కల్మష హృదయులు! అసలు మోసానికి గురికావటమే వీరి జీవితం కాబోలు! ఒక్కసారి...ఒక్కసారయినా వెనక్కు తిరిగి చూసుకోరేం? ఎన్నిసార్లు తుఫాన్లు రావటం, తుఫాన్ల తర్వాత మళ్ళీ నాయకుల వాగ్దానాల వెల్లువలు రావటం జరిగింది? ఎన్నిసార్లు అవి అమలు జరిగాయి?? ఎవరూ గతాన్ని గుర్తుంచుకోరేం?

ఈశ్వర్ మనసులో అలా అనుకొన్నాడేగానీ పైకిమాత్రం అదేమీ అనలేదు. ఉత్సాహంతో, సంబరంతో స్వర్గానికి ఎగురుతానంటున్నవాడిని నీకు ఉట్టి అందుకొనే స్తోమత కూడా లేదనిచెప్పి నిరుత్సాహపరిచి, నీళ్ళు చల్లటం అర్థం లేని పని! అనుకొన్నాడు ఈశ్వర్.

గంగులు ఏమేమో చెప్పాడు. ఈశ్వర్ అదంతా విన్నాడు.

కాని, ఈశ్వర్‌కు కావాల్సింది అది కాదు. అందుకే తనకు కావాల్సింది అడిగాడు.

గంగులు ఆ ప్రశ్న విని నవ్వాడు-"మీకింకా అనుమానమా బాబూ! ఈ ఊళ్ళో ఏ పెద్దోడినయినా అడగండి... నిజం మీకు తెలుస్తుంది!" అన్నాడు.

"ఎవర్నో ఎందుకు నిన్నడుగుతున్నా గదా..నిజం చెప్పు!"

"చెప్పా గదా! ఎందర్నో కొట్టిన సొమ్ము ఒక్కడే సొంతం చేసుకోవాలని ఆశపడ్డాడు. ఆఖరికి నీటిపాలు చేశాడు? ఎవరికెంత రాసిపెట్టాడో అంతే దక్కుతుంది! అంత సంపాదించి ఆఖరికి ఆ పెద్దిరాజు గతేమయింది? పడవపాటున గుటుక్కు మన్నాడు" అన్నాడు గంగులు వేదాంత ధోరణిలో.

"అలాకాదు గంగులూ!నాకు ఆ పడవ ఎక్కడ మునిగిందో, ఎలా మునిగిందో అంతా కావాలి. వివరంగా చెప్పు" అన్నాడు ఈశ్వర్.

గంగులు ఒక్క నిమిషం ఈశ్వర్ కేసి పరిశీలనగా చూశాడు. "ఆ వివరాలన్నీ దేనికి బాబూ?" అనడిగాడు.

"వీలైతే ఆ పడవను పైకి తీయిద్దామని" అన్నాడు ఈశ్వర్.

ఆ జవాబు విని గంగులు పకపక నవ్వాడు. "ఏంటి... సంద్రంలో మునిగిన దాన్ని పైకి తియ్యటమా? ఇదేం మనూరి కాలవనుకున్నారా? చెయ్యి పెట్టి కింద నుంచి నాచు పీకటానికి! సంద్రం అంటే కొన్ని వేల నిలువుల లోతుంటుంది బాబూ... మాటలు కాదది! అసలా అలల్ని చూస్తేనే గుండె జేజారవుతుంది" అన్నాడు.

ఈశ్వర్ క్షణం ఆగాడు. ఇప్పుడు సముద్రంలోని నౌకల్ని ఆ అగాథాల్లోంచి బయటకు తియ్యటం సర్వసాధారణమైన సంగతి అని చెప్పచ్చు. అంతేనని ఏం ఖర్మ, అటు ఆకాశంలో దారి తప్పిన ఉపగ్రహాల్ని చెవులు మెలిపెట్టి సరిగ్గా నడిపించగలగటమూ అతి మామూలు విషయం అని చెప్పచ్చు. మనిషి తలుచుకుంటే ఏదైనా చెయ్యగలగటం గతంలో కథలు, కవిత్వాలలో ఉండేదేమోగానీ ఇపుడది నిజం అయిందనీ చెప్పచ్చు. కానీ...గంగులుకు అది అర్థం కాదు. పైగా తనకు పూర్తిగా మతి చలించిందనుకుం

టాడు కూడానూ!

"అలాకాదు గంగులూ... దాన్ని పైకి తియ్యటం సంగతి పక్కన పెట్టు. అసలది ఎలా మునిగిపోయింది? ఎక్కడ? అది మునిగినట్లు పెద్దిరాజుకు ఎవరు చెప్పారు??—ఇదిగో ఇలాటి ప్రశ్నలే నన్ను నిలవనీయటంలేదు. అన్ని తెలుసుకుంటే గానీ నాకు నిద్రపట్టేలా లేదు. అందుకే అడుగుతున్నాను" అన్నాడు ఈశ్వర్.

గంగులు ఈ మాట నమ్మాడు. కేవలం తెలుసుకోవాలన్న ఆసక్తి మాత్రమేనంటే నమ్మబుద్ధి అయింది అతనికి.

"నాకు తెలిసిన ఇవరాలన్నీ చెప్తా బాబూ! కానీ ఒక్కమాట— సంద్రంలో నిక్షేపాలెన్నో ఉంటాయి. అవన్నీ మన కోసం కాదు. ఆ అదృష్టం ఉన్నోళ్ళకు అవే పైకి వచ్చి కనిపిస్తాయంటారు. అంతెందుకు బాబూ! గోపాలరావు గారింట్లో ఏమయింది? ఉన్న ఇల్లు కూల గొట్టి మేడ కట్టించాలని పునాదులేశాడు. పునాదుల్లో దొరికింది నిధి. ఆరు పాతరల నిండా నిధే. ఒకదాంట్లో ఉన్న బంగారం, వెండీ అన్నీ ఊళ్ళోవాళ్ళకు పంచేశాడు. మిగిలినవి తనే ఉంచేసుకున్నాడు. కానీ ఆ తర్వాతే వచ్చింది చిక్కు. ఎవడో ఎళ్ళాడు. తాసిల్దారుగోరికి చెవినేశాడు. అళ్ళొచ్చి ఉన్నదంతా లాక్కుపోయారు. దెబ్బతో గోపాలరావుగారి గుండాగి పోయింది. అంత నిధీ దొరికింది. కానీ ఏం లాభం... అనుభవించేందుకు మనిషే మిగలకపోయే! ఎందుకంటారు అట్టా అయింది? ఆశ దురాశయిపోతే ఉన్న దానికి మోసం వస్తుంది. అందుకే చెపు తున్నా బాబూ—నామాట ఇనండి. కథలుగా అన్నీ ఇనండి. అంతేగాని ఆదికోసం మాత్రం ఆశపడకండి" అన్నాడు గంగులు.

ఈశ్వర్‌కు నవ్వొచ్చింది. జాలీ వేసింది. ఇది ఇక్కడ అందరి నరనరాల్లో ఇమిడిపోయిన తత్వం. దొరికిందే తినటం అంతే! విధి లిఖితమై ఎంత వచ్చినా అంది పుచ్చుకో కానీ సొంతంగా ప్రయత్నించి నష్టపోకు, కష్టాల పాలవకు అనేది ఇక్కడి తత్వం. దీన్ని తనకెందరో నచ్చచెప్తారు. తనెందరికో తన గురించి తన కోరిక గురించి నచ్చజెప్పుకుంటూ రావాలి. ఆ ప్రయత్నాలు ఉమ దగ్గర ఆరంభం అయి నాయి. అవి అలా ఇక అనంతంగా కొన సాగాల్సిందే కాబోలు.

"సరే... చెప్పు" అన్నాడు ఈశ్వర్.

గంగులు లేచి నిలబడ్డాడు.

"రండి పోదాం" అన్నాడు గంగులు. ఈశ్వర్ గంగులు వెనక నిశ్శబ్దంగా నడిచాడు. గంగులు అతన్ని తిన్నగా పెద్దిరాజు కోటకు తెచ్చాడు.

పేరుకది పెద్దిరాజు కోటేగానీ, నిజానికి అదో రాజమహల్‌లాగ ఉంది. కూలినవి కూలిపోయినా ఇంకా మిగిలి పోయిన శిథిలాలే అతని కాలంలో వైభ వాన్ని ఇప్పటికీ చాటిచెబుతున్నాయి. అదే కోటలోకి ఎన్నోసార్లు, ఎన్నోసార్లు వచ్చా డతను. ఆడుకోవటానికి కొన్నిసార్లు, ఇంకెవరికో చూపించేందుకు కొన్నిసార్లు అయితే, ఇప్పటి రాక వెనుక ఆంతర్యం మాత్రం వేరు.

ఈ ఆలోచనతో చూస్తే అనిపిస్తోంది ఇంతటి రాజమహలూ పెద్దిరాజుకాలంలో బోసిగా ఉండివుండేది కాదన్నది నిజం. ఆ మూల గోడకు బహూశా వజ్రాల గడి యారం ఉండిఉండేదేమో! ఇటు పక్క దర్వాజాకు మీద ఇప్పటికీ లతల్లిన డిజైను ఉంది. లతలకు, పువ్వులకు




మధ్యలో ఖాళీలు – ఆ ఖాళీల్లో రత్నాలు ఉండేవా? వజ్రాలు ఉండేవా?? ఇదుగో, ఇక్కడే భటుల్నో, సేవకుల్నో పిలిచేందుకు గంట ఉండేది కాబ[illegible]...టంగ్ టంగ్...

"అయ్యా! చిత్తం"

ఎవరో వచ్చి వంగి దణ్ణం పెడుతున్నట్లుగా అనిపించింది ఈశ్వర్‌కు. ఒక్కసారి తల వొంచాడు– ఆ దండానికి ప్రతిగా అన్నట్లు.

గంగులు నవ్వాడు ఈశ్వర్ చేసిన పనికి.

"ఏంటి బాబూ..ఏటా పని?" అన్నాడు గంగులు నవ్వుతూ.

"పెద్దిరాజు ఉన్నపుడు ఇక్కడ ఎలా ఉండేదా అని ఆలోచిస్తున్నాను! ఇపుడా రాజులూ పోయాయి, ఆ రాజరికాలూ పోయాయి...!"

గంగులు నవ్వాడు. "ఎక్కడ పోయాయి బాబూ! మా కులంలోకి ఒక్కసారి తొంగి చూడండి. మీక్కనిపించేదంతా రాచోరి పద్దతులే!"

"అదేమిటి...మీ కులంలో రాజులు ఉండటం ఏమిటి?"

"రాజు అంటే మీరనుకొనే రాజవంశం బిడ్డ కాదు. పేరుకు మాదొకటే కులమైనా ఇందులో కూడా ఎన్నో కులాలున్నాయి. ఒక్కో కులానికి ఒక్కో రాజు. ఆ రాజు మాటే మా వాడలకు వేదం''

"ఏం చేస్తాడు ఆ రాజు?'' అనడిగాడు ఈశ్వర్ ఆశ్చర్యంతో.

"ఏదయినా చెయ్యొచ్చు. తన మాట మీరినోడిని కులంలోంచి వెలివెయ్యొచ్చు. మా కుటుంబీకుల్లో ఆస్తి పంపకాలొచ్చినపుడూ రాజుమాటే చెల్లుతాది. ఆయన మాటనే అన్నిటిలోనూ అందరికీ తప్పని సరిగా వినాల్సి ఉండేది. ఆఖరికి పెళ్ళిలోనూ అంతే–విడాకుల్లోనూ అంతే! అయినా, ఆ రాజుక్కూడా మాలో ఒక కులం వాళ్ళను ఇంకో కులపోళ్ళకు కట్టబెట్టే అధికారం మాత్రం లేదు. అందుకే కొందరు ఎవరికీ చెప్పకుండా ఇంకోకులం వాళ్ళనూ పెళ్ళాడ్డం ఉంది. అది బయట పడితే వాళ్ళిద్దర్నీ వాడలోంచి తన్ని తగిలేస్తారు. విడాకుల్లో మాత్రం ఇంత కచ్చితంగా ఉండేవోరుకాదు–ఎవడెక్కువ తాగిస్తే వాడు చెప్పేదే వేదం!" గంగులు చెబుతున్నది ఈశ్వర్‌కు చిత్రంగా అనిపించింది.

"మరి మీ రాజులు కూడా చేపలు పట్టేందుకు సముద్రంలోకి వెళ్ళాల్సిందేనా?"

"అది వాళ్ళ వాళ్ళ ఇష్టం. రాజు రాకపోయినా మేం పట్టిన చేపల్లో తలా కొన్ని మేమే ఇస్తాం. పెళ్ళి జరిపించినప్పుడు మేం కట్నకానుకలు రాజుకూ ఇస్తాం''

ఈశ్వర్‌కు అదంతా వింటుంటే ఓ సందేహం వచ్చింది. "మరి, మీ రాజే తప్పుచేస్తే...?"

"అందుక్కూడా మాలో జాగ్రత్తలు వున్నాయి బాబూ! రాజైనవాడికి ఏయే అధికారాలున్నాయో, ఏయే బాధ్యతలున్నాయో అన్నీ రాసిపెట్టి ఉన్నాయి. కానీ ఓసారి ఆ రాజుగోరికే ఆ పత్రంలో ఏముందో తెలుసుకొనే చదువు లేకపోయింది.దాంతో వచ్చింది చిక్కు..! అయినా మా వాడలో చాలామందికి ఇట్టాంటి పత్రం ఉందని కూడా తెలీదు''

"చిత్రంగా ఉంది గంగులూ! ప్రపంచం అంతా రాజరికంలోంచి బయటకు వస్తోంది గానీ ఇంకా మీ కులం మాత్రం ఆ వ్యవస్థనే




పట్టుకొని వేళ్ళాడటం తమాషాగా ఉంది"

గంగులు ఒక్కసారి తలెత్తి చూశాడు- ఏం మాట్లాడుతున్నావ్ అన్నట్లుగా.

''ఏంటండి అట్టా అంటారు? ప్రపంచంలో ఎక్కడా రాచరికం లేదా? ఎవరు చెప్పారా మాట? ఆమధ్య మనదేశానికి అదేదీ...ఆ బ్రిటన్ రాణమ్మ రాలా? రేడియోలన్నీ ఆమె గురించే చెప్తే...!" అన్నాడు గంగులు.

ఈసారి నివ్వెరపోవటం ఈశ్వర్ వంతు అయింది.



5

ఈశ్వర్ రోజూలాగే ఉదయం న్యూస్ పేపరు పట్టుకొని తిరగేస్తున్నాడు. ఆసక్తి కలిగించే వార్తలు, రాజకీయాలు చదవటం అతనికి ఇష్టం. అది పూర్తయ్యాక పేజీలు తిరగేస్తూ ఫొటోలు కనిపించినచోట ఆగి అవి చావు కబుర్లూ, దశదిన కర్మలూ అయినాసరే ఆ ఫొటోలకింద రైటప్ చదువుతాడు.

ఉమ అతనికి ఉండే ఈ హాబీని వేళాకోళం ఆడుతుంది.

"మీకెందుకు ఇవన్నీ?'' అనడుగుతుంది ఉమ.

"పేపర్లో వాళ్ళు వేయించారంటే ఏమిటి దాని అర్థం? అందరికీ తెలియాలని కదా! ఆ అందరిలో నేనూ ఉన్నాకదా..అందుకే చదువుతున్నా!"

"ఎవడో పుల్లాయ్ అమెరికా వెడితేనూ, ఇంకో ఎల్లాయ్ బాల్చీ తన్నేస్తేనూ....మీకేమిటి అందులో ఇంటరెస్ట్?"

"హా..అలా అనకు! ఆఖరికి పుల్లాయ్ కూడా అమెరికా వెళ్ళాడు గదా, మనం వెళ్ళలేకపోయామే అనుకొంటా. ఆ తర్వాత మనం ఎందుకు వెళ్ళలేం అనుకొంటా. ఆ తర్వాత..."

"వెళ్ళి వచ్చినట్లు కలగంటారు,.అంతే గదా!'' అంటుంది ఉమ నవ్వుతూ.

"చూస్తూండు...నువ్వు చూస్తుండగానే నేనూ ఈ ప్రపంచంలో ఓ గొప్పవాడిని అయిపోతా! అప్పుడు అర్థంఅవుతుంది నీకు! ఇంటర్వ్యూ కావాలంటే ఇరవై రోజులు ఆగమంటాను!'' అంటాడు ఈశ్వర్.

"చాల్లెండి. నిజానికి కలలుకనాల్సింది నేను. మీరు కనకండి పగటికలలు!" అంటుంది ఉమ-ఆ సంభాషణకు ఫుల్‌స్టాప్ పెడుతూ.

పేపరు తిరగేస్తోంటే ఈశ్వర్‌కు అదే గుర్తొచ్చింది ఆరోజు. వారంరోజులకిందట తప్పిపోయిన కుక్కపిల్లను తెచ్చి ఇస్తే పాతిక రూపాయలు బహుమానం ఇస్తానని చెప్తున్న ప్రకటన నుంచి పదేళ్ళకిందట చచ్చిపోయిన భార్య ఆత్మశాంతికి నివాళి వరకు- అన్ని ప్రకటనలూ చదివాడు. ప్రతి ప్రకటనా చదివాక అతనికి వాళ్ళా ప్రకటన ఇవ్వటంలోని ఉద్దేశం ఏమై ఉంటుందా అని ఆలోచించటం అలవాటు అయింది.కుక్కదొరికితె బహుమతి అంటే అది కుక్కపట్ల ఉన్న విశ్వాసాన్ని చూపుతుంది. మరి భార్య ఆత్మశాంతి కోరుతున్నాడంటే 'చచ్చి నన్ను సుఖ పెడుతున్నావ్,నువ్వూ సుఖపడు!' అంటున్నట్లు అనిపిస్తుంది ఈశ్వర్‌కు.

అంతా చదవటం అయిపోయాక పేపరు పక్కన పడేస్తోంటే అపుడు కనిపించిందతనికి ఆ ఫొటో. ఏదో రాష్ట్రలాటరీ ప్రకటన. మా 'టిక్కెట్టు కొనండి, మీ కలల్ని నిజంచేసుకోండి!' అని ఉంది. పక్కనే ఇంతక్రితం బహుమతి పొందిన అదృష్టవంతుడి ఫొటో, అడ్రసు ఉన్నాయి.

ఈశ్వర్ కింద పడేస్తున్న పేపర్ని ఇంకొంచెంసేపు పట్టుకు చూశాడు. ఆ ప్రకటన చూస్తున్నకొద్దీ అతనికి తనూ ఓ టిక్కెట్టు కొంటే! అదృష్టం బాగుండి దానికే బహుమతి వస్తే! ఆ బహుమతితో తన ఆశయాన్ని కార్యరూపంలోకి మార్చుకోగలిగితే!–అనిపిస్తోంది.

ఈశ్వర్ ఒక్కసారి తల విదిలించుకున్నాడు. ఎంత తెలివితక్కువ ఆలోచన అది! తను టిక్కెట్టుకొంటే ఆ ఒక్క టిక్కెట్టుకూ బహుమతి రావటమా? జరిగే పనేనా అది! అసలు ఆ ఆలోచన రావటమే తన మూర్ఖత్వానికి పరాకాష్ఠ.

తన ఆశయ సాధనకు డబ్బుకావాలి. నిజమే! కానీ ఆ డబ్బు తనకు లాటరీవల్ల రాదు. అదసలు సరైన మార్గమూ కాదు. ఈరోజునుంచి రోజూ ఒక్క లాటరీ టిక్కెట్టు కొంటూపోయినాకూడా ఈ జీవితం ఆఖరయ్యేలోపు కనీసం ఒక్క బహుమతి అయినా వస్తుందా అంటే అదీ సందేహమే!

డబ్బు సంపాదించటానికి అది కాదు పద్ధతి. వేరే మార్గం ఆలోచించాలి. ప్రభుత్వాన్నీ, సహాయక సంస్థల్నీ సాయం కోరాలి. శాస్త్రపరిశోధనలుచేపట్టే సంఘాల నుంచి ఆర్థికసాయం అడగాలి. కానీ అది సరిపోతుందా అన్నది ప్రశ్న. అందర్నీ కలిసి, అందరికీ నచ్చచెప్పి, వారిని ఒక కొలిక్కి తీసుకురాగలగటం తన చేతనయ్యే పనేనా? దానికన్నా ఏ టాటానో, బిర్లానో ఇలాటి పథకంలో పెట్టుబడి పెట్టమంటేనో...?

అదీ సరైన ఆలోచన అనిపించలేదు ఈశ్వర్‌కు. టాటా,బిర్లాలు ఇప్పటికే కొన్ని కోట్లలో మునిగిపోయి ఉన్నారు. అలాటి వారికి ఇలాటి సాహసకృత్యంమీద ఆసక్తి ఉండకపోవచ్చు. ఉన్నా వాళ్ళవరకూ తన ప్రతిపాదన తీసుకెళ్ళగలగటమూ కష్టమే. ఆ మూర్తిని చేరాలంటే మధ్యలో ఎందరు పూజార్లను అధిగమించాలో? అదీ జరిగే పనికాదు.

పోనీ...

ఈశ్వర్‌కు ఉన్నట్టుండి ఒక ఆలోచన వచ్చింది.

కింద పడేసిన పేపరును మళ్ళీ అందుకొన్నాడు. ఆ లాటరీ ప్రకటనలో ఉన్న విజేత పేరు ఊరూ చూశాడు. పేరు లక్ష్మీపతి. ఊరు అడ్రసు కూడా ఉంది ఆ ప్రకటనలో ఫొటో చూస్తోంటే అతని వయసు ముప్ఫయికి మించి ఉండదనిపిస్తోంది.

ఈశ్వర్ క్షణం ఆలోచించాడు. లోపలికివెళ్ళి కాగితం,కలంతీసుకొన్నాడు.

"శ్రీ లక్ష్మీపతిగారికి–

వార్తా పత్రికలో మీకు లాటరీలో బహుమతి వచ్చినట్లు చూశాను. సంతోషం. మీకు ఆ రొక్కం అందిందనే అనుకొంటాను. దాన్ని ఎలా ఖర్చుపెట్టాలో మీరింకా నిర్ణయించుకోకుండా ఉంటే నా దగ్గరో చక్కని పథకం ఉంది. మీ లాటరీకన్నా గొప్పది. మీరు ఖర్చుపెట్టే ప్రతి పైసకు కొన్ని లక్షల రెట్ల ఆదాయం ఉంటుంది. నేనే ఆ పథకాన్ని ఎందుకు అమలుచెయ్యకూడదా అని మీరు అను

క్రోవద్దు. ఆ పథకం అమలుకు సరిపడ పెట్టుబడి నా వద్ద లేదు. మీకు ఆసక్తి ఉంటే మిగతా వివరాలు ముఖతానే చర్చించు కొందాం. నా అడ్రసు కింద రాస్తున్నాను" అంటూ రాసి సంతకం పెట్టి కింద అడ్రసుకూడా రాశాడు ఈశ్వర్.

ఆ కాగితాన్ని జాగ్రత్తగా మడతపెట్టి కవరులో పెట్టబోయి ఆగి ఉమను పిలిచాడు. ఆ ఉత్తరం అందించాడు.

ఉమ ఆ ఉత్తరం చదివి పకాలున నవ్వింది.

"గొప్ప అయిడియాయే వేశావే!" అంది ఉమ.

"ఏం...ఏమైంది నా అయిడియాకు?"

"అహ..ఏంలేదు. ఎటొచ్చీ మీ అడ్రసు కింద ఎర్రగడ్డ హైదరాబాదు అనో, కిల్పాక్ మద్రాస్ అనో కూడా ఉంటే సరిపోయేదని అనుకొంటావా లక్ష్మీపతి. అంతే!"

"అంటే పిల్లాడినై రాశానంటావా ఉత్తరం?"

"మళ్ళీ అనటం కూడా దేనికి? మీ ఉత్తరమే దానికి రుజువు. లేకపోతే ఏమిటండీ ఇది...ఎవరో ముక్కూ ముఖం తెలీనివాడికి ఇలా ఉత్తరం రాయటం ఏమిటి? ఎన్నేళ్ళనుంచి కొంటున్నాడో లాటరీ టిక్కెట్లను ఆ మహానుభావుడు. ఇన్నాళ్ళకు ఓ ప్రైజ్ అంటూ వచ్చింది. ఆ డబ్బును కాస్తా మీరు పెట్టు సేళ్ళపాలు చేస్తానంటారు! బాగుంది!" అంది ఉమ వెటాకోళంగా.

"ఒక్కమాట చెప్పనా? నాకు ఈ ఉద్యోగం ఇచ్చినవాడు కూడా ముక్కూ ముఖం తెలీనివాడే! అయినా అప్లయి చేశాను. ఉద్యోగం వచ్చింది. ఇదీ అంతే!

దరఖాస్తు పడేస్తున్నా..."

"అంతేలెండి....ఆ తర్వాత ఇక వాడి ఫ్యూనరెల్ మరి!."

"ఛ ఛ...శుభమా అంటూ నేను నీకు చెప్తే ఇదా నువ్వు చెప్పేది...?"

"పోనెండి... సరిగ్గా చెప్తాను. మీ ఉత్తరం మీరు పోస్ట్ చెయ్యండి. మనం తాంబూలాలు ఇచ్చేశ తన్నుకు చచ్చేది వాళ్ళు గదా. మనకేమిటి వర్రీ ...?" అంది ఉమ.

"కానీ ఉమా..."

"మీరు చెప్పనక్కర్లేదు. నాకు తెలుసు. ఇపుడు గనక ఆ లక్ష్మీపతి పెట్టుబడి పెట్టకపోతే నష్టపోయేది వాడే నంటారు. అంతేగదా...!"

"అంతే... ఖచ్చితంగా అంతే!" అన్నాడు ఈశ్వర్.

"మరింకెందుకూ ఆలస్యం! వాడిని నష్టపోనిస్తే మనకొచ్చే లాభం ఏమిటి? ఉత్తరం పోస్టు చెయ్యండి...చూద్దాం ఏం జరుగుతుందో" అంది ఉమ.

ఈశ్వర్ ఇంకేమీ ఆలోచించకుండా ఉత్తరాన్ని పోస్టుచేశాడు. దానికి జవాబు వస్తుందని ఉమ అనుకోలేదుగానీ, ఈశ్వర్ మాత్రం రోజూ దాని గురించే ఆలోచించేవాడు. అతను అనుకొన్నట్లే జవాబు వచ్చిందో రోజు–

"డియర్ ఈశ్వర్...

మీ ఉత్తరం అందింది. నాకూ సంతోషమే. లాటరీ డబ్బు తీసుకొన్నాను. ఏం చేయాలో ఇంకా నిర్ణయించుకోలేదు. నేను సరైన పథకం ఏదైనా అయితే పెట్టుబడి పెట్టేందుకు సిద్ధమే! కానీ... ఖర్చుపెట్టే ప్రతి పైసాకు ప్రతిగా నాకు బోలెడంత పుణ్యం వస్తుంది గనుక 'గుడులు కట్టించండి, విరాళాలు ఇప్పించండి' అంటూ మాత్రం సలహాలు రాయ




కండి. ఇప్పటికే గుడులు కట్టించమని, చందాలు ఇవ్వమని రాసిన ఉత్తరాలు మా ఇంట్లో రెండు గదులు నింపాయి. అలాటి ఆలోచనకాక, నిజంగానే పెట్టుబడి రంగంలో గురించి అయితే, తప్పకుండా రండి! లాటరీలో ప్రైజ్ వచ్చాక ఉద్యోగం మానేశాను. ఇంట్లోనే ఉంటున్నాను. ఎప్పుడొచ్చినా మీ ఇష్టం!" అని ఉంది ఆ జవాబులో.

ఈశ్వర్ ఆ జవాబు చదువుకొని ఉలికిపడ్డాడు. అంటే...అంటే తన ప్రతిపాదనను పరిశీలించేందుకు ఒప్పుకొన్నాడన్నమాట! ఎటొచ్చీ దాన్ని ఒప్పుకొనేలా చేసుకొగలగటం తన ప్రజ్ఞాపాటవాల మీదే ఆధారపడి ఉంటుంది.

'ఉమా ...' అంటూ గట్టిగా కేకేసి జవాబుగా వచ్చిన ఉత్తరం గురించి చెప్దామనుకొన్నాడు. కానీ ఉమ వేళాకోళం ఆడేస్తుంది. 'కొంపదీసి అతనిది విశాఖపట్టణమో, ఆగ్రాయో కాదుగదా!' అంటుంది. అది వినటానికి బాగానే ఉంటుంది కానీ ఆ సెన్సాఫ్ హ్యూమర్ చాలా పించింగ్‌గా ఉంటుంది.

అందుకే ఈశ్వర్ ఆ జవాబును ఉమకు చూపించలేదు. ఆ మర్నాడే ఆఫీసులో సెలవు పెట్టి, ఉమకు తాను ఇన్‌స్పెక్షన్ మీద వెళ్లాల్సి ఉందని చెప్పి, లక్ష్మీపతి ఇంటికి బయలుదేరాడు.

లక్ష్మీపతి ఇల్లు చాలా నిరాడంబరంగా ఉంది. ఇల్లు బయటకు కనిపిస్తున్న దాన్ని బట్టి మూడు నాలుగు గదుల పోర్షన్ అయి ఉంటుంది. లోపల అంతకుమించి గదులు ఉండే అవకాశం కనపడటంలేదు. ఇంటి ముందు షాబాద్ రాళ్లు అందంగా పరిచి ఉన్నాయి. ఆ రాళ్లమీద - ఇంటికి ఒకపక్క ఉన్న బాదంచెట్టు ఆకుల నీడలు పడుతున్నాయి. అది వెలుగు నీడల మేలికలయికలా ఉంది.

ఈశ్వర్ అడుగులో అడుగు వేసుకొంటూ నడిచాడు.

మెట్లెక్కి లోపలికి నడవబోయి క్షణం ఆగి, తలుపు మీది గొళ్లాన్ని కొట్టాడు.

లోపలినుంచి 'ఎవరూ ?' అన్న కేక ఒకటి వినపడింది. రెండు నిముషాల తర్వాత ముందు కాళ్ళ పట్టాల గజ్జెల చప్పుడు, ఆ తర్వాత ఓ అమ్మాయీ వచ్చింది. ఆ అమ్మాయి వయస్సు ఇరవై పరిదాపుల్లో ఉండొచ్చు. చూడగానే ఆకట్టుకొనే విగ్రహం. ముఖానికి చెప్ప లేనంత అందాన్నిస్తున్న దొసగింజ బొట్టు. కన్నార్పకుండా ఈశ్వర్ ఆమెకేసే చూస్తూ ఉండిపోయాడు.

"చెప్పండి... ఎవరు కావాలి ?'' అంది ఆ అమ్మాయి. రెండు చేతుల్ని తలుపుకు రెండు పక్కలకూ బారజాపి.

ఈశ్వర్ సర్దుకొన్నాడు.

''లక్ష్మీపతిగారు ... ఆయన ఇల్లు ఇదేనా...?"

"ఇదే...ఆయనతో ఏంపని?''

"నేను..నాకు...అహ...ఆయన నాకు స్నేహితుడు!" అన్నాడు ఈశ్వర్ తడబాటుతో. ఆ అమ్మాయి నవ్వింది. ''లక్ష్మీపతిగారు అన్నారేమరి. అంటే మీకు స్నేహితుడు కాదన్నమాట! అయినా అన్నయ్య ఇంట్లో లేడు. ఉన్నా పిలవడు. పిలిచినా మీకే చందాలూ ఇవ్వడు. ఇప్పటికే చందాల పద్దు పెరిగిపోయింది. ఇంకో లాటరీలో ప్రైజ్ వస్తేగానీ ఆ వాగ్దానాలన్నీ తీర్చటం కుదరదు" అంది ఆ అమ్మాయి గుక్కతిప్పుకోకుండా.

ఈశ్వర్ నివ్వెర పోయాడు. తన

గెటప్ అలా ఉందా చందాలు అడుక్కొనే వాడిలాగ! అయినా అది ఆ అమ్మాయి తప్పు కాదు. తనే తనకేసు సరిగ్గా ప్రెజెంట్ చెయ్యలేకపోయాడు.

"చూడండి మిస్... మీ పేరేమిటో నాకు తెలీదు. కానీ మీ అన్నగారు నాకు స్నేహితుడు. అతనికోసం నేను... నా పేరు ఈశ్వర్..వచ్చానని చెప్పండి. అతను నన్ను కలుసుకొంటానంటేనే చెప్పండి, లేకపోతే లేదు. ఓకే...? ఒక్కసారి మీ బ్రదర్‌కు చెప్పండినేనొచ్చినట్లు...చాలు" అన్నాడు ఈశ్వర్.

ఆ అమ్మాయి ఒకసారి ఈశ్వర్‌కేసి పరిశీలనగా చూసింది. "అయితే మీరు చందాల బాపతు కాదంటారు. గుళ్లూ, మసీదులు, చర్చీలు- ఇవేవీ కాదంటారు? సరే....అయితే పిలుస్తాను. కానీ ఒక్క మాట! మా అన్నయ్యగారిని మీరెవరో తెలీదంటే మాత్రం లోపలికిరానివ్వను... గుర్తుంచుకోండి" అంటూ లోపలికి తిరిగింది, వెంటనే మళ్లీ వెనక్కు తిరిగి అంది "చూడండి మిస్-అన్నారు కదా... నా పేరు కల్యాణి" అంటూనే లోపలికి నడిచింది.

ఈశ్వర్‌కు మొన్ననే వెలిసిన ఉషారు పట్టొచ్చింది.

అతనా తాకిడినుంచి తేరుకునేసరికి మళ్లీ కల్యాణి రానే వచ్చింది-

"రండి లోపలికి! మీరు చందాలవాళ్లు కాదు అని చెప్పాడు అన్నయ్య"

ఆ మాట అనటంలో 'మీరు మా అన్నయ్య స్నేహితులు కారన్నది నాకు తెలుసు!' అన్నది ఈశ్వర్‌కు అర్థం అయింది. అది పట్టించుకోనట్లు ఈశ్వర్ లోపలికి నడిచాడు. అతనికో కుర్చీ చూపించి, తనో కుర్చీలో కూర్చుంటూ అడిగింది కళ్యాణి - "చెప్పండి...ఏం బిజినెస్?"

ఈశ్వర్ ఇలాటి ప్రశ్నలకు సిద్ధమయి లేడు.

"మీ అన్నగార్ని రానీయండి" అన్నాడు.

"ఇంకా అరగంట పడుతుంది. పూజచేసుకొంటున్నాడు. ఆలోగా మీ ప్లాన్స్ అన్నీ నాకు చెప్పండి" అంది కల్యాణి.

ఈశ్వర్ ఆమెకేసి ఇబ్బందిగా చూశాడు.

కల్యాణి పకాల్న నవ్వేసింది "ఓకే... మీ ఇష్టం. ఆ బిజినెస్ అంతా అతనితోనే మాట్లాడుకోండి. కానీ ఒక్కటి గుర్తు పెట్టుకోండి. మీరు ఏ వ్యాపారం చెప్పినా నావెల్‌గా ఉండాలి. లాభాలు బాగా ఉండాలి. ఇంకెవరూ ఆ వ్యాపారం చెయ్యనిది అయితే మరీ మంచిది. లాభాలూ మనవే అవుతాయి, పైగా మోనాపలీ.." అంది.

ఆ అమ్మాయి యధాలాపంగా అన్నా, ఆమె కోరిన లక్షణాలన్నీ తను చెప్పబోతున్న వ్యాపారంలో ఉన్నాయి. ఆమాటే అన్నాడు ఈశ్వర్ కల్యాణితో- "సరేలెండి...అందరూ ఇలాగే చెప్తారు. నిన్న ఒకరొచ్చారు—నావెల్ వ్యాపారమని. చెప్తూ. సినిమా తీద్దాం అన్నాడు. నావెల్ కథట. లాభాలు బాగా ఉంటాయట! చూడండి...అలాటి ప్రపోజల్ కాదు గదా మీది?" అనడిగింది కల్యాణి.

"కాదు!" అన్నాడు ఈశ్వర్.

"నావెల్ అన్నా కదానని నవలలు వేసే కంపెనీని పెట్టమనరుగదా కొంపదీసి!" అంది కల్యాణి మళ్లీ.

"అదీకాదు" అన్నాడు ఈశ్వర్.





కల్యాణి ఇంకొకటి రెండు వ్యాపారాలు చెప్పింది. ఈశ్వర్ అవీ కాదనేసరికి "అయితే అదేమిటో చెప్పండి....మీది నిజంగానే కొత్తరకం వ్యాపారంలాగ ఉంది" అంది ఆసక్తితో.

"అదుగో, మీ అన్నగారి పూజ అవుతున్నట్లుంది- గంటమోగుతోంది ఆయన్ను ఇటు రానివ్వండి...అన్నీ చెప్తాను" అన్నాడు ఈశ్వర్.

పేరు లక్ష్మీపతి. లాటరీలో బహుమతి కొట్టాడు అంటే మొదటిసారిగా లాటరీ టిక్కెట్టు కొన్నవాడు మాత్రం కాదు. ఆ అలవాటు ఉన్నవాడే అయివుంటాడు. అంటే సుమారుగా ఏ పదేళ్లనుంచో లాటరీ టిక్కెట్లు కొంటూ కలలుకంటూ ఉన్నవాడై ఉంటాడు. యువకులకు జీవితంలో తొలి రోజుల్లోనే డబ్బుమీద యావ పెరగదు. కాలం గడుస్తున్నకొద్దీ, ఆశలు పెరుగుతున్నకొద్దీ, బాధ్యతలు బరువవుతున్నకొద్దీ డబ్బంటే ఆశ పెరుగుతుంటుంది. అప్పుడు డబ్బు సంపాదించటానికి మార్గాలు వెతుకుతారు. ఇదంతా మనిషిలో రావాలంటే, అప్పటికి అతని వయసు కనీసం నలభై అయినా ఉంటాయి...ఇలా ఇన్ని కారణాలు ఆలోచించి, ఆఖరికి లక్ష్మీపతి వయసు ఏ యాభయి దరిదాపుల్లోనే ఉండి ఉంటుందని ఈశ్వర్ నిర్ణయించుకొన్నాడు.

తీరాచూస్తే వచ్చింది పాతికేళ్లనుంచి ముప్ఫయి సంవత్సరాల వయసులో కుర్రాడు! ఈశ్వర్ ముందతన్ని చూసి, అతను కాదేమో అనుకొన్నాడు.

"నా పేరు లక్ష్మీపతి. మీరు...ఈశ్వర్ అనుకొంటా!" అన్నాడు లక్ష్మీపతి.

కల్యాణి లక్ష్మీపతి కూర్చునే వరకూ ఆగి,వెంటనే అంది-"ఈయనేదో పూర్తిగా కొత్త బిజినెస్ గురించి చెప్తారట...అది విని వెడదామని ఆగాను. ఆయన అది కొత్తది అంటారేగాని, అదేమిటో చెప్పటంలేదు!"

లక్ష్మీపతి నవ్వాడు - "చెప్పండి. మా చెల్లెలికి నచ్చేది చెప్పండి. ఎందుకంటే లాటరీటిక్కెట్టు కొన్నది నేనే అయినా ఆ టిక్కెట్టుమీద వచ్చిన డబ్బంతా చెల్లెలిదే" అన్నాడు.

ఈశ్వర్‌కు ముందుగా తన మనసులోని సందేహాన్ని నివృత్తి చేసుకోవాలనిపించింది-"ఇలా అడుగుతున్నానని ఏమీ అనుకోకండి. సాధారణంగా యువకులెవ్వరూ లాటరీలపైపు దృష్టిని మళ్లించరు. ఆ వయస్సు అలాటిది. కష్టపడాలని, ఆదర్శాలతో, ఆశయాలతో పనిచేయాలని వాళ్లకు ఉంటుంది. అలాటి ఏజ్‌లోనే ఉన్న మీరు లాటరీ టిక్కెట్టు కొనటం ఏమిటి..? నాకు చిత్రంగా అనిపిస్తోంది!"

లక్ష్మీపతి 'చూశావా' అన్నట్లు చెల్లెలు కేసి చూశాడు. అర్థవంతంగా నవ్వాడు. "నమ్మండి నమ్మకపోండి, కానీ నాకో నమ్మకంవుంది.నా పేరు లక్ష్మీపతి. డబ్బు విషయంలో నేనేది అనుకొంటే అది జరుగుతుందని నా నమ్మకం! ఆ మాట కల్యాణితో అంటే నవ్వింది. 'ఏదీ, ఓ లాటరీటిక్కెట్టుకొను..చూద్దాం.నీకు ప్రైజు వస్తుందేమో!' అంది వేళాకోళంగా. 'నీ ఇష్టంవచ్చిన టిక్కెట్టుకొను, దాన్ని నాకు ఇయ్యి. దానికి ప్రైజు ఎందుకు రాదో చూస్తాను!' అన్నాను. బజార్లో జరిగిన సంభాషణ ఇది. ఆ మాట పూర్తికాగానే కల్యాణి లాటరీటిక్కెట్టు కొని ఇచ్చింది. 'లాటరీ వచ్చిందంటే అది నా మహత్యమే అనుకో! నా పేరు కల్యాణి. నేను తల పెడితే శుభమే జరుగుతుంది' అంది. 'సర్లే బహుమతి వస్తే నువ్వే తీసుకో' అన్నాను. అన్నట్లుగానే మరి బహుమతి డబ్బంతా




దానిదేగదా" అన్నాడు లక్ష్మీపతి.

ఈశ్వర్ నివ్వెరపోయాడు. డబ్బు కోసం అన్న, అక్క, చెల్లెలు, తమ్ముడు- అసలు ఏ సంబంధమూలేకుండా పోతున్న రోజులివి. ఇలాటిరోజుల్లో లక్ష్మీపతి అన్న మాటకు కట్టుబడి అంత డబ్బు ఇచ్చేస్తానన‌టం చిత్రమేమరి!

"చెప్పండి..మీ పథకం ఏమిటో?"

క్షణం ఆగాడు ఈశ్వర్. మనసులోంచి ఎన్నోసందేహాలు ఉవ్వెత్తున లేచిపడుతున్నా,వాటిని నొక్కిపడుతూ అన్నాడు- "చెబితే మీరు నవ్వుతారేమో! మీకు ఇష్టం లేకపోతే అలాచెప్పండి, నేనేమీ అనుకోను మీ డబ్బు ఎలా ఖర్చుపెట్టుకోవాలో నిర్ణయించుకొనేది మీరు. కాదనను. కానీ.. ప్రతిపాదనవిని మాత్రం నవ్వద్దు. ఇది జరిగేదేనా అని అనొద్దు.మనిషితల్చుకొంటే జరగనిదంటూ ఏదీలేదు! ఇదంతా ఉపోద్ఘాతం మాత్రమే.ఇక అసలు సంగతికి వస్తే.."అంటూ తనమనసులోని ఆలోచన చెప్పాడు. లక్ష్మీపతి అదంతా వింటూ ఉండిపోయాడు. అతనికి ఇది నమ్మబుద్ధి కావడంలేదు. ఇలా చెయ్యవచ్చుననేది అతనికి తెలుసుకానీ అలాటి పథకానికి తనే పెట్టుబడి పెట్టాల్సివస్తుందని అతను కలలోకూడా ఊహించుకోలేదు.

అంతా చెప్పాక అన్నాడు ఈశ్వర్ - "ఇక మీ ఇష్టం...మీకు నచ్చితే వివరాలు ఆలోచిద్దాం! కాని ఒక్కవిషయం-ఇలాటి పెట్టుబడి పెట్టడం అంటే మాటలుకాదు. ఇది పూర్తిగా హైరిస్క్ బిజినెస్.నిజానికి ఇది బిజినెస్‌కూడా కాదు. పూర్తిగా స్పెక్యులేషన్. జూదం అనుకోండి. గెలిచామా, అదృష్టవంతులమవుతాము. కాదా నష్టపోయేది ఇంతా అంతా కాకపోవచ్చు. అసలు డబ్బు పూర్తిగా నష్టపోయేందుకు సిద్ధపడితేనే చేపట్టటం మంచిది! ప్రపంచంలో కొన్నివందలచోట్లకొన్ని కోట్లవిలువచేసే నిధి నిక్షేపాలు ఉన్నాయి. వాటిని కనుక్కోవడం ఒక ఎత్తు! వాటిని కనుక్కొన్నాక సొంతం చేసుకోవటం ఇంకో ఎత్తు. ఒకేఒక్క తప్పటడుగుపడితేచాలు, నష్టపోయేది డబ్బేకాక,ప్రాణంకూడా కావచ్చు. అయితే నేనడిగేది మిమ్మల్ని కేవలం డబ్బుమాత్రమే పెట్టుబడి పెట్టమని! నా ప్రాణం నేను పెట్టుబడి పెడతాను" అన్నాడు ఈశ్వర్.

గదిలోవున్న ఇద్దరి ముఖాల్నీ ఈశ్వర్ పరిశీలనగా చూశాడు. ఇద్దరి ముఖంలోనూ ముఖ్యంగా ఆశ్చర్యం. ఇలాటి ప్రతిపాదనా తమ ముందుకొచ్చిందన్న ఆశ్చర్యమే వారిని ముంచెత్తుతోంది.

క్షణంఆగి అంది కల్యాణి- "మీరు అన్నది నిజంగానే చాలా నోవెల్‌గా ఉంది. అసలు ఇలాటివి ఉంటాయనికూడా నాకు తెలీదు"

"ఇది చాలా మామూలు మిగతా ప్రపంచంలో! సాల్వేజింగ్ ఆఫ్ ఓల్డ్ సంకెన్ షిప్స్ ఈజ్ ఆల్సో వెల్‌నోన్ బిజినెస్! ఎటొచ్చీ మనదేశంలో ఇలాటివి జరిగాయో లేదో నాకు తెలీదు. జరిగినట్లయితే నాకు తెలీదు"

"పోనీ, ప్రపంచంలో ఎక్కడైనా జరిగాయా చెప్పండి?'' ఆసక్తితో అడిగింది కల్యాణి.

"ఓ...ఎన్నో జరిగాయి. దాదాపు రెండువందల సంవత్సరాలక్రితం-అంటే 1799లో ఇంగ్లండ్‌నుంచి 'లుటైన్' అనే నౌక బయల్దేరింది. నౌకనిండా బంగారమే!కానీ అప్పటికే నెపోలియన్ వల్ల తదితర కారణాలవల్లాప్రపంచంలో అంతటా యుద్ధజ్వాలలు అలముకొన్నాయి. ఏం

జరిగిందోకాని ... బహుశా తుఫాను కారణం అనుకొంటా-ఆ నౌక హాలెండ్ ప్రాంతంలో కేవలం ఆరేఆరు మీటర్ల లోతు నీరున్న సముద్రంలో మునిగి పోయింది. నౌక పైభాగమంతా కనిపిస్తోనే ఉందిగదా, ఎందరో చేపలుపట్టేవాళ్లు, ఆ దారినపోయే ఇతర నౌకలవాళ్లు వచ్చి లుటైన్‌లోని బంగారాన్ని అంతా కొల్ల గొట్టేశారు. ఆ నౌక మునిగిపోయినందుకు లండన్‌లో ఓ భీమాకంపెనీ ఆరోజుల్లో తొమ్మిదిలక్షలపౌండ్లు పరిహారం ఇచ్చింది. ఇప్పటికీ ఆ నౌకలో ఇంకా ఎంతో బంగారం ఉందని ఎందరో నమ్ముతున్నారు. న్యూజీ లాండ్‌కు చెందిన మార్టిమార్ అనే వ్యక్తి ఆ నౌకను ఇంకా వెతికేందుకు ఈమధ్యనే లాయిడ్ కంపెనీవాళ్ళ అనుమతి కూడా పొందాడు" అని ఆగాడు ఈశ్వర్.

అంతా విని కల్యాణి నవ్వేసింది. "మీరే చెప్తున్నారుగదా, నౌక పైభాగం అంతా పైకి కనిపిస్తోందని! ఇక వెతకటంలో ఏముంది కష్టం? మనంకూడా వెళ్ళి వెతికితే మనకూ దొరుకుతుందేమో బంగారం! అందులో శ్రమ తక్కువ, లాభం ఎక్కువ" అంది.

ఈశ్వర్‌కు కల్యాణి అన్నది నిజమే అనిపించింది. "పోనీ, ఇంకోటి చెప్తాను. 1912 ఏప్రిల్ పదిహేనో తేదీన 'టైటా నిక్' అనే నౌక ఒకటి మునిగిపోయింది. ఉత్తర అట్లాంటిక్ సముద్రంలో న్యూ ఫౌండ్‌లాండ్ ప్రాంతంలోని తీరం దగ్గర ఎక్కడో మునిగిపోయింది. ఆ నౌకలో కొన్ని కోట్లవిలువచేసే బంగారం ఉండం టారు. ఇంతవరకూ ఆ నౌక ఆచూకీయే తెలీలేదు. ఆ మధ్య ఆనౌక కోసం ప్రయ త్నించి విఫలమయిన జాక్ గ్రిమ్ అనే కోటీశ్వరుడు ఇపుడోతమాషాచేస్తున్నాడు. అచ్చం అలాటి డిజైన్‌తోనే ఒక చిన్న బంగారపు నౌకను తయారుచేయించి దాన్ని అమెరికా, కెనడాల్లో ఎక్కడోఒక చోట దాచిపెట్టేశాడు. అసలు నౌక అక్కర్లేదు. కనీసం ఈ చిన్న బొమ్మ నైనా కనుక్కోండి చూద్దాం అని అందరికీ ఛాలెంజ్ విసిరాడు. ఈ బొమ్మ నౌక ఎక్కడుందో తెలియజేసే ఆధారాలు-అవే క్లూలు నెలకు ఒకటిచొప్పున విడుదల చేస్తాం అనీ అన్నాడు. ఇప్పటికీ ఈబొమ్మ నౌక దొరకలేదు. అసలు నౌకా దొరక లేదు" అన్నాడు ఈశ్వర్ ఇంకో సంఘటన చెప్తూ.

లక్ష్మీపతిఆశ్చర్యపోయాడు-"నిజంగా ఇది బాగుంది! అసలా అయిడియా రావ డమే గొప్ప! అసలు నౌక ఆచూకీ పట్టటం ఎలా ఉన్నా బొమ్మ నౌకను ఆచూకీ పట్టటం గొప్పనుకొంటాను!"

ఈశ్వర్ నవ్వాడు. "మీరనేది నిజమే కానీ, అది జాక్‌గ్రిమ్ సొంత అయిడియా కాదు. కిట్ విలియమ్ అనే ఓ రచయిత అంతక్రితమే ఆ పథకాన్ని అమలుచేసి చూశాడు. తన పుస్తకం అమ్మకాలు పెంచుకోవటానికి తగిన మార్గమేమిటా అని ఆలోచించాడనుకొంటాను. ఇది తట్టి ఉంటుంది. ఫలితంగా ఓ బంగారు జింకను తయారుచేయించి ఎక్కడో దాచేశాడు. ఆ బొమ్మ ఎక్కడో ఎన్నో ఆధారాలు చూపిస్తూ 'మాస్కరేడ్' అన్న పుస్తకం రాశాడు. ఈ ప్రయోగం తమాషాగా ఉందని భావించిన ఎందరో ఆ పుస్తకాన్ని కొన్నారు. ఆ అయిడియానే జాక్‌గ్రిమ్ సొంతంచేసుకొన్నాడు. గ్రిమ్ చేయించిన బంగారు నౌక విలువకూడా చాలా ఎక్కువేననుకొంటాను!" అన్నాడు ఈశ్వర్.

కల్యాణి ఇది విని నవ్వింది. "ఒకటి చెప్పండి...ఈ రెండో నౌక పేరేమిట న్నారు.. టైటానిక్ గదా..ఇది దొరికిందా ఎవరికైనా..?"

"లేదు!"

"మరింకేం, అలా చెప్పండి! పైకి కని పిస్తోందిగాబట్టి లుటైన్‌ను ఎందరో వెతి కారు. బంగారం పట్టుకుపోయారు. ఇది ఎక్కడ మునిగిందో తెలీదుగనుక ఎవరూ ఆచూకీ పట్టలేకపోయారు. మీరిదికాదండీ- దొరికిన నౌక గురించి చెప్పండి. ఒక్కటి, ఒక్కటంటే ఒక్కటిచాలు, పైకి కనపడ కుండా ఉండి మునిగిపోయినదాన్ని పైకి తీసిన సంఘటన ఒక్కటి చెప్పండి! చాలు!!" అంది కల్యాణి.

ఈశ్వర్ మళ్ళీ దెబ్బతిన్నాడు.

పొరబాటు తనదే! రెండు సంఘట నలు చెప్పాడు. రెండూ నిజంగా చరిత్రలో జరిగినవే! అయితేనేం, ఆరెండూ తనుకోరెన దానికి బలాన్ని ఇచ్చేవిగా లేవు. ఎంపి కలో పొరబాటు జరిగిందన్నమాట! ఈసారి ఆ తప్పు జరగనీయకూడదు. జాగ్రత్తగా ఆలోచించి సరైన ఉదాహరణ చెప్పాలి అనుకున్నాడు.

అయిదారు నిమిషాలపాటు ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

ఆఖర్న కల్యాణే అంది-"పోన్లెండి అనవసరంగా శ్రమపడకండి! ఎవరో ఏదో చేశారని మనం అది చెయ్యలేం. మీరు చెప్పే పథకం బాగుందిగానీ చరిత్రలో అలాంటి ప్రయత్నం చేసిన తొలి ఫూల్స్ మేమే కావటం మాకిష్టం లేదు. మీరు ఇలాటివి గతంలో కూడా జరిగాయని, కనీసం ఒక్కడైనా విజయం పొందాడని చెప్పగలిగితే అప్పుడు ఆలో చించేవాళ్ళం. మీరు రేపు రండి...మిగతా వివరాలు మాట్లాడుకొందాం, మీరప్పటి కైనా ఒక్కటి చెప్పగలిగితే ..." అనే సింది ఖరాఖండిగా.

ఈశ్వర్ ముఖాన కత్తివేటుకు నెత్తురు చుక్క లేకుండా పోయింది.

లక్ష్మీపతికేసి చూశాడు.

"కల్యాణి అంటున్నది సబబుగానే ఉంది. మీరనేది నిజమే. ఇది హైరిస్క్ ఇన్వెస్ట్‌మెంట్. అయినా పెట్టుబడి పెట్ట టానికి మాకూ నమ్మకం కలగాలి. గుర్రప్పందాలు జూదమే అయినా అక్కడ కొందరు గెలిచినట్లు మనకు తెలుసు. మనం గెలవమేమో అన్న సందేహం ఉన్నా గెలిచినవాళ్ళను చూస్తే పందెం కట్టబుద్ధి వేస్తుంది. ఇదీ అంతే! గెలిచినవాడిని ఒక్కడిని చూపించండి...అపుడు ఆలోచిద్దాం! అలా కాకపోతే, ఇంత డబ్బు తీసుకెళ్ళి సము ద్రంలో పారబొయ్యటం ఎంతసబబో మీరు చెప్పండి" అన్నాడు లక్ష్మీపతి.

అయిపోయింది! - తన పథకం మట్టి గొట్టుకుపోతోంది. కేవలం ఒక్కటంటే ఒక్కటి గుర్తొస్తే ఎంత బాగుండును!

కానీ అవసరం ఉన్న సమయంలో గుర్తొస్తే వాటి విలువ ఏముంటుంది? మహాభారతంలోని కర్ణుడు గుర్తొచ్చాడు. ఈశ్వర్‌కు ఆ క్షణంలో! ఎన్నో అస్త్ర శస్త్రాలను అవలీలగా ప్రయోగించగల వీరుడయి వుండి, అనేక శాపాల కార ణంగా ఏ మంత్రాన్నీ ఉచ్ఛరించలేక, ఏదీ గుర్తు రాక ఆఖరికి అన్ని శక్తులూ కోల్పోయి దెబ్బతినేశాడు కర్ణుడు. తన పని అంతేనా...?

ఒక్కటి గుర్తొస్తే చాలు.... ఏదైనా ఒక్కటి...

కల్యాణి లోపల్నించి కప్పులతో




కాఫీ తెచ్చింది. చాలా యాంత్రికంగా అందుకున్నాడు. తాగుతున్నది కాఫీయో, కషాయమో గుర్తించని విధంగా అతను గడగడా తాగేశాడు. కాఫీ ఒక్కో గుక్క లోపలికి పోతుంటే అతనికి ఎన్నెన్నో గుర్తుకు రావటం ఆరంభమయింది. కాఫీ కప్పు కింద పెడుతూ అన్నాడు ఈశ్వర్-

"మీరు నాకు రేపటి వరకు టైం ఇచ్చారు. అక్కర్లేదు. ఇప్పుడే...ఇప్పుడే చెప్తాను వినండి!"

కల్యాణి అతన్ని మెచ్చుకోలుగా చూసింది.

"చెప్పండి" అంది.

"ఇది ఇప్పటి సంగతి కాదు. 1545 జూలై పందొమ్మిది దిన జరిగింది. అప్పట్లో బ్రిటన్‌ను ఎనిమిదో హెన్రీ పాలించే వాడు. ఫ్రాన్సు దేశంవాళ్ళు ధండెత్తి వస్తే, ఆ ఆక్రమణదారుల్ని ఎదుర్కోవ టానికి ఆయన స్వయంగా తన నౌకా దళాన్ని నడిపించాడు. నౌకాదళానికంతా నాయకత్వం వహించే ముఖ్య నౌకను 'ఫ్లాగ్‌షిప్' అంటారు. హెన్రీ ఫ్లాగ్‌షిప్ పేరు 'మేరీరోజ్' దానిమీద 415 మంది నావికులు, మూడొందలమంది సైనికులు, మరో తొంభయిమంది ఫిరంగుదార్లు ఉన్నారు. అలాటి నౌక బరువు ఎక్కువ కావటంవల్ల హెన్రీ చూస్తుండగానే మునిగిపోయింది. దాన్ని రెండేళ్ళకిందటే పైకి తీశారు" అన్నాడు ఈశ్వర్.

క్షణం ఆగి అడిగింది కల్యాణి-

"ఇంతకీ అందులో ఏముంది?"

"అందులో బంగారంలాంటిదేమీలేదేమో కానీ ఆ నౌకకున్న చారిత్రక విలువ మాత్రం చాలా ఎక్కువ! ముఖ్యంగా అది బ్రిటన్ దేశానికి ప్రతిష్టలాంటిది. ఫ్లాగ్ షిప్ పడిపోవటం అంటే యుద్ధంలో ఓడి పోవటమనే అర్థం. పైగా దానికి హెన్రీ చెల్లెలు మేరీ పేరే పెట్టారు. ఆరోజుల్లో అసలు నౌకా యుద్ధాలు కూడా దగ్గర దగ్గర్లోంచే జరిగేవి. అలాటిది మేరీరోజ్ నౌకమీంచి ఎంతో దూరంగా వున్న నౌకలమీదకు కూడా ఫిరంగులు పేల్చే వీలు ఉండేదట! ఆ నౌక మునిగిపోయి ఎందరో చనిపోయారు. ఆ నౌకను మళ్ళీ బయటకు తీయటం అంటే నిజానికి మళ్ళీ ఒకసారి అగాధంలోకి వెళ్ళటమేననాలి! పైకి తీసిన రోజు చూస్తే, ఆ నౌకలోని ఫిరంగులన్నీ పోరుకు సిద్ధంగా ఉన్నాయి. నాలుగువేల బాణాలు విల్లుల మీద ఎక్కుపెట్టినవిఎక్కుపెట్టినట్లే దొరికాయి. అంతెందుకు నౌకమీద ఎవరో ఆడుకొం టుండగా జరిగినట్లుంది ఆ ప్రమాదం. అచ్చం వాళ్ళు ఆడుతూ వదిలేసిన చద రంగం కూడా అలాగే దొరికింది" అన్నాడు ఈశ్వర్ ఎంతో ఉత్సాహంతో

"అంటే...దీన్ని ఎవరూ డబ్బుకోసం బయటకు తీయలేదన్నమాట" అంది కల్యాణి.

ఈశ్వర్ మళ్ళీ కంగుతిన్నాడు. మళ్ళీ పప్పులోనే పడింది అడుగు! ఎక్కడో ఏదో తేడా వస్తూనే ఉంది. ఆ పిల్ల దాన్ని పట్టేస్తూనే ఉంది. ఎలాగ ఈ ప్రమాదం నుండి తప్పుకోవడం??

"ప్రతి పనిని మనం డబ్బుతోనే కొలవలేం! మేరీరోజ్‌కు చరిత్రలో ఎంత విలువఉందోఎవరూచెప్పలేరుఅలాటిదాన్ని మనం డబ్బుతోనే లెక్కగట్టడం అంటే తప్పవుతుందేమో! అంతెందుకు, ఆనౌకను పైకి తీయటానికి..పైకితియ్యటానికే సుమా ముందు జరిగిన పరిశీలనలు, పరిశోధనలు, అందులో పాల్గొన్న వ్యక్తుల జీతభత్యాలు వగైరాలన్నీకాదు...కేవలం పైకి తీసేం


చతుర ... 55

దుకు మాత్రమే ఉపయోగించిన క్రేన్‌కు రోజు అద్దె పాతికవేల పౌండ్లు. అంత ఖర్చు పెట్టి వాళ్ళు తీసింది కేవలం ఆ చెక్కనౌక అంటే ఎవరయినా ఏం చెప్ప గలరు?" అన్నాడు ఈశ్వర్.

"మీరనేది నిజమేలెండి" అన్నాడు లక్ష్మీపతి.

కల్యాణి కూడా తల ఊపింది. "ఆ విషయం నేనూ ఒప్పుకొంటా! డబ్బు ఒకటే ముఖ్యం కాదు! కొన్ని కొన్ని కార్యాలు తలపెడితే, అందులో డబ్బుకు మించిన అంశాలెన్నో ఉంటాయి'' అంది.

ఈశ్వర్‌కు ఇంకోటి గుర్తొచ్చింది. "పోనీ, మీకుఇంకోటి చెప్తాను...వినండి!" అన్నాడు.

కల్యాణి ఆపేసింది. "అక్కరలేదండీ! ఈసారి మీరు చెప్పేదాంట్లో డబ్బు గురించే ఆలోచన ఉంటుంది. నౌకను పైకి తీశాక వాళ్ళకు ఎంత వచ్చిందో ఆ వివ రాలు చెప్తారు కాబోలు! వద్దులెండి!! ఆలో చించాల్సింది అదికాదు...మీరు ముందే చెప్పారు ఇది హైరిస్క్ ఇన్వెస్ట్‌మెంట్ అని! ఒప్పుకొంటున్నాం. ఎవరికో డబ్బు వచ్చినంతమాత్రాన మనకూ వస్తుందను కోవటమూ తప్పే! వాళ్ళెవరో లక్షలుపెట్టి కోట్లు గడించుకొన్నారు గనుక మనమూ ఆ పనేచేద్దాం అనుకోవటం తెలివితక్కువ. అలావద్దు మనంతట మనం ఈ పెట్టుబడి పెట్టటమా వద్దా అనేది ఆలోచించుకోవాలి! అంతే!!" అంది.

ఈశ్వర్‌కు ఆమె ధోరణి ఏమిటో అర్థం కావటంలేదు.

"పెట్టుబడి పెట్టటంవల్ల నష్టమే ఎక్కు వగా ఉండే అవకాశం ఉందమ్మా మరి! మన పెట్టుబడి ఎంతయినా ఆఖరికి పైసా కూడా రిటర్న్ రాకపోవచ్చు. నాకెందుకో ఆ ప్రమాదమే ఎక్కువగా కనిపిస్తోంది!" అన్నాడు లక్ష్మీపతి.

"అవును...నిజమే! పెట్టుబడి పెట్టటం వల్లఅదీనష్టం పెట్టుబడి పెడితేఏమిటిలాభం? మనమొక అద్భుత కార్యానికి తోడ్పడ్డా మనే తృప్తి ఉంటుంది" అంది కల్యాణి

"కావచ్చు. కానీ ఆ తృప్తి ఖరీదుకొన్ని లక్షల్లో ఉంటుంది" అన్నాడు లక్ష్మీపతి.

"నిజమే! కానీ ఒక్కమాట- మనకు అసలు ఈ లాటరీయే రాలేదనుకో! అపుడు మన పరిస్థితి ఏమిటి? లాటరీ టిక్కెట్టు ధరే మనక్కు నష్టం కదా! ఇపుడు లాటరీలో వచ్చిన డబ్బంతా పెట్టుబడి పెడు తున్నాం అనుకో- నష్టపోతామా టిక్కెట్టు ధరే మనకు నికరనష్టం! అలాకాక కలిసివస్తోందా కొన్ని కోట్లు కలిసొస్తాయి. పైగా ఇలాటి సాహసకార్యం చేపడు తున్నామనే తృప్తి మిగులుతుంది! ఆ తృప్తికి ఎవరు కడతారు విలువ?" అంది కల్యాణి.

"అంటే నీ ఉద్దేశం...?"

"కరక్టే! మనం ఈ పథకంలో పెట్టు బడి పెడుతున్నాం. నష్టమో, లాభమో దేనికయినా సరే సిద్ధం! కేవలం ఇదో ఎడ్వెంచర్‌గానూ, ఇదో గొప్ప తృప్తినిచ్చే ప్రయత్నంగానూ ఆరంభిస్తున్నాం అను కొంటే సరి!!" అంది కల్యాణి.

ఈశ్వర్ ఆశ్చర్యపోయాడు. అయితే తన ప్రయత్నం సక్సెస్...కనీసం ఇంత వరకూ! 'ఓ గ్రేట్!' అనుకొన్నాడు.

"సరేనండి అయితే. మేం మీ సాగర మథనానికి సాధనసంపత్తులు సమ కూరుస్తాం!" అంది కల్యాణి.

"మంచి పేరు పెట్టావ్, 'సాగర మథనం!' కానీ ఎటొచ్చీ ఆనాటి సాగర మథనంలోలాగ ఏ హాలాహలమో బయట





పడితేనే ప్రమాదం...!"

"అలాంటి ప్రమాదం ఏదీలేదు. ఉన్నా నేను ఉండనే ఉన్నాను. మీరు మర్చిపోయారేమో..నా పేరు ఈశ్వర్! ఎలాటి విషాన్ని అయినా హరాయించుకోగలను" అన్నాడు ఈశ్వర్.

"ఆ ప్రమాదం ఉండదులెండి! నా ఉద్దేశం ప్రకారం మనకు లక్ష్మీప్రసన్నమే జరుగుతుంది"

"అయితే లక్ష్మీపతిని నేను ఉండనే ఉన్నాను!" అన్నాడు లక్ష్మీపతి.

"మరి ఇప్పుడు చెప్పండి. మనం ఎలా ప్రొసీడ్ అవుతున్నాం? ఏం చేయబోతున్నాం?" అనడిగింది కల్యాణి.

ఈశ్వర్ గొంతు సవరించుకొన్నాడు.

"పాతకాలం పడవలు చెక్కతోనే తయారుచేసేవారు. ఇప్పుడా పద్ధతిపోయి స్టీల్‌తో చేస్తున్నారు. చెక్కపడవలు గనుక నీళ్ళల్లో మునిగితే కొన్నాళ్ళకు అవి ఆ నీళ్ళలోని పరిస్థితులలో మాత్రమే చెక్కుచెదరనిస్థితికి చేరుకొంటాయి. కొన్ని ఆ నీళ్ళలోనే నాశనం కూడా అయిపోతాయి. చెక్కుచెదరనివి కొన్ని ఉన్నా వాటిని అవి ఎక్కడ ఉన్నాయో కనిపెట్టి సముద్రంలోకి పైకితెచ్చేసరికి ఇక్కడి వాతావరణానికి అవి రాగానే నాశనం అయిపోయే ప్రమాదమూ ఉంది. చెక్కపడవల్లో పోయినవిపోగా మిగిలినవి ఆ పడవల్లో ఉన్న లోహాలు మాత్రమే! ఇవి మామూలుగా మన కంటికి కనపడవు. మన కళ్ళు భూమ్మీద వస్తువుల్ని సరిగ్గా చూడగలవు. కానీ అదే సముద్రంలో అయితే అలాకాదు. అసలు దూరానికన్నా అవి నిజంగా దగ్గరగా ఉన్నట్లు కనిపిస్తాయి. అంటే పది అడుగుల దూరంలో ఓ వస్తువు ఉందనుకోండి అది మనకు ఏ ఆరేడు అడుగుల దూరంలోనే ఉన్నట్లు అగుపిస్తుంటుంది. అలాగే ఉన్న పరిణామాలకన్నా పెద్దవిగానూ కనిపిస్తుంటాయి. ఇలా కనిపించేవి కొన్నే! అలా కనిపించని వాటిని మనం వేరేవిధాలుగా గుర్తించే ప్రయత్నాలు చెయ్యాల్సి ఉంటుంది. ఇపుడు ఎన్నో కొత్త టెక్నిక్స్ ఉన్నాయి గనుక షిప్‌లొకేషన్ కష్టం కాకపోవచ్చు.

అయినా దానికూ్కడా తీవ్రంగా పరిశోధనలు జరిపి, అదెక్కడ మునిగిపోయిందో తెలుసుకుంటే తప్ప మనకు తగిన ఫలితం దక్కకపోవచ్చు! దీనికితోడు మనం ఓషనోగ్రఫీ, కోస్ట్‌గార్డ్‌ల వంటి ఎన్నో శాఖలనుంచి అనుమతి కూడా పొందాల్సి ఉంటుంది. ఇవన్నీ పూర్తయ్యేసరికి ఏడాది పట్టొచ్చు... రెండేళ్లు పట్టొచ్చు. అసలు ఇలాటి పనులు ఏ వ్యక్తులకూ అప్పజెప్ప కూడదని కూడా ప్రభుత్వం భావించి మన ప్రతిపాదనను కొట్టిపారెయ్యవచ్చు కూడా! అయినా ప్రయత్నించి చూడటం మన ధర్మం" అన్నాడు ఈశ్వర్.

కల్యాణి నెమ్మదిగా అంది-"సరే, మీరు చెప్తున్నదాన్నిబట్టి చూస్తోంటే మనం ఈ ప్రతిపాదనకు సరైన కార్యరూపమే ఇవ్వగలమనిపిస్తోంది. అలాటపుడు మనం సరిగ్గా ఎంత పెట్టుబడి పెడుతున్నామో, ఒకవేళ మనం ఈ కార్యంలో సఫలం పొందితే ఎవరికెంత వస్తుందో అన్నీ నిక్కచ్చిగా మాట్లాడుకోవటం మంచిది"

"నిజం చెప్తున్నాను నేను – నాకు ధనాశ లేదు. కేవలం ఓ సాహసంచేసి చూద్దాం అన్నధ్యాసతోనే ఈ ప్రయత్నం ఆరంభించాను. అంతమాత్రాన రేపు మనం ఆ పడవను లొకేట్ చేసి, బంగారం




పొందగలిగితే - అది నాకు వద్దనేంత మూర్ఖుడిని కాను! అంతర్జాతీయంగావున్న ఆనవాయితీలను బట్టి, ఇలాటి ట్రెజర్ హంటర్స్‌కు లభించే నిధులలో డెబ్భయి శాతం వారి సొంతమే అవుతుంది. మిగిలిన ముప్ఫయిశాతం ప్రభుత్వ పరం అవుతుంది. ఆ లెక్కలో చెప్పాలంటే దొరికినదాంట్లో డెబ్భయి శాతం మనదవుతుంది. పెట్టుబడి మీరు పూర్తిగా పెట్టాల్సి ఉంది. నేనేమాత్రమూ పెట్టుబడి పెట్టలేను. కనుక యాభై శాతం మీరు తీసుకోండి, మిగిలిన ఇరవైశాతమూ నాది... ఓకే?" అన్నాడు ఈశ్వర్.

ఆ ప్రకారమే రాతకోతలు కూడా పూర్తిచేసుకొన్నారు. అది పూర్తయ్యాక ఈశ్వర్‌కు కొండంత బలం లభించినట్లయింది. ధైర్యంగా ముందడుగు వేశాడు.



## 6

ఈశ్వర్ ముందుగా తెలుసుకోవాలనుకున్న విషయం ఒకటి ఉంది. అది ఆ పడవ ఎలా మునిగిపోయిందీ అనేది. పడవ చాలా కారణాలుగా మునిగిపోయి ఉండొచ్చు. ఏ కారణం వల్ల మునిగిపోయిందీ, ఎక్కడ మునిగిందీ తెలిస్తే దాన్ని పైకి తీయటం తేలిక.

గంగులు చెప్పినదాన్నిబట్టి చూస్తే ప్రపంచ యుద్ధం జరుగుతున్న రోజుల్లో జరిగిందది. ఆ రోజుల్లో తుఫానులు ఏమైనా వచ్చాయా? వచ్చి ఉంటే అవి ఏ ప్రాంతాల్లో వచ్చాయి? ఆ తుఫానుల్లో కొట్టుకుపోయిన నౌకలు, పడవలు ఏవి? అవి ఏ ప్రాంతాల్లో ఉన్న తర్వాత కనపడటం మానేశాయి?-ఇలాటి అంశాలన్నీ క్షుణ్ణంగా పరిశీలించాల్సి ఉంది. ఇలాటి వాటికి చాలావరకు వాతావరణ శాఖలవారి పాత కాలం రికార్డులు ఎంతో సాయపడతాయి. ఎటొచ్చీ అందులో ఏ ఒక్క అంశాన్నీ విస్మరించకుండా జాగ్రత్తగా ప్రతిదీ పరిశీలించి గుర్తుంచుకోవాలి. లేకపోతే ఆ అంశమే ముఖ్యాంశమై, ప్లాన్ అంతా నాశనం అయిపోయే ప్రమాదం ఉంది.

ఈశ్వర్ ముందుగా ఆ పాతకాలం రికార్డుల పరిశీలన ఆరంభించాడు. అతని ప్రయత్నాలన్నీ చూసి ఉమ నవ్వేసేది.

"ఇవన్నీ ఎందుకొచ్చిన గొడవలు చెప్పండి" అంటూ మొదలుపెట్టేది. ఈశ్వర్‌కు ఆ ప్రశ్నను ఎలా అర్థరహితం చెయ్యాలో తెలుసు. "కొలంబస్ భార్య కూడా ఇలాగే అని ఉంటే మనకు అమెరికా గురించి తెలిసేదా? ఆర్మ్‌స్ట్రాంగ్ భార్య కూడా ఇలాగే అభ్యంతరాలు పెట్టి ఉంటే అతను చంద్రుని మీద అడుగు పెట్టేవాడా? ఇదీ అంతే! వీరపత్నిలాగ నన్ను తిలకందిద్దిపంపాల్సినదానివి. ఇలా భయపడితే ఎలా? నన్నూ నీరసపరిస్తే ఎలా?" అనేవాడు.

"ఏమోనండీ! నాకు ఇలాటి ఆశలు లేవు. వీరపత్నిగానో, వీరమాతగానో బతకాలనే కోరికాలేదు. ఏదో సామాన్య స్త్రీలాగా పదిమంది ఆడాళ్ళలాగా మొగుడు, పిల్లలతో సుఖంగా సంసారం

చేసుకొంటే చాలుసనిపిస్తుంది నాకు! కానీ మీరేమో..."

"పోన్లే, నాకోసం ఓపికపట్టు" అనే వాడు ఈశ్వర్. ఉమ 'ఊ'కొట్టేది.

"మీరు ఈ ప్రయత్నం మొదలు పెట్టిన రోజున ఆంధ్రుడుగా మీరు ఆరంభ శూరత్వంతో ఆగిపోతారనుకొనే దాన్ని. అందుకే అపుడు సరేనన్నాను. కానీ మీరు నెమ్మదిగా దీని అంతం చూసే లాగే ఉన్నారు. అందుకే నాకు భయం వేస్తోంది" అనేది ఉమ. ఈశ్వర్ నవ్వేవాడు.

"మగాడికి డబ్బు సంపాదించాలనే కోరిక పుట్టిందంటే ఇక భార్యాబిడ్డలు అన్నిటినీ వదిలేస్తాడని అంటారు. మీరు అలా అయిపోకండి. మీరు ఎక్కడవున్నా, ఏంచేస్తున్నా నా డెలివరీ సమయానికి మాత్రం నా పక్కనే ఉండాలి ... గుర్తు పెట్టుకోండి" అనేది ఉమ.

"ఈ కోరిక మన్నించాం" అనేవాడు ఈశ్వర్.

అన్నట్లుగానే ఉమ ప్రసవించే సమయానికి ఈశ్వర్ దగ్గరే ఉన్నాడు. అప్పటికే బాగా పరిచయం అయిపోయిన లక్ష్మీపతి, కల్యాణి కూడా వచ్చి వెళ్లారు. ఉమ ఆడపిల్లను కన్నది.

"లక్ష్మి పుట్టింది మీకు" అన్నాడు లక్ష్మీపతి నవ్వుతూ. "ఇది మీకు శుభ శకునం" అంది కల్యాణి.

ఈశ్వర్ పాపకు శ్రీదేవి అని పేరు పెట్టాడు.

ప్రతిరోజూ సాయంత్రం కూర్చుని తన పథకం ఎలా రూపురేఖలు దిద్దుకొంటుందీ బేరీజు వేసుకొనేవాడు ఈశ్వర్. నిన్నటికీ ఈరోజుకూ చెప్పుకోదగినంత అభివృద్ధి ఎప్పుడూ ఉండేది కాదు ... ఉండదు కూడానూ! అయినా అదో తృప్తి. లక్ష్య సాధనలో రవ్వంత కదిలినా గమ్యానికి ఆమాత్రం చేరువయినట్లే కదానన్న తృప్తి!

ఒకరోజు అలాగే ఈశ్వర్ ఏదో పని చేసుకొంటుంటే లక్ష్మీపతి వచ్చాడు. కులాసా కబుర్లు అయ్యాక అసలు విషయం బయటపెట్టాడు.

"చాలా రోజులనుంచీ అనుకొంటు న్నాను-మనం అనుకొన్న ఈ ప్రాజెక్టుకు ఎలాగైనా మనకు కొందరు సముద్ర గర్భంలో ఈతకొట్టగల డైవర్స్ కావాలి కదా! అందరిలోనూ ఒకడిగా నేనుంటే బాగుంటుందేమో అనుకొంటున్నా!" అన్నాడు లక్ష్మీపతి.

మొదట ఈశ్వర్ ఆశ్చర్యపోయాడు. ఆ తర్వాత అన్నాడు-"మీ ఇష్టం. కానీ అది అంత తేలిక కాదు. ఒకరోజులో వచ్చే విద్యాకాదు. ఎన్నో సంవత్సరాల శిక్షణ, అభ్యాసం ఉంటేగానీ సముద్రంలో డైవ్ చెయ్యలేరు"

"నిజమే! మన పథకం ఒక రూపు దిద్దుకొనేసరికి ఆలస్యం అవుతుందిగదా! ఆలోగా నేను నేర్చుకోలేకపోతానా? నేర్చుకోవాలన్న తపన ఉంది. కనుక సగం నేర్చుకొన్నట్లేనని నా నమ్మకం!" అన్నాడు లక్ష్మీపతి.

ఈశ్వర్ నవ్వేశాడు. "సగం నేర్చుకొన్నాగదానని సగంనుంచి మొదలు పెట్టకండి. అఆలనుంచి మొదలు పెట్టండి. మనదో కొలిక్కి వచ్చేసరికి మీరూ ఓ కొలిక్కి రానేవచ్చు" అన్నాడు.

"మీరు డైవింగ్ గురించి కేవలం థియరీయేగాక కొంచెం ప్రాక్టికల్స్ కూడా అలవాటు చేసుకోండి. కొంత అభ్యాసమూ, కొంత విజ్ఞానమూ అయితే మీకు

తేలికగా ఉంటుంది!" అన్నాడు ఈశ్వర్.

"ఒక్కటి చెప్పండి–మీకెలా వచ్చింది డైవింగ్ ?"

"నేర్చుకొంటేనే! మొదటి నుంచీ నాకు ఇదే ఆలోచన ఉండేది. ఇదేదో ఒక్కరోజు వచ్చిన ఆలోచన కాదు. ఎటొచ్చీ అమలులోకి తెచ్చింది మాత్రం ఈమధ్యలోనే! నేను మొదటినుంచి సముద్రంలో ఈత గొట్టడంతో బాటు డైవింగ్ కూడా నేర్చుకొంటూనే ఉండేవాడిని"

"కానీ....ఇదెవరు కనిపెట్టారోగానీ, నిజంగా గొప్ప పని చేశాడంటాను ఇది కనిపెట్టి! ఆ మహానుభావుడే ఇలాటిది ఉందని చెప్పకపోతే మనం ఆకాశంలోకి ఎగిరేవాళ్ళమేగానీ, మన కింద, మన పక్కనే ఉన్న జలాల్లో ఏం ఉందో పట్టించుకొనేవాళ్ళం కూడాకాదనుకొంటా" అన్నాడు లక్ష్మీపతి.

"మీరన్నది నిజమే! నీళ్ళపైన ఈదే దాన్ని స్విమ్మింగ్ అంటున్నాం కదా, నీటి లోపల ఈదటానికి 'సబ్ అక్వా స్విమ్మింగ్' అని పేరుంది. దీనికి ఆది పలికినవారు జాక్వెస్ కౌస్ కౌస్టో, ఎమిలీ గనాన్ అనేవాళ్ళు. 1943లో మొదటి సారి వాళ్ళే 'అక్వాలంగ్' అనే దాన్ని కనిపెట్టారు. అది లేకుంటే అసలు ఈ సబ్ అక్వాస్విమ్మింగనేదే ఉండేదికాదు!"

"అక్వాలంగ్ అంటే ?"

"నీటిలో ఉన్నపుడు మనకు ప్రాణ వాయువు సరఫరా ఉండదుగదా! ప్రాణ వాయువు లేకుంటే మనం అక్కడ బతకలేం. అందుకే అక్వాలంగ్ అనే ఈ సాధనాన్ని మనం పెట్టుకొంటే మనకు నీటి లోపల ఆక్సిజన్ సరఫరా అవుతుంటుంది. మనకుండే ఊపిరితిత్తులలాటిదే అనుకోండి ఇది కూడా" అన్నాడు ఈశ్వర్.

"కావల్సినవన్నీ కొంటాను. మీతో బాటుగానే నేనూ ఆ సముద్రపు లోతుల్లోకి దిగుతాను. ఆస్తులు దక్కకపోయినా అనుభవాలైనా మిగులుతాయి గదా!" అన్నాడు లక్ష్మీపతి.

"అదిమాత్రం నిజం" అన్నాడు ఈశ్వర్. "మీరు వీటికి కావల్సినవి కొనే రోజు చెప్పండి...నేనూ దగ్గరుండి అన్నీ కొనిపిస్తాను!"

"శుభస్య శీఘ్రం అన్నారు. మరింకా ఆలస్యందేనికి? వెళ్ళి కొందాం పదండి!" అన్నాడు లక్ష్మీపతి.

"శుభస్య శీఘ్రం అన్నారుకానీ దేనికీ తొందరపాటు తగదనీ అన్నారు. ముఖ్యంగా డైవింగ్ విషయంలో అసలు పనికిరాదు. ఈ రంగంలో నెమ్మదస్థులే గెలుస్తారు...అది గుర్తుంచుకోండి. డైవింగ్ నేర్చుకోవాలనే ఆసక్తి మీకుందిగనుక చెప్తున్నాను. నీళ్ళ లోపల ఈతగొట్టటానికి ప్రయత్నించేవాడు నీళ్ళపైన ఈత గొట్టగల మొనగాడై ఉండితీరాలి. క్రాల్, బ్రెస్ట్ స్ట్రోక్, బాక్ స్ట్రోక్ – ఇలాటివన్నీ మీకు తెలిసి ఉండాలి"

"ఆ...అవన్నీ తెలుసు–క్రాల్ అంటే మనం మామూలుగా ఈతకొట్టే పద్ధతి. ముందువైపునుంచి చేతులు వెనక్కు తెడ్డులాగా నీళ్ళల్లో ఆడించటం–అదీ ఒకదాని తర్వాత ఒకటిగా వెనక్కువెళ్ళిన చేతుల్ని గాలిలోంచి మళ్ళీ నీళ్ళల్లో వేసి ... అంతే కదా! ఇక బ్రెస్ట్‌స్ట్రోక్ అంటే నీటిమట్టానికి సమంగా గుండెలు, భుజాలు, శరీరం అంతే ఒకే లెవల్‌లో ఉంచటం, చేతుల్ని వెనక్కుకాక ముందుకు దూసుకువెళ్ళేలా




పెట్టటం..కాళ్ళను పైకెత్తి కిందకు తోస్తూ శరీరాన్ని ముందుకు నడిపించటం...అంతే గదా!''

"నిజమే. ఇక బాక్‌స్ట్రోక్ అంటే బ్రెస్ట్ స్ట్రోక్‌ను వెలకిలా ఉండి చెయ్యటం అనుకోండి! ఇదిగో ఇలాటివన్నీ మీకు క్షుణ్ణంగా వచ్చి ఉండాలి. ఈ పద్ధతుల్లో దేన్ని ఉపయోగించి అయినాసరే కనీసం తొమ్మిది నిమిషాల సమయంలో మూడొందల మీటర్లు మీరు ఈదగలగాలి. అంతకన్నా తక్కువ సమయంలో ఈదితే మరీ మంచిది!"

"ఈదగలిగానని అనుకోండి! అంటే నేను డైవింగ్‌కు వెళ్ళిపోవచ్చా?'' ఆసక్తితో అడిగాడు లక్ష్మీపతి.

"అబ్బే...అప్పుడే? దాటాల్సిన అడ్డుగోడలు ఇంకా ఎన్నో ఉన్నాయి. మూడొందల మీటర్లు ఇలా ఈదగలిగాక, ఇంకో వంద మీటర్లు మీరు పది పౌండ్ల బరువుతో కూడా ఈదగలిగితే అప్పుడు మీకు ఈతగాడినని చెప్పుకొనే వీలుంటుంది!''

"అంటే అంతవరకూ ఈత వచ్చినా కూడా రానట్టే లెక్కా?''

"అలా అన్నానా నేను? సముద్రంలో ఎక్కడో అగాథాల్లోకి దూకే ప్రయత్నంలో ఉన్నారు మీరు! గుర్తుంచుకోండి. అలాటిచోట మీకు తోడెవరూ ఉండరు. మీరెన్ని కేకలువేసినా, గోలచేసినా అది ఎవరికీ వినిపించదు. అలాటి ప్రదేశాల్లో మీ ఆత్మవిశ్వాసమే మిమ్మల్ని కాపాడాలి. మీకదే రక్షాకవచం! ఆ ఆత్మవిశ్వాసం మీకెలా వస్తుంది చెప్పండి-ఎలాంటి నీటిలోనైనా ఎలాగైనా ఈదగలనన్న నమ్మకం మీకు ప్రాథమికంగా ఉండాలి! ఇప్పుడు నేను చెప్తున్నదంతా ప్రాథమికమైన పరీక్ష అనుకోండి. సరే అనుకొంటున్నారా?'' అనడిగాడు ఈశ్వర్.

లక్ష్మీపతి ఒకసారి కళ్ళు మూసుకున్నాడు. అతనికి అప్పుడే అగాథాల లోపలికి వెళ్ళిపోతున్న అనుభూతి కలుగుతోంది. అక్కడ తనొక్కడే పూర్తిగా ఏకాకిగా ఉంటున్నాడు. కూడా కొన్ని వందల రకాల జలచరాలు. వాటితోబాటు తనూ మరోరకమైన 'జలచరం' ఆలోచించగల జలచరం! అంతే, అక్కడ ఇంకెవ్వరూ లేరు. అక్కడి జయాపజయాలన్నీ పూర్తిగా తన సొంతం.

"అనుకొన్నా...చెప్పండి!'' లక్ష్మీపతి ఆ ధ్యానముద్రలో అలాగే ఉండిపోతున్నట్టుగా కళ్ళుమూసుకొంటూ.

"అది మొదటి పరీక్ష. ఆ తర్వాత ఇంకో పరీక్ష...అసలు శరీరంలో ఏ అంగమూ కదల్చకుండా నీళ్ళమీద తేలగలగటం కూడా వచ్చివుండాలి. ఇక చివరి పరీక్ష-చేతుల్ని నీళ్ళకన్నా పైనపెట్టి తల కూడా మునగకుండా ఈతగొట్టడం! ఇది చాలా తేలిక అనుకుంటారు అందరూ. కానీ ఇదే చాలా కష్టం.చేతుల్ని పైనపెట్టి,వాటిని కదులుస్తూ ఈతగొట్టేటపుడు ఖచ్చితంగా తలను కిందకు వంచేస్తారు. అలా జరగకుండా ఉండాలంటే పాదాల్ని, కాళ్ళను అతివేగంగా కదల్చగల నేర్పు వచ్చి ఉండాలి. ఈ పద్ధతిలో కనీసం నిమిషం పాటయినా ఈతగొట్టడం కూడా వచ్చి ఉండాలి. ఇవన్నీ వస్తే...''

"పరీక్షలన్నీ పాసయినట్లు లెక్కన్న మాట!'' అన్నాడు లక్ష్మీపతి.

"కాదు...కాదు ఇవన్నీ వస్తే ఫైనల్ పరీక్ష రాసే అర్హతవచ్చినట్లు! ఫైనల్ పరీక్ష ఏమిటంటే-నీళ్ళ అడుగున అయిదారు పౌండ్ల బరువుండే వస్తువును పడేసి

దాన్ని ఏ ఇబ్బందీ పడకుండా పైకి తీసుకురాగలగటం! అందులోనూ పాస యితే అక్వాలంగ్ ట్రైనింగుకువెళ్ళచ్చు!''

''అమ్మ బాబోయ్! ఇన్ని పరీక్షలు, ఇన్ని గొడవలూ ఉన్నాయన్నమాట!'' అన్నాడు లక్ష్మీపతి.

''నిజమే....ఇది చాలా శ్రమతో, ఓర్పుతో కూడిన విద్యాభ్యాసం. మిగతా వాటిలాకాదు. మిగిలిన విద్యల్లో ఏది నేర్చుకొన్నా దాన్ని ప్రాక్టీస్ లో పెట్టేటపుడు ఒకటి రెండుసార్లు విఫలమయినా ప్రమాదంలేదు. ఆ తప్పుల్ని సరిదిద్దుకొనే అవకాశం ఉంది. కానీ ఈ విద్యలో అది లేదు. ఒకే ఒక్క తప్పు ప్రాణాంతకం అయిపోతుంది. అచ్చం ఇలాటి ప్రమాదం ఉన్న విద్యే మరొకటి ఉంది. అది పర్వతారోహణం'' అన్నాడు ఈశ్వర్.

లక్ష్మీపతికి అది నిజమేననిపించింది. ఎన్నోసార్లు వార్తాపత్రికల్లో చదివాడు తను. మంచుకొండలమధ్య మరణం అనో, కొండచరియ కూలి చనిపోయారనో! అదేదీ కాకుంటే మంచు తుఫానుకు, హిమపాతానికి ఇందరు బలి అనో–ఇలాటి వార్తలు. శీర్షికల్లో తేడాలు ఉండొచ్చుకానీ వార్తల సారాంశం మాత్రం ఒకటే! పర్వతారోహకులకూ ఎన్నో అంశాల్లో శిక్షణ ఇస్తారు. అయినా కొందరు చనిపోతున్నారంటే కారణం...? ఈశ్వర్ చెప్తున్నట్లుగా అక్కడ ఎవరికి వారే సాయం. ఇంకోరు ఎవ్వరూ ఆ లోతుల్లో, ఆ ఎత్తుల్లో చేయూతనిచ్చేందుకు ఉండరు.

''ఇదంతా మీకెందుకు చెప్తున్నానంటే–మీరు ఏమీ అనుకోకండి - ఈ డైవింగ్, ఈ సాల్వేజింగ్ ఇవన్నీ మాకే వదిలెయ్యండి!'' అన్నాడు ఈశ్వర్.

''మీరింత చెప్పాక, నాలో ఇంకా పట్టుదల పెరిగింది, తప్పకుండా ఈ ప్రయత్నం ఏదో నేనే చెయ్యాలని!'' అన్నాడు లక్ష్మీపతి.

''సర్లెండి. మీ ప్రయత్నంలోంచి మిమ్మల్ని ఎలా వెనక్కి పంపించాలో నాకు తెలుసు. ఒకమాట మీ చెల్లెలు కల్యాణికి చెప్తే చాలు...మీరే వెనకడుగు వేస్తారు!'' అన్నాడు ఈశ్వర్ నవ్వుతూ.

''మీకొక రహస్యం చెప్తున్నా–అసలు నేను డైవింగ్ నేర్చుకోవాలనీ, ఆ అగాథాల్లో మీకు పక్కన ఉండాలనీ చెప్పి, నాలో ఈ ఆలోచన ప్రవేశపెట్టింది మా కల్యాణే!!'' అన్నాడు లక్ష్మీపతి.

ఉలికిపడ్డాడు ఈశ్వర్.

ఉమ, కల్యాణి ఇద్దరూ ఆడాళ్ళే. కానీ ఎంత వ్యత్యాసం! ఎందుకొచ్చిన బెడద అంటూ వెనక్కితీయించే ఉమ! ముందుకు నడవమని పోరుపెట్టే కల్యాణి!!

కల్యాణి పద్ధతి చూస్తోంటే ఆ అమ్మాయి ఇప్పటి స్త్రీలకు ప్రతినిధిగా కనపడటం లేదు. సాహసం ఊపిరిగా, డబ్బును తృణప్రాయంగా పరిగణించగల ముందుతరం యువతులకు ఇప్పటి ప్రతినిధిగా ఉంది!



## 7

లక్ష్మీపతి మద్దతు లభించటంతో ఈశ్వర్ ఆ తర్వాత తన కార్యక్రమాలన్నీ





చక్కగా ఒక ప్రణాళిక ప్రకారం చేసు కొంటూ వచ్చాడు. కోస్టుగార్డ్స్ వింగ్‌నుంచి అనుమతి పొందాడు. ఆర్కియాలజీ డిపార్ట్‌మెంట్‌నుంచి పర్మిషన్ సంపాదించు కొన్నాడు. మెటీరియాలజీ డిపార్ట్ మెంటునుంచి మద్దతు పొందాడు.

వరసగా వారం రోజులపాటు స్థానిక దినపత్రికలో ప్రకటనలు ఇస్తూవచ్చాడు, అనుభవం ఉన్న డైవర్స్ కావాలంటూ. ఒకట్రెండు పత్రికలవాళ్లు ఆ ప్రకటనలు చూసి వచ్చి ఇంటర్వ్యూలు కూడా తీసు కొన్నారు. అవి ప్రచురణ కాగానే ఎంతో ప్రచారం కూడా లభించింది ఈశ్వర్‌కు.

'ఇది మనదేశ చరిత్రలోనే అపూర్వం!' అన్నారు కొందరు.

'మన యువకుల ధైర్య సాహసాలకు ఇది మచ్చు తునక!' అన్నారు ఇంకొం దరు. 'అయితే ఇంత డబ్బు ఖర్చు పెట్టటం ఎంతవరకు సరైన పని?' అని ఇంకొందరు ప్రశ్నలు విసురుతూ, సందే హాలు బయటపెట్టారు.

ఈశ్వర్ ఇవేవీ పట్టించుకోలేదు. రేపు వీళ్ళే తన విజయానికైనా అపజయాని కైనా 'ఆ' అనేస్తారు. విజయం సాధిస్తే పూలమాలలతో సత్కార సన్మానాలు చేసేందుకు సిద్ధపడే ఈ జనమే అపజయం కలిగితే, ఆ దెబ్బకు తోడు మరిన్ని రాళ్లు విసురుతారు! 'నీకెందుకు ఈ పిచ్చిపని?' అంటారు 'సముద్రంలో మునిగిన నౌకల్ని పైకి తీయటం అంటే ఇసకలో గవ్వలు, శంఖాలు ఏరు కోవటం అనుకొన్నాడు కాబోలు' అని ఈసడిస్తారు.

కానీ ఇలాటి తిరస్కారాలన్నీ తను సాధించే విజయం ఒక్కదాని ముందు తల వంచేస్తాయి. కేవలం ఒకేసారి గెలుప గలిగితే, అంతక్రితం ఎన్ని తప్పులు చేసినా అవన్నీ కొట్టుకుపోతాయనేది సత్యమే! ఆ విజయంకోసమే ఇప్పటి తన ప్రయత్నాలు అనుకొనేవాడు ఈశ్వర్.

అవకాశం దొరికినపుడల్లా ఉమ మాత్రం ఈశ్వర్‌ను నిరుత్సాహపరిచేది- "ఏమిటో, నాకు భయంగా ఉంది" అనేది.

"అందరిలాగా మీరూ సామాన్యులే అయివుంటే ఎంతబాగుండేది!" అనేది.

"భర్తకు పేరురావాలనే ఉంటుందికానీ ఆ కీర్తి సంపాదించటానికి ఒక్కోసారి ప్రాణాల్ని పెట్టుబడిగా పెడతానంటే మాత్రం ఏ భార్యా ఒప్పుకోదు" అంటూ సన్నాయినొక్కులు నొక్కేది.

ఈశ్వర్ నవ్వేసేవాడు-"ఇప్పుడు కాదు ఉమా! రేపు ఈ కార్యక్రమం పూర్తయి, నేను విజయం సాధిస్తేచాలు... అందరికన్నా గర్వపడేదానివి నువ్వేఅవు తావు!" అనేవాడు.

ఉమఒప్పుకునేదికాదు."మీకుతెలీదండీ. మీరు తెచ్చే కోట్లాదిఆస్తికన్నా నాకు మీరు ముఖ్యం! అయినా ఒకటిచెప్పండి-సముద్రం అంటే అంత విశాలంగా అంత లోతుగా ఉంటుందిగదా. దాంట్లో ఎక్కడని వెతుకు తారు? ఏ చోట అని వెతుకుతారు??"

"అలా అడిగితే జవాబు చెప్పగలం గానీ, 'వద్దులెండి మీరేం వెతుకుతారు?' అంటే ఎవరైనా ఏం చెప్పగలరు? సాధార ణంగా సముద్రతీరానికి కొన్ని మైళ్ల దూరంవరకే ఈ శిథిలాలు ఉంటాయి. ముఖ్యంగా సముద్రంలోతు 200 అడు గులవరకు ఉండేంతవరకే ఇలా మునిగి పోయిన నౌకలు, నగరాలూ ఉంటాయి!"

ఉమ ఉలిక్కిపడింది-"నగరాలా?"

"అవును...నగరాలే! ఏం.ఆశ్చర్యంగా ఉందా? సముద్రంలో తుఫానులు వస్తాయి




గదా, అలాగే ఉప్పెనలూ వస్తాయి. అలా ఉప్పెనవచ్చినపుడు సముద్రంలోనిఅలలు ఎంతో ఎత్తుకు లేచి తీరంలో ఉండే నగరాల్ని ముంచేస్తాయి. ఇదిచాలా సాధారణమైన విషయం"

"మనకు హిస్టరీ, సివిక్స్ అని చెప్తారు గానీ ఇలాటివేవీ చెప్పరేమండీ మన కాలేజీలో..!" అనడిగింది ఉమ.

"సర్లే, మనదేశంలోఅయితే బతికున్న నగరాలగురించే ఎవరూ పట్టించుకోరు. ఇలా జలసమాధి అయినవాటి గురించి ఇంకెవరు పట్టించుకొంటారు చెప్పు!"

"పోనీ, మీరు చెప్పండిఏవైనా ఓ రెండు నగరాలు, అవెలా మునిగిపోయాయో.." ఆసక్తితో అడిగింది ఉమ.

"ఇప్పుడు ఇటలీలో వెనిస్‌నగరం ఉందా? ఒకప్పుడు అదే ఓ పెద్ద సామ్రాజ్యానికి రాజధానిగా ఉండేది. దానికన్నా ముందు హెరాక్లియా, మలామొకో అనే పేర్లతో ఇంకో రెండు నగరాలు ఉండేవి. ఆ నగరాలు ఏమైపోయయో ఆచూకీ తెలీక ఎనిమిదివందల సంవత్సరాలైంది. ఈమధ్యనే హెరాక్లియా నగరం ఒకప్పుడు వెనిస్‌కు కిందనే ఉండేదని కనుగొన్నారు. మలామొకో కూడా అంతే! అక్కడే ఎక్కడో ఉండివుంటుంది. నీకు ఇంకో నగరంగురించి చెప్పనా...అది సముద్రంలోంచే పుట్టింది. సముద్రంలోనే కలిసి పోయింది!"

"తమాషాగాఉందే! 'కడలిలో పుట్టావు, కడలిలో కలిసావు' అంటూ మనకోపాట కూడా ఉంది...అది ఇదేనేమో!"

"అది ఇదికాదులే కానీ విను చెప్పేది! రావెన్సర్‌ఆడ్ అని ఈ నగరం పేరు. అది నార్త్ సీలో కలిసే హంబర్ నది ముఖద్వారాన ఉండేది. ఇప్పటికో ఏడవందల ఏళ్ళక్రితం నెమ్మదిగా ఆ ముఖద్వారాన చిన్న ద్వీపం ఏర్పడింది. అది క్రమంగా పెద్దదయి ఆఖరికి పెద్ద నగరమే అయింది. నగరం పెరగటంతో వ్యాపారమూ పెరిగింది.ఆఖరికి ఆ నగరానికి పార్లమెంట్‌లో సీటుకూడా వచ్చింది. అయితే ఆ నగరం ఎలా ఏర్పడిందో, అలాగే క్రమంగా సముద్రం కోతకు గురయి నీళ్ళల్లో కలిసిపోయింది. పధ్నాలుగో శతాబ్దం ఆఖరునాటికి ఆ నగరం ఆనవాలుకూడా లేకపోయింది!"

ఉమ నోరుతెరుచుకొని అలానేవింటూ ఉండిపోయింది.

"రావెన్సర్‌ఆడ్ మునిగిపోవటానికి అంతకాలం పట్టిందిగానీ జమైకాలో పోర్ట్ రాయల్ అని ఓ నగరం ఉండేది. 1692 జూన్ నెల ఆరో తేదీ మధ్యాహ్నం పదకొండుగంటలకు జనాలతో నిండిన ఆ నగరం పన్నెండయ్యేసరికి సగానికిపైగా సముద్రంలో కలిసిపోయింది. దానికి కారణం ఒకే ఒక్క భూకంపం...అంతే!"

"అయితే ఇపుడుమీరు వెతకబోయేది కూడా అలాగే ఏదైనా ప్రమాదానికే గురయి ఉంటుందా?"

ఈశ్వర్ నవ్వాడు "చూశావా! మీరు వెతకబోయేది అంటున్నావు. అంటే,నేను వెతకటం నీకిష్టమేనన్నమాట! అయినా ఒకటి చెప్తా ఉమా...ఇందులో ప్రమాదం ఏమీలేదు. మనం ఇపుడు భూమిమీద నిలబడ్డాంగదా! ఎదురుగా ఓకొండఉందనుకో. పోనీ, నీ తిరుపతి కొండే అనుకో! ఎక్కి వెడుతున్నామాలేదా? ఇదీ అంతే!"

"బాగుందండీ మీరు చెప్పేది. ఆ ఏడుకొండలకూ దీనికీ పోలిక ఏమిటి? అవి ఎక్కితే పుణ్యం పురుషార్థంకూడా!"

"పురుషార్థంకాదు...కేవలం పుణ్యమే!

కాని ఇదిగో ఇలా సముద్రాల్లోకి తొంగి చూస్తే పురుషార్థంకూడా ఉంటుంది. మగాడినని రుజువు చేసుకోవడానికి అంతే!"

"అయినాసరే...మీరా నీళ్ళల్లోకి వెళ్ళటం నాకిష్టం లేదు! మీకు అక్కడ ఏమైనా అయితే...అమ్మో!"

"ఏమీకాదు. కొండ ఎక్కామనుకో, ఏమవుతుంది? ఏమీ కావటం లేదుగదా. ఇదీ అంతే! ఎటొచ్చీ ఇవి నీళ్ళు కాబట్టి, జాగ్రత్త కోసం కొన్ని ఎక్విప్‌మెంట్స్ తీసుకెడతాం"

"అయినా మీకీ ప్రయోగాలు వద్దండీ.. మీరు ఎప్పటికీ నాముందు, నా పాప ముందు ఉంటే అదే చాలు నాకు" అనేది ఉమ.

ఎప్పటికప్పుడు అలా అంటున్నా వెళ్ళేరోజుకి ఉమ మనసు దృఢ పర్చుకొంటుందనే నమ్మకం ఈశ్వర్‌లో ఉండేది. ఇవన్నీ తాత్కాలికమైన సందేహాలు,భయాలు! అంతేకానీ వీటివల్ల వచ్చే నష్టం లేదు. ఆఖరి క్షణాలలో ఇవన్నీ మటుమాయం అయి అనుకోని ధైర్యం వచ్చేస్తుంది. అదే తన నమ్మకం!

అలా అనుకొన్నాడేగానీ ఈశ్వర్ అంచనాలన్నీ తప్పే అయ్యాయి ఆఖరికి.

పేపర్లో వేసిన ప్రకటనల ఫలితంగా కొందరు వచ్చారుగానీ ఎవరికీ డైవింగ్ అంటే ఏమిటో సరిగ్గాతెలీనుకూడాతెలీదు.

ఒకరిద్దరియితే వచ్చి 'మాకొచ్చండీ... బాగా చేయగలం" అంటే, ఈశ్వర్‌కు చెప్పలేనంత సంతోషం కలిగింది. "చెప్పండి...ఎలాగో?" అనడిగితే, వాళ్ళు రంగుల అద్దకాల గురించి చెప్పటం మొదలెట్టారు.



"ఇదేమిటి...ఇది చెప్తున్నారు?" అనడిగితే "అవునండీ...డైయింగ్ అంటే అద్దకమేగదా" అని జవాబిచ్చారు. ఈశ్వర్‌కు పొట్ట చెక్కలయేలా నవ్వొచ్చింది. అచ్చు తప్పుల మహత్యం అన్న మాట ఇది.డైవింగ్ బదులు డైయింగ్ పడిందన్నమాట! పడిందో లేకపోతే వీళ్ళే ఆ పేపర్లో సరిగ్గానే పడ్డా తప్పుగా చదువుకొన్నారో!!

ఏదైతేనేం కానీ తనకు సరైన అర్హత లున్న వ్యక్తి లభించటం కష్టమే కావచ్చు అనుకొన్నాడు. అలా అనుకొన్న రోజునే ఒకతను వచ్చాడు. వయసు నలభై-నలభై అయిదేళ్లు ఉండొచ్చు. తిన్నగా ఇంటికి వచ్చి తనకు ఉద్యోగంకావాలని అడిగాడు.

"నాకు కావాల్సింది..."

ఈశ్వర్ మాటల్ని కట్ చేస్తూ అన్నాడతను-"నాకు తెలుసు. మీరు చెప్పనక్కర్లేదు....పేపర్లో వేశారుగదా డ్రయివరు కావాలని!"

"అహ...డ్రైవరు కాదండీ"

"అవున్లెండి....ఏ బండో చెబితే..."

"అది కాదండీ బాబూ...నాకు కావాల్సింది"

"జీతం ఎంత కావాలో అడిగితే దాన్ని బట్టి నిర్ణయిస్తానంటారు...అంతేగదా"

"కాదు కాదు కాదు... ఒక్క క్షణం నా మాట వినండి. నాకు డ్రైవర్స్ అక్కర్లేదు. నాక్కావాల్సింది డైవర్స్"

క్షణం ఆ వ్యక్తి ఉలిక్కిపడి అడిగాడు-"డైవర్స్? ఎందుకూ? మీకూ, మీ ఆవిడకూ ఏవైనా మనస్పర్థలు వచ్చాయా? అంత మాత్రాన..."

"కాదండీ! నేను..."

"సరే...నాకు తెలిసిపోయింది. మీరు చెప్పనక్కర్లేదు. ఏదో పొరపాటు చేసి ఉంటుంది అమ్మాయి. అంత మాత్రానికి

ఇలా డైవర్స్ వరకూ వెళ్ళిపోతే ఎలాగండీ?"

ఈశ్వర్‌కు తలనొప్పి వచ్చింది. విసుగ్గా అన్నాడు–"మీ ధోరణి మీదే కానీ ఒక్కమాటా వినిపించుకోరేం. నాకు కావాల్సింది డ్రైవర్‌లూకాదు, విశాకులూ కాదు. గుర్తుంచుకోండి...డైవర్స్ అని నీళ్ళల్లో ఈదగలిగేవాళ్లు"

"అమ్మయ్య ... అంతేగదా, ఇంకా ఏదో అనుకొన్నాను. సరే...ఇక నాకు తెలుసు మీరేమీ చెప్పకండి" అన్నాడు ఆవ్యక్తి మళ్ళీ.

"తెలుసునన్నారుగదా ... ఇక వెళ్ళండి" అన్నాడు ఈశ్వర్ ఆఖరికి ఒళ్లు మండిపోయి.

ఆ వ్యక్తి మొత్తానికి వదిలాడు.

ఈశ్వర్‌కు మనసులో సందేహాలు బయలుదేరాయి. అసలు సరైన డైవర్స్ తనకు దొరుకుతారా, దొరకరా అని. కనీసం ముగ్గురుండాలి. ఇద్దరు డైవింగ్ చేస్తూంటే ఒకడు కేర్ టేకర్‌గా! ఇది ముఖ్యంగా తీరానికి సమీప ప్రాంతంలో మరీ అంత ఎక్కువ లోతుకాని ప్రదేశాలలో అయితే తప్పనిసరి! ఆ మాటే అన్నాడు ఈశ్వర్ గంగులుతో.

గంగులు నవ్వాడు. "ఒళ్ళో బిడ్డని పెట్టుకుని ఊరంతా వెతికినట్లుంది మీ వ్యవహారం" అన్నాడు.

"అంటే...?"

"నరసప్ప తెలుసుగదా మీకు? ఈ ప్రాంతంలో వాడిని మించిన గజఈతగాడే లేడు! ఎన్నొందల అడుగుల లోతుకైనా పోగలడు" అన్నాడు గంగులు.

క్షణం ఆలోచించాడు ఈశ్వర్. ఇలాటి ఎమెచ్యూర్‌తో పెట్టుకోవటం మంచిది అవునా కాదా అని ఆలోచించాడు. కానీ తప్పనిసరి అవుతున్నపుడు ఎవరి మీదో ఒకరిమీద ఆధారపడేలేరాలి. రవ్వంత శిక్షణఇస్తే సరిపోతుంది. సేవీ వాళ్ళను అడగొచ్చుకానీ అది మరీ తలకు మించిన వ్యవహారం. పైగా తన ప్రయత్నం ఎంత జయప్రదం కానుందో ఎవరికీ తెలీదు.

"ఒక్కసారి పిలిపించు...చూద్దాం" అన్నాడు ఈశ్వర్.

మర్నాడే నరసప్పను గంగులు తీసుకొచ్చాడు.

చూడగానే నరసప్పకు బాగానే ఈత వచ్చినట్లుగా అనిపించింది ఈశ్వర్‌కు. కానీ ఈత వేరు, డైవింగ్ వేరు. ఆ సంగతి తనకు తెలుసుగానీ అతనికి తెలియజెప్పటం నచ్చజెప్పటం కష్టం. అయినా డైవింగ్‌కు ఈత రావటం ప్రాథమికం కాబట్టి, అందులో నరసప్పకు మంచి ప్రావీణ్యమే ఉందంటున్నాడుగాబట్టి ట్రైచేసి చూడచ్చు అనుకొన్నాడు ఈశ్వర్.



## 8

రోజూ రాత్రి అయేసరికి ఈశ్వర్ తన పనిని ఒకసారి సింహావలోకనం చేసుకోవటం అలవాటుచేసుకున్నాడు. ఆరోజు వరకు తను సాధించినది, ఏం సాధించాల్సి ఉంది, ఏ పద్ధతి ప్రకారం నడుచుకొంటే అది సాధించగలడు–అన్నీ ఆలోచిస్తూ ఉండేవాడు. పెద్దిరాజు పడప

ఎక్కడ మునిగిందో మాత్రం తెలీటం లేదు. ఈ చివరనుంచి ఆ చివరవరకూ అన్వేషించటమనేది సముద్రంలో జరగని పని గాబట్టి కొన్ని ముఖ్య ప్రదేశాలను మాత్రం ఎంపిక చేసుకోవాలనుకున్నాడు. తుఫానులు చెలరేగితే వాటికి తట్టుకో లేక నాశనం అయిపోయే పడవలు కొన్ని అయితే, మార్గమధ్యంలో సముద్రంలో దాగిన ఏ కొండకో గుద్దుకొని దెబ్బతినేసి లోపలికి పడిపోయినవి ఇంకొన్ని అవు తాయి. లేకుంటే అసలు పడవ నిర్మా ణంలో తప్పులుండి, చిల్లులు ఏర్పడి ఆ చిల్లులలోంచి నీరు లోపలికిపోయి కూరుకు పోయినవి ఇంకొన్ని....ఇలా పడవలు



మునిగిపోవటానికి అనేక కారణాలు. ఈ కారణాలన్నిటిలోనూ ఏ కొండకో గుద్దు కొనో, లేకుంటే ఏ చిల్లులవల్లో పెద్దిరాజు పడవ మునిగిపోయి ఉంటుందని నిర్ణ యించుకున్నాడు ఈశ్వర్.

పడవకోసం నీటిలోకి దిగిన తర్వాత చెయ్యగలిగేది, తీసుకోగలిగే జాగ్రత్త అంటూ ఏమీ ఉండదుగాబట్టి ఎప్పటి కప్పుడు రోజూ తనకు కావల్సిన వస్తు వులు, ఇతర సరంజామాల పట్టికలు సిద్ధం చేసుకొనేవాడు. ఒక్కసారి రాసి మళ్ళీ దాన్ని సరిచూసుకుని మళ్ళీ మళ్ళీ ఆ పట్టికనే చెక్ చేసుకోవడం ఈశ్వర్‌కు అలవాటయిపోయింది.

అతను రాసుకొనే పట్టికల్నీ, వివరాల్నీ చదివి ఉమ ఆశ్చర్యపోయేది.

"ఇన్ని వస్తువులా? ఇన్ని తీసుకెడితే

మునిగిపోరూ ఆ బరువుకే?'' అని అడిగేది.

ఈశ్వర్‌కు నవ్వొచ్చేది–ఆ ప్రశ్నలు వేసే పద్ధతికి. కానీ ప్రశ్నించటం అనే దాన్ని 'ముందుకు వెళ్తాం' అనే సూచనకు ముందు మాటగా చెప్పుకోవాలనిపిస్తుంది గనుక ఈశ్వర్ ఓపికగా జవాబు ఇచ్చే వాడు.

"సముద్రంలోకి..సముద్రం ఎందుకు, ఓ బిందెలోనో, ఓ పెద్ద టబ్‌లోనో నువ్వో సూది వేశావనుకో...అది మునిగి పోతుంది...అవునా!అదే ఏపడవనో వేస్తే మునగదు ఎందుకని? ఎందుకంటే ప్రతి దానివెనకా సైన్స్ ఉన్నట్లే దీని వెనకా ఉంది''

''దేని వెనక? పడవ మునిగిపోకుండా పట్టుకోవటానికా?'' అసడిగి పకపకా నవ్వేది ఉమ.

''పడవ పట్టుకోవటానికి కాదు, పడవ ఎందుకు మునగదో చెప్పటానికి... ఆర్కిమెడిస్ అని...''

"అబ్బో...అది నాకు బాగా తెలుసు. నీళ్ళ తొట్లోంచి నగ్నంగా పరిగెడుతూ వచ్చాడనిగదా! ప్రపంచంలో ఫస్ట్ స్ట్రీకింగ్ చేసింది అతనే అనుకొనేవాళ్ళం మేం!'' అనేది ఉమ.

ఈశ్వర్ కూడా నవ్వేవాడు.

అతను రాసుకొనే పట్టికల్ని పరిశీలిస్తూ ఒక్కో వస్తువూ ఎందుకని అడిగేది. ఈశ్వర్ ఒక్కొటి వివరించి చెప్తోంటే ఆశ్చర్యంగా వింటూ ఉండిపోయేది.

''ఇవన్నీసరే.మీకిన్నితెలుసు...ఒప్పు కుంటాను. కానీ నాకు మాత్రం ఎందుకో భయంగానే ఉంటుంది!" అనేది అన్నీ విని ఆఖరుకు ఉమ.

"డైవింగ్ అనేది కొత్త విద్యేంకాదు! ఎన్నో ఏళ్లబట్టి స్థిరపడ్డ విద్య,ఇది! నీళ్ళ అడుగున ఏం ఉన్నాయో తెలుసుకో వాలన్న కోరిక, నీళ్లపై ఈదటం వచ్చిన రోజునుంచీ మనిషికి ఉంటూనే ఉంది. అయితే1825లో మొదటిసారిగా డైవింగ్ యాపరేటిటస్‌ను డబ్ల్యు. హెచ్. జేమ్స్ అనే ఆయన తయారుచేశాడు. అప్పటి నుంచీ ఇక మనుషులకు లోతుల్లోకి వెళ్లటం అతి తేలికపని అయిపోయింది!" అని గత చరిత్ర చెప్పేవాడు ఈశ్వర్.

"అసలు నాకొకటి అర్థం కాదండీ... అంతరిక్షంలోకి మనిషి వెళ్ళేందుకు ప్రయత్నిస్తున్నాడంటే అర్థం చేసుకో వచ్చుగానీ, ఈ నీళ్లల్లో ఏమిటండీ..వెళ్లి ఉండగలమా ఏం? ఎందుకొచ్చిన సంత ఇది – మీలాటివాళ్లకు హాబీగా, నాలాటి వాళ్లకు ప్రాణ సంకటంగా ఉండేందుకు తప్ప!!" అంటూ విసుక్కునేది ఉమ.

"నువ్వు కొన్ని శతాబ్దాలు ముందు పుట్టేశావ్ ఉమా! అదే ఇంకొన్ని శతాబ్దాల తర్వాత గనుక నువ్వు పుట్టి ఉంటే నీకు'అక్వానాట్స్' ఇప్పటి 'ఏస్ట్రోనాట్స్' లాగే అక్వానాట్స్ కూడా పరిచయం అయి ఉండేవారు"

"అక్వానాట్స్ ఎవరు?"

"జలచరులు అందామా వాళ్లను! ఇప్పుడు ఆకాశంలోకి వెళ్ళొస్తున్న అంతరిక్ష యాత్రికుల్లాటి వారన్నమాట... అది వదిలెయ్. ఒకాయన అయితే ఏకంగా జలాల్లోనే నివసించగల ప్రత్యేక తరహా మనుషులు కూడా వృద్ధివించి పెరుగుతారని జోస్యం కూడా చెప్పాడు. ఆ మనుషులకు ఆయన 'హోమో అక్వాటికస్' అని సైంటిఫిక్ పద్ధతిలో ఓ పేరు కూడా పెట్టాడు"

"మీరు చెప్పేది బాగుంది గానీ





అవన్నీ కేవలం ఊహలు.ఎలాటి వార్తయినా పేపర్లో చదువుకోవటానికి బాగుంటుందే గానీ,మన ఇంట్లోవాళ్లు అలాటి పనులుచేస్తా మంటే మాత్రం గుండెలు బేజారెత్తి పోతాయ్!" అనేది ఉమ.

"నాకు మాత్రం ఏమీ ఇబ్బందిలేదు. చచ్చిపోయినా ఫర్వాలేదు గానీ ఒక్క సాహస కార్యంచేయాలనే తపన ఉంది నాకు!"

"ఏంటండీ..అలాటి మాటలు అంటారు! పైన తథాస్తు దేవతలని ఉంటారట వాళ్లు మనం అన్న ప్రతిదానికీ తథాస్తు అంటారట"

"అన్నిటికీ అంటారు గదా ... అయితే ఫర్వాలేదు! పెద్దిరాజు పడపను పైకి తేగలను అనే ఒక్కమాటకు వాళ్లు తథాస్తు అంటేచాలు! మిగిలిన మాటలు నేననేటపుడు వాళ్లు శుభ్రంగా నిద్ర పోయినా నాకభ్యంతరం లేదు"

"బాగుంది మీ చదువు! దేవతలు అనిమిషలు గదా, వాళ్లకు రెప్పపాటు అనేదే ఉండదట! అలాటి వాళ్లకు నిద్రేమిటి...నాన్సెన్స్!" అనేది ఉమ.

ఓరోజు ఇలాటి వాదనలో ఉన్నపుడే దబ్బున శబ్దం అయింది. ఇద్దరూ ఉలికి పడ్డారు. క్షణం తర్వాత ఉమ పరిగెట్టింది బెడ్‌రూంలోకి. అప్పటికే గుక్కపెట్టిన ఏడుపు ఆరంభమైపోయింది.

"ఏమిటీ...రాణి పడిపోయిందా?" అనడిగాడు ఈశ్వర్.

అవునంది ఉమ.వీళ్లు ఇద్దరూ మాటల్లో ఉండగానే రాణి,పక్కమీంచి దొర్లి కిందకు పడిపోయింది.

"పిల్లలన్నాక కొంచెం జాగ్రత్త తీసుకో వాలి. పూర్తిగా వదిలేస్తే ఇదిగో...ఇలా అవుతుంది!" అన్నాడు విసుగ్గా ఈశ్వర్.

"జాగ్రత్త అనేది పిల్లలకే కాదు. పెద్దలకూ ఉండాలి! మీకుందా? ఎన్నాళ్ళ నుంచీ పోరుతున్నా-ఇలాటి సాహసాలు వద్దండీ అంటూ. మిమ్మల్ని చక్కదిద్దుకో వాలని చూస్తోంటే పిల్ల పడిపోయింది. దానికి గొడవ చేస్తారేమిటి?"

"గొడవకాకపోతే-చంటిపిల్లను పట్టు కోవటం రాదుగానీ, పెద్ద నాపు చెప్పొచ్చావ్!"

"చంటిపిల్ల అంటున్నారు గదా..దాన్ని పట్టుకోవచ్చు. అదిచేత కాకపోతే ఒకటికి రెండుసార్లు పడితే దానికే బుద్ధొస్తుంది. కానీ మీ మాటేమిటి? ఒక్కసారి... ఒక్కసారి ఆ నీళ్లల్లో గనుక మునిగి పోయారంటే-ఇంకేముందీ...ఇంక నాకు మిగిలేదేముందీ...!"

"నేను మునగను. ముందే చెప్తున్నా- మునిగినా కూడా కొంపేమీ మునిగిపోదు" అన్నాడు ఈశ్వర్ చికాకుగా.

"ఆ మాట పెళ్ళి కాకుండా ఉన్నపుడు అంటే బాగుండేది. ఇపుడు మీ మెడకు గుదిబండలా నేనూ ఉన్నాను. పెళ్లికి ముందే నాకిలాటి సాహసాలు చెయ్యాలని ఉంది. పదిమంది చేతా ఔననిపించు కోవాలని ఉంది అని చెప్పి ఉంటే బాగుండేది. మీకూ, మీ సాహసాలకూ సమస్కారం పెట్టి, మీసంబంధాన్ని వదులు కొనేవాళ్ళం" అంది ఉమ కోపంతో. ఆ కోపంలో ఆమెకు నోట మాట కూడా సరిగా రావటంలేదు. ఏదో తెలీని ఉక్రోషం ఆమెను ముంచెత్తివేస్తోంది.

"ఉమా! ఆఖరిసారి చెప్తున్నా... నీ ఇష్టం. పదేళ్ళ కిందట పాపాయిలా ఉండేవారు, ఇప్పుడూ అలాగే ఉండండి అనటం ఎంత తెలివితక్కువో ఇదీ అంతే! మనిషనేవాడు రోజు రోజుకూ, క్షణ

క్షణమూ ఎదుగుతాడు. ఎదుగుదల కొన్నాళ్లు శారీరకం, ఆ తర్వాత మానసికం! ఎదుగుదల ఆగిపోయిన రోజున మనిషి క్షీణించనారంభిస్తున్నా డన్నమాట! నువ్వు ఏమైనా అనుకో-నా ప్రాణాలు పోయినాసరే, నేనీ సాహసాన్ని చేసే తీరతాను. ఓడినా కూడా అదీ నా గెలుపుగానే భావిస్తాను! ఇంక ఈ విషయంలో నువ్వెంత తక్కువ మాట్లాడితే అంత మంచిదనుకొంటాను!" అనేశాడు ఈశ్వర్. అంటూనే ఆగదిలోంచి బయటకు వచ్చేశాడు.

అరగంట సేపు అటూ ఇటూ తిరిగాడు. తిన్నగా సముద్రం ఒడ్డుకు వెళ్లాడు.

నీలిరంగు నీళ్ళు ఆతన్ని ఆహ్వానిస్తు న్నట్లుగా అనిపించింది. ఇంతటి జీవితాన్నీ, ఇంతటి లక్ష్యాన్నీ వదులుకొని, వెనక్కు తిరిగి వెళ్లిపోవటం తెలివితక్కువతనం. అంతేకాదు-అది తన దౌర్భాగ్యం కూడా అవుతుంది. స్త్రీ పరమైన భయాలు, ఆందోళనలు సహజం. వాటివల్ల లక్ష్యానికి దూరం కావటం సాహసికుల పద్ధతి కాదు. అయినా మొదట్లో చేయూతనిస్తానన్న మనిషి ఇపుడు ఇలా బెంబేలుపడటం వింతగానే అనిపించింది ఈశ్వర్‌కు.

ఆలస్యం చేస్తున్నకొద్దీ ఆందోళనలు అధికమవుతుంటాయే తప్ప అన్యత్రా సాధించేదేమీలేదు. అలాటపుడు ఇక ఆలోచించటం అనవసరం అనుకొన్నాడు ఈశ్వర్.

అలా నిర్ణయించుకోవటమే తడవు, ఇక ఆలస్యం చెయ్యలేదు ఈశ్వర్.

వాతావరణ శాఖవారి వద్దకు వెళ్లి అటుపోటు వివరాలు, తుఫాన్ల గురించిన హెచ్చరికలు అన్నీ సంపాదించుకొన్నాడు. నేవీ వాళ్ల దగ్గర్నుంచి నాటికల్ చార్ట్స్ సంపాదించుకొన్నాడు.

లక్ష్మీపతికి, గంగులుకు, నరసప్పకు కబురుపెట్టాడు. క్రమంగా తను అనుకొంటున్న పద్ధతి గురించి అంతా చెప్పి సముద్రంలోకి దిగాల్సిన తేదీని నిర్ణయించాడు.

"ఒక్కటి గుర్తుంచుకోండి! మనం ఇపుడే ఈ విషయం గురించి ఎక్కడా చెప్పద్దు. మనం ఈ కార్యంలో ఉన్నామని ఇప్పటికే ప్రచారం అయిపోయింది. కానీ ఆ పనిని మొదలుపెట్టామన్న భావాన్ని మాత్రం కలగనివ్వద్దు. ఎవరడిగినా ట్రెయినింగ్ అనే చెప్దాం. కేవలం రోజూ గంటన్నర చొప్పున నెమ్మదిగా వెదుకుదాం...తొందరేమీలేదు!" అన్నాడు ఈశ్వర్.

"చాన్నాళ్ళయితే కష్టం. చాలారోజులు వెతకాలంటేమాటలా? మీరు స్థలంచెప్పండి. వారం రోజుల్లో వెతికి, దాన్ని బయట పడేద్దాం" అన్నాడు నరసప్ప.

అతనిఉత్సాహంచూస్తుంటే ఈశ్వర్‌కు నవ్వొచ్చింది. పల్లెటూళ్ళల్లో నూతుల్లో ఏమైనా పడిపోతే తీసే ఈతగాళ్లుంటారు. అలాటి మనస్తత్వమే ఇతనిలోనూ ఉంది అనుకొన్నాడు ముందు. కానీ ఆ తర్వాత ఆ ఊహ అతనికే నవ్వుతెప్పించింది. అలా అనుకొన్నాడుగానీ, నిజానికి తనుచేస్తున్న పనేమిటి?

నిజంగా పడవ మునిగిందో లేదో తెలీదు. మునిగినట్లు పదిమందీ అనుకొనే కథలున్నాయి. అవి కట్టుకథలూ కావచ్చు. ఆ ఒక్క ఆధారంతో అనంతమయిన సముద్రంలో అన్వేషణకు ఆరంభించాడు. నరసప్పేతన్నా తనది కొన్ని వేలరెట్ల తెలివితక్కువతనం మరి!




ఇలా అనుకొన్నాక నరసప్ప శక్తి స్తోమతల్నీ, అతని ఆలోచనల్నీ విమర్శిం చటం మానుకొన్నాడు ఈశ్వర్.

అదే చెప్పాడు నెమ్మదిగా—

"ఇలాటి విషయాల్లో ఆవేశం పనికి రాదు. నెమ్మదిగా వెతకటమే మంచిది. తప్పకుండా దొరుకుతుందనే నమ్మకం నాకుంది" అని చెప్పి ఆరోజునుంచే నరసప్పకు తీరప్రాంతాల్లో శిక్షణ ఇవ్వటం ఆరంభించాడు. సిద్ధాంతాలు, పరికరాలు పనిచేసే పద్ధతులుచెప్పక, వాటి ప్రాక్టికల్ యూజెస్ గురించి మాత్రం చెప్పేవాడు. డిమాండ్ వాల్వ్, సిలిండర్, సిలిండర్‌ను తగిలించుకొనే హార్నెస్, సిలిండర్‌లో ఉండే శుభ్రమయిన గాలి – ఇలాటివాటి గురించి చెప్తూ, అవి పనిచేసే విధానాలూ చెప్పేవాడు.

వీటితోబాటుగా వెయిట్ బెల్ట్, లైఫ్ జాకెట్ వంటి వాటి గురించీ చెప్పేవాడు. ఇవికాక కూడా తీసుకెళ్ళాల్సిన వస్తువు లయిన కత్తి, దిక్సూచి, డెప్త్ గేజ్, వాచి, టార్చ్, స్లేట్ అండ్ పెన్సిల్ వంటి వాటి గురించీ చెప్పేవాడు.

మొదటిరోజు నరసప్పకు ఇదంతా చెప్తోంటే పక్కనేవున్న లక్ష్మీపతి ఆశ్చర్య పోయాడు–"డైవింగ్ నేర్చుకొంటున్నాను గానీ, ఇవన్నీ కావాలని అక్కడ చెప్పలేదే నాకు" అన్నాడు.

ఈశ్వర్ నవ్వాడు. "మీరు నేర్చు కొంటున్నది ఏమాత్రం లోతులేని నీళ్లలో! రేపు మీరు నిజంగా పనిచేసేది సముద్రాల లోతుల్లో! అక్కడకయితే మీకివన్నీ అవసరమే!"

"ఏమిటి! కత్తి, వాచీ, పెన్సిలూ...ఇవి కూడా?"

"ఆ...కత్తి అంటే మామూలు కత్తి కాదు. లోతుల నీళ్లల్లో పనికొచ్చే కత్తి కావాలి. దాన్ని నేను సిద్ధం చేస్తాను. ఇది దేన్ని అయినా కొయ్యటానికి, నరక టానికి, రంపంలాగ ఉపయోగించటానికి కూడా పనికివస్తుంది. ఈ కత్తికి ఒక అంచు ఆకురాయిపైన ఉండే ఫైలింగ్ ఉంటుంది. రెండోవేపు మాత్రం పదును ఉండే అంచు ఉంటుంది. మనం నీళ్లల్లో గ్లాస్ వేసుకొంటాం గదా, ఆ గ్లాస్‌లోంచి జారిపోనివిధంగా పెద్ద పిడికూడావుండాలి. ఆ కత్తిని పెట్టటానికి ఒర కూడా ఉండాలి. ఒర లోహందయినా, ఫైబర్ గ్లాస్‌దయినా, కాకుంటే హెవీ ప్లాస్టిక్‌దయినా అయి ఉండాలి. దీనివల్ల ఎన్ని లాభాలు ఉంటాయో, నిజంగా మనం నీళ్లల్లో ఉన్న పుడే తెలుస్తుంది. ఇక పెన్సిలూ...పెన్నూ ఇలాటివి దేనికంటే ఏమైనా రాసుకోవాల్సి వస్తే ఎలా మరి?"

"నీళ్లల్లో రాయటం ఏమిటి?"

"ఆ...నిక్షేపంగా నీళ్లల్లో కూడా రాయచ్చు. మన మామూలు పలకల్నే నీళ్ళల్లోనూ ఉపయోగించొచ్చు. కాకపోతే ప్లాస్టిక్ పలకలమీదా రాసుకోవచ్చు. మామూలు పెన్సిల్‌తో-జలపంతో కాదు సుమా, పెన్సిల్‌తో రాసుకొంటే, నీళ్ళ లోంచి పైకివచ్చినప్పుడు గుర్తుంటుంది!" అని అన్నీ విడమర్చి చెప్పాడు ఈశ్వర్.

ప్రాక్టికల్ డైవింగ్ నేర్పే మొదటిరోజే నరసప్పను తీసుకెళ్ళి పూర్తిగా చెకప్ చేయించాడు ఈశ్వర్.

నరసప్పను చూడగానే డాక్టర్ నవ్వే శాడు. "పిడికేమండీ హిరణ్యాసురుడిలాగా ఉన్నాడు. పిడికి రోగాలేంటి? నా మందు లేంటి? శుభ్రంగా ఓ చుక్కేసుకుని పడుకో మనండి...అన్నీ తగ్గిపోతాయి" అన్నాడు వేళాకోళంగా ఆ డాక్టరు.

"అలాకాదండీ...కొంచెం జాగ్రత్తగా పరీక్షించండి. ముఖ్యంగా గుండెజబ్బు, క్షయ, మూర్ఛ, ఆస్తమా ఇలాటిలక్షణాలు ఏవయినా ఉన్నాయో లేదో అది మాత్రం ప రీ క్షిం చం డి" అని ఇంగ్లీషులో సరసప్పకు అర్థంకానివిధంగా అడిగాడు ఈశ్వర్.

ఈశ్వర్ అడిగింది ఎందుకో తెలీక పోయినా, ఆ పరీక్షలన్నీ పూర్తిచేశాడు డాక్టర్. "చెప్పానుగదా...నిక్షేపంలా వున్నాడు. ఇప్పుడే కాదు, గతంలోనూ వీడికే రోగాలూలేవు. కనీసం ఇంకో పదేళ్లు అయినా వీడు ఖచ్చితంగా బతుకుతాడని గ్యారంటీ రాసిస్తా" అన్నాడు డాక్టరు.

కానీ, ఆ డాక్టరు కేవలం డాక్టరేననీ, సరసప్ప నుదుటిమీది గీతల్ని ఆ డాక్టరు రాయలేదన్న సంగతి, ఆ డాక్టరుకు కేవలం గ్యారంటీ అనటమే తెలుసుగానీ, ఆ గ్యారంటీని నిలుపుకోగలగటం రాదన్న సంగతిఆ తర్వాత ఈశ్వర్కు స్పష్టంగా అర్థమయింది.




ఉమ ఆఖరి రోజువరకూ ఏదో ఒక రకంగా గొడవ పడుతూనే వచ్చింది. అయితే ఈశ్వర్ ఆ గొడవలకు లొంగి తన ప్రయత్నాన్ని విరమించుకోలేదు.

అనుకొన్నట్లుగానే చిన్న పడవనొక దాన్ని సిద్ధంచేసుకొనిఆరోజునఅన్వేషణకు బయలుదేరారు. ఆ పడవలో సముద్రం మీదకు వెళ్ళేటపుడు మళ్ళీ ఈశ్వర్ తీసుకోవాల్సిన అన్ని జాగ్రత్తల గురించీ చెప్పాడు.

"ఎక్కడా పొరబాటు పడొద్దు. చిన్న పొరబాటు జరిగిందో ప్రాణాలకే ముప్పు, గుర్తుంచుకోండి! ముందు జాగ్రత్తకు చెప్తున్నాను–నేను చెప్పిన సిగ్నల్స్అన్నీ గుర్తుపెట్టుకోండి. ఇవి ప్రపంచవ్యాప్తంగా ఉన్న సంకేతాలు కాబట్టి పర్వాలేదు. చూపుడు వేలును బొటనవేలుకు తగిల్చి, మిగిలిన అన్ని వేళ్ళనూ నిటారుగా ఉంచితే–'నువ్వెలా ఉన్నావు?' అనీ, లేకుంటే 'నేను బాగానే ఉన్నాను' అనీ అర్థం. మన పోలీసులు ఆగమన్నపుడు చూపించే సిగ్నల్నే ఇక్కడా 'ఆగు' అనేందుకు వాడతారు. ఇక 'ప్రమాదంలో ఉన్నాను, రక్షించండి' అని చెప్పేందుకు పిడికిలి బిగించి నీళ్ళమీద అటూ ఇటూ ఊపాలి. ఇవి గుర్తుంచుకోండి, చాలు" అన్నాడు ఈశ్వర్. అది చెప్పటంతోబాటు గానే లక్ష్మీపతి, స ర స ప్ప ల చే త ఆ సంకేతాల్ని చేయించాడు.

"నేను ముందుదూకుతాను. అయిదారు నిమిషాల తర్వాత నీకు భయంలేకుంటే దూకు. ఇదిగో...ఏమాత్రం భయమున్నా ఊరుకో. కొంపేమీ మునిగిపోదు! ఇక్కడే లక్ష్మీపతిగారి దగ్గరుండిపో లేకుంటే" అన్నాడు ఈశ్వర్.

"అక్కర్లేదుసార్! నేనే దూకుతా!" అన్నాడు సరసప్ప ధైర్యంగా. "మాకిలాటివి అలవాటే సార్!" అంటూ అభయం ఇచ్చాడు.

"చేపలు పట్టేవాళ్ళు, మీకు సముద్రంలోకి దూకాల్సిన పనేం ఉంటుంది?" అనడిగాడు లక్ష్మీపతి.




"అదేంటండీ...అలా అంటారు? వల విసురుతూ విసురుతూ ఉంటే పడిపోయిం దనుకోండి చేయిజారి! అపుడు ఎవరు తెస్తారు? ఇదిగో, ఇలా దూకి అలా తెచ్చేస్తాం!" అన్నాడు సరసప్ప.

"గుడ్...అయితే పర్వాలేదు" అన్నాడు లక్ష్మీపతి, ఆ సంజాయిషీతో తృప్తిపడినట్లుగా.

సముద్ర తీరం మొదట్లో అలలు బాగాపైకి లేస్తున్నాయి గానీ కొంత ముందుకు పోగానే అలల ఉధృతం తగ్గింది. సముద్రం అంతా దాదాపు ప్రశాంతంగానే ఉంది. తీరంనుంచి వంద అడుగులు దాటాక అన్నాడు ఈశ్వర్– "ఎలాటి పడవలైనా మునిగిపోయేవి, దెబ్బతినేది అంతా మొదటి రెండొందల అడుగుల్లోనే! ఆ తర్వాత ప్రమాదానికి గురయినవి చాలా అరుదు. సముద్రంలో ఎలాటి ఆటుపోట్లనైనా తట్టుకొని నిలప గలిగే ఎన్నో నౌకలు ఈ తీర ప్రాంతం లోనే దెబ్బతినేస్తుంటాయి. ముఖ్యంగా వాతావరణం బాగుండకపోతే మరీనూ! పైగా ఎన్నోవేల సంవత్సరాల నుంచీ సముద్రం ఆటుపోట్లకు గురయ్యేదీ ఈ తీర ప్రాంతమే కాబట్టి ఇక్కడి ఎత్తు పల్లాలు, మంచి చెడ్డల గురించి సరైన సమాచారం ఎవరి దగ్గరా ఉండదు. ఉజ్జా యింపుగానో, అలవాటు ప్రకారమో పడవలు వెళ్ళిపోతే పర్వాలేదుగానీ, లేక పోతే ప్రమాదమే" అన్నాడు ఈశ్వర్ "అందుకే మనం ఇక్కడి నుంచి దాదాపు మరో వంద అడుగుల ప్రాంతంవరకు మన ప్రయత్నాలు చేద్దాం...ఓకే" అన్నాడు ఈశ్వర్.

లక్ష్మీపతి తల ఊపాడు. లక్ష్మీపతికి ఆరోజు చాలా నిరాశగా ఉంది. కేవలం ఈ పడవమీద కూర్చోడం తప్ప ఇంకేం ఉంది పని! ఈమాత్రందానికి ఇంత పెట్టుబడి, ఇంత శ్రమ దేనికి? తననూ లోపలికి రమ్మంటే బాగుండేది! ఆ ఎడ్వెంచర్ వేరుగా ఉండేది అనుకొన్నాడు.

కానీ ఆ మాటపైకి అనలేదు. ఈశ్వర్ కూడా అతని గురించీ, అతని భావాల గురించీ కూడా ఏమీ పట్టించుకోలేదు.

డైవింగ్‌కు సిద్ధమవుతూ తన పనిలో తాను మునిగిపోయాడు ఈశ్వర్– సిలిండర్‌ను లేశాడు. లోపల గాలి ఉందో లేదో చూసుకున్నాడు. వాల్వ్, వాషర్ చెక్ చేసుకున్నాడు. సిలిండర్ వాల్వ్‌ను ఒక్క క్షణం తెరచి ఉంచి, లోపల ఇసక రేణువులు, తడి లేకుండా జాగ్రత్త పడ్డాడు. లైఫ్ జాకెట్‌కు ఏ పంచర్లూ లేవని నిర్ధారణచేసుకున్నాడు. ప్రొటెక్టివ్ సూట్‌ను వేసుకున్నాడు. ఆ తర్వాత లైఫ్‌జాకెట్, దాని తర్వాత వెయిట్ బెల్ట్‌లను అమర్చుకున్నాడు. వాచ్, డెప్త్ గేజ్ వంటివన్నీ సరిగ్గా పెట్టుకొన్నాడు.

పడవమీద ఉన్న ఇద్దరికేసి చూశాడు. 'ఓకే' అన్నట్లుగా బొటన వేలిని పైకి ఎత్తి మిగిలిన వేళ్ళను మడిచి, చేతిని ఊపాడు. అదే పద్ధతిలో ఆ ఇద్దరి దగ్గర్నుంచీ జవాబు రాగానే ఈశ్వర్ ఒకసారి నీళ్ళల్లోకి దూకాడు.

'దబ్బు' మంటూ నీళ్ళన్నీ పైకి లేచాయి. ఆ లేవటంతోబాటు ఆ నీళ్ళన్నీ తనకోసం ప్రత్యేకంగా లోపలికి దారి చూపిస్తున్నట్లుగా అనిపించింది ఈశ్వర్‌కు.కానీ అంతా మసకగాతోచింది మొదట్లో.

నీలిరంగు నీళ్ళల్లోకి పైనుంచిసూర్యుని వెలుగు ఏ లెనంత చొచ్చుకు వచ్చే ప్రయత్నం చేస్తోంది. అయినా అంతా

మసకగా ఉంది. అయితే ఒకటి రెండు క్షణాల తర్వాత ఈశ్వర్‌కు లోపలిదంతా క్రమంగా దర్శనం ఇవ్వసాగింది.

దాదాపు పది అడుగుల లోతుకు చేరే సరికి ఈశ్వర్‌కు చెవుల్లో దిబ్బడలాగ అనిపించింది. అదెందుకో ఈశ్వర్‌కు తెలుసు. చెవి అనే మన శరీర భాగం ముఖ్యంగా మూడు భాగాలై ఉంటుంది. పైకి కనిపించే డొప్పలలాటి భాగం నుంచి లోపలికిపోయే కాలవలాటి మార్గం మొదటిభాగం అయితే లోపల ఉండే కర్ణభేరి మూడో భాగమని చెప్పచ్చు. ఈ రెంటికీ మధ్యనే చెవిలోని ముఖ్య భాగంగా చెప్పుకోవాల్సిన యూస్టేచియాన్ ట్యూబ్ ఉంది. దీన్నే రెండో భాగంగా చెప్పుకోవచ్చు. సూక్ష్మంగా చెప్పాలంటే శబ్దం ఆ కాలవలాటి మార్గం గుండా ప్రయాణించి కర్ణభేరిని తాకుతుంది. ఆ తర్వాత మనకు శబ్దం వినిపిస్తుంది. మామూలు వాతావరణంతో సంబంధం ఉండేదే ఈ యూస్టేచియాన్ ట్యూబ్. ఇదే అటు లోపలి ఒత్తిడినీ, ఇటు బయటి ఒత్తిడినీ సమతలంగా ఉంచుతుంటుంది. అది ఏ కారణంవల్లనైనా దెబ్బతిన్నా, ఎటువైపు ఒత్తిడి పెరిగినా చెవినొప్పి ఆరంభమవుతుంది. నీళ్ళల్లో అయితే ఇది మరీ అధికంగా ఉంటుంది. ఉన్నట్లుండి పెరిగే ఒత్తిడి వల్ల ఆ ట్యూబ్ ఒత్తిడికి లోనవుతుంది. దానివల్ల కర్ణభేరి పగిలిపోయే ప్రమాదం కూడా ఉంది.



ఈ సంగతిఅంతా ఈశ్వర్‌కు తెలుసు. వెంటనే ఆవలించే ప్రయత్నం చేశాడు. దీనివల్ల నొప్పి తగ్గుతుందనీ, ప్రమాదం తప్పుతుందనీ అతనికి తెలుసు.

చెవుల్లో ఒత్తిడి రవ్వంత తగ్గినట్లు అనిపించగానే, ఈశ్వర్ మళ్ళీ కిందకు వెళ్ళటం ఆరంభించాడు. ఇంకో పది అడుగులు లోతుకు వెళ్ళగానే ఈశ్వర్‌కు నీటిఒత్తిడి పెరుగుతున్నట్లు అనిపించింది.

సముద్రంపైన ఉపరితలంమీద ఉండే గాలిఒత్తిడి, సముద్రంలోపల ముప్పయి మూడడుగులకే రెట్టింపు అవుతుంది. గాలి కన్నా నీరు దాదాపు ఎనిమిది వందలరెట్లు సాంద్రతతో ఉంటుంది గాబట్టి నీటి లోపల ఒత్తిడి ఏకొంచెం పెరిగినా ఆ తేడా తెలిసి పోతుంటుంది. అదే మరో ముప్పయిమూడు అడుగులు లోపలికిపోతే అక్కడ సముద్ర ఉపరితలంమీద ఒత్తిడికన్నా మూడింతలు ఉంటుంది. అయితే ఇదంతా డిమాండ్ వాల్వ్‌ద్వారా సరిచేసుకొంటూ జాగ్రత్త పడుతూ వెళ్లాడు ఈశ్వర్.

నీటి లోపలికి వెడుతున్నకొద్దీ అతనికి కొత్తప్రపంచం ఏదో దర్శనం ఇస్తూ కన పడినట్లయింది. రంగురంగుల చేపలు, రకరకాల చెట్లు అన్నీ తమదైన ఆ ప్రపంచంలో నిక్షేపంగా ఉన్నాయి. తమ ప్రపంచంలోకి అనాహ్వానితుడై వచ్చిన ఈశ్వర్‌ను చూసి తలపంకిస్తున్న ట్లుగా ఉన్నాయి. రంగుల ప్రపంచంలో తొలిసారిగా కళ్ళువిప్పినపాపాయి ఆశ్చర్య పోయిచూస్తున్నట్లు అక్కడ అన్నీ చూస్తూ ఉండిపోయాడు ఈశ్వర్.

ఎంతగొప్ప ప్రపంచమిది! ఎన్ని నిధులు, ఎన్ని నిక్షేపాలు! ఇక్కడ లేని దంటూ లేదసలు!! అందుకే కాబోలు ఈ సముద్రంపై ఆధిపత్యానికి కూడా ఎన్నో ఆరాట పోరాటాలు!!

ఇంకా లోతుకు పోవచ్చుగానీ అన్నీ ఒకేరోజు చెయ్యటం తెలివి తక్కువతనం. క్రమంగా లోతుపెంచుకొంటూ, లోపల ఉండే సమయాన్ని పెంచుకొంటూ పోవటం సరైనపని.

అందుకే ఈశ్వర్ అక్కడినుంచే పైకి రావటం ఆరంభించాడు. సముద్రం లోతుల్లోకి పోవటం తేలికేగానీ పైకిరావటం మాత్రం కొంచెం శ్రమతో కూడుకొన్నదే. అలవాటయిపోతే పర్వాలేదుగాని లేకుంటే ఎలాటివాడైనా పైకివచ్చాక పడిపోతా డన్నది నిజం. ఉన్నట్లుండి పైకిరావటం వల్ల గుండెల్లో బరువు అధికమవుతుంది. ఒక్కొక్కసారి అది ప్రాణాంతకమూ అవుతుంది.

ఈశ్వర్ అతి నెమ్మదిగా పైకి ఈదుతూ వచ్చాడు.

తమ పడవకు అన్ని పక్కలా పెట్టిన ఇనప కడ్డీలు పట్టుకొని పడవలోకి చేరు కొన్నాడు. సరసప్ప, లక్ష్మీపతి ఇద్దరూ కూడా జాగ్రత్తగా అతనికి ఎంతో సాయంచేసి పడవలోకి చేర్చారు.

"కనపడిందా?" అనడిగాడు లక్ష్మీపతి ఆత్రుతగా.

చాలా సేపటివరకు ఈశ్వర్ ఏమీ జవాబు ఇవ్వలేదు, 'లేద'న్నట్లు ఆతర్వాత చెప్పాడు.

పూర్తిగా రిలాక్స్ అయ్యాక అన్నాడు- "కేవలం ఒకే ఒక్కసారి ఒక్క మునుగు మునిగి పైకి వచ్చేలోపునే ఆ నిధి ఆచూకీ తెలిసేటట్లయితే, ఇంతకాలం ఎవ్వరూ దాన్ని ముట్టుకొని ఉండరనా ఏమిటి మీ అభిప్రాయం?" అన్నాడు చివాట్లు పెడుతున్న ధోరణిలో.

లక్ష్మీపతి నవ్వేశాడు.

"నేనూ ఒక్కసారి వెళ్ళిరానా, లోపలికి ?" అనడిగాడు లక్ష్మీపతి ఈశ్వర్‌ను.

'వెళ్ళొద్దం'టే నిరుత్సాహపడతాడని 'సరే'నని చెప్పాడు ఈశ్వర్. అయినా ఎందుకైనా మంచిదని తనే ముందు దూకాడు. తనుదూకిన తర్వాత నెమ్మదిగా దూకమని చెప్పాడు. "నీటి లోపల మాత్రం ఎప్పుడూ నాకు కుడివైపున వెనకగానే ఉండండి!" అని చెప్పిమరీ దూకాడు.

లక్ష్మీపతికూడా ఆ తర్వాత ప్రొటెక్టివ్ సూట్ వేసుకొని దూకాడు. కొత్తవాళ్ళకు సహజంగా ఉండే ఆసక్తి, భయం అన్నీ లక్ష్మీపతిలో నిండుగా ఉన్నాయని ఈశ్వర్‌కు అప్పుడే తెలిసిపోయింది. ఒకేసారి లోపలికివెళ్ళి అంతా వెతికివెయ్యాలనే తాపత్రయం అతనిలోమరీ అధికంగా ఉన్నట్లనిపించింది.

ఒకటి రెండు సెకన్లు ఆగి, ఈశ్వర్ నెమ్మదిగా లక్ష్మీపతి దగ్గరగావెళ్ళి, అతని చెయ్యిపట్టుకొని పైకిలాగనారంభించాడు.

ఇద్దరూ పైకివచ్చి ప్రొటెక్టివ్ సూట్‌ను విప్పారు. అది విప్పీవిప్పగానే మాత్రం లక్ష్మీపతి విరుచుకుపడ్డాడు– "మీకు నేను చెబుతూనే ఉన్నాగదా, ఇంకొంచెం సేపు లోపల ఉందామని, మీరు వినిపించుకొన్నారు కాదేం?" అన్నాడు.

ఈశ్వర్‌కు నవ్వొచ్చింది.

అసలు వీళ్లు గుర్తుపెట్టుకోరా ఏం ఏ సంగతీ?

అదే అడిగాడు.

"ఏమిటీ...విననిది మీరు. గుర్తుపెట్టుకోరా అని నన్ను అడుగుతారేం?" అన్నాడు లక్ష్మీపతి విసుగ్గా.

"ఏం వినమంటారు? నాకేమీ వినిపించనేలేదు మీరు నీళ్లల్లో! మాట్లాడింది గాలిలోఅయితే శబ్దం సెకనుకు వంద అడుగులు దూరం ప్రయాణిస్తుంది. నీళ్ళల్లో...!"

"నాకి సంగతులు చెప్పకండి! నాకూ తెలుసు. నీళ్ళల్లో అయితే అయిదు రెట్లు స్పీడుగా ప్రయాణిస్తుంది శబ్దం!" అన్నాడు లక్ష్మీపతి.

"నిజమే! కానీ మీరు మాట్లాడేది గొంతులోంచి. అక్కడ గాలి ఉంటుంది. ఆ గాలిలో పుట్టిన శబ్దం నోటిని విడిచి వచ్చేటపుడు అక్కడుండే నీరు, గాలి సంయోగస్థలంలో నాశనం అయిపోతుంది! మీరది మర్చిపోయి మాట్లాడితే ఎలా?"

'నిజమే...తను ఆసంగతే మర్చిపోయాడు' అనుకొన్నాడు లక్ష్మీపతి.

"నీళ్ళల్లో మాట్లాడటం కుదర్దు బాబూ! కానీ మనం చప్పట్లు కొడితే వినిపిస్తుంది. ఒక రాయిని ఇంకో రాయిమీద కొట్టినా వినిపిస్తుంది!" అన్నాడు నరసప్ప.

"అలాటి శబ్దాల్నే మనం సిగ్నల్స్‌గా ఉపయోగించుకోవాలి!" అన్నాడు ఈశ్వర్.

"మీ ఇద్దరూ పొయ్యొచ్చారు. మరి నేను...?" అన్నాడు నరసప్ప.

"సరే, కానీ..." అంటుండగానే నరసప్ప నీళ్ళల్లోకి దూకటానికి సిద్ధమయ్యాడు.

"ఇదిగో, వీటిని వేసుకోకుండా..."

"ఈవేళ ఒక్కరోజుకి వదిలెయ్యండి. రేపట్నుంచి మీరేది చెప్తే అదే వింటా..."

"అయితే నీ ఇష్టం. కానీ లోపలికి వెళ్ళకు" అన్నాడు ఈశ్వర్.

అన్నట్లుగానే నరసప్ప లోపలికి వెళ్ళకుండానే, వెంటనే తిరిగి వచ్చేశాడు.

"ఈరోజుకు ఇలా ముగుస్తోంది మన

ప్రయత్నం! కానీ రేపట్నించి క్రమంగా మనం టైం పెంచుతూపోదాం! రేపట్నించి మనం మరింత వేగంగా కూడా చేద్దాం... సరేనా?" అన్నాడు ఈశ్వర్.

"మీరొద్దు అంటున్నారని వెనక్కి పోవటమేగానీ, లేకపోతే ఇంకా ఇక్కడే ఉండి, దాని అంతు చూసిపోదామనే అనే వాడిని!" అన్నాడు నరసప్ప.

"నాదీ నరసప్ప మాటే!" అన్నాడు లక్ష్మీపతి.

"అయినాసరే...కుదరదు. ఏ విషయంలోనూ తొందరపాటు కూడదు, అత్యాశ కూడదు. నెమ్మదిగా ఏ పనిచేసినా మనకు లాభమే కలుగుతుంది. జయమే ఎదురవుతుంది!" అన్నాడు ఈశ్వర్.

నరసప్ప ఆ పడవను నెమ్మదిగా వెనక్కి నడిపించనారంభించాడు. అలలు పెద్దగా లేని ఆ సముద్రంమీద ఆ పడవ నెమ్మదిగా తీరంవైపుకు కదిలింది.

"ఇంత కాలమూ ఈ పెద్దిరాజు పడవ గురించి ఎవ్వరూ ఆలోచించకపోవటం గొప్పేకదా" అన్నాడు లక్ష్మీపతి.

"ఇక్కడివాళ్లు దాన్నంతగా పట్టించుకొని ఉండరు" అన్నాడు ఈశ్వర్.

"మీరల్లా అనకండి బాబూ! ఎందరో ముందుకొచ్చారుగానీ, ఒక్కరికీ మీలా గుండె ధైర్యం లేదు. ఆ పడవకేదో శని పట్టింది, గాలి తగులుకొంది, లేకుంటే ఎందుకట్లా నాశనం అయిపోయింది అనిమేం అనగానే వాళ్ళంతా నెమ్మదిగా జారుకొనేవాళ్లు. అట్లాటి పిరికిపందలు వాళ్ళు. వాళ్ళకేం దొరుకుతుందా పడవ?" అన్నాడు నరసప్ప.

"మనకు దొరుకుతుందంటావా?" కొంటెతనంగా ప్రశ్నించాడు లక్ష్మీపతి.





"నేనది అనక్కర్లేదండీ నిజం అదే! అది దొరికేంతవరకూ మనం వెతుకుతూనే ఉంటేసరి!" అన్నాడు నరసప్ప.

"దొరికిందే అనుకో-అయినా ఆ మాత్రం పడవలో ఏముంటుంది...నా బొంద. మన కష్టానికి మించిన ఫలమేమీ ఉండకపోవచ్చు!" నిరాశతో అన్నాడు లక్ష్మీపతి.

"మీరట్లా అనకండి బాబూ! అది దొరకాలేగానీ, దాంట్లో నాకు అణా... అణా వాటా ఇచ్చినా చాలు. మా ఇంట్లో ఏడుతరాలు ఇక మళ్లీ సముద్రం మీదకు రానక్కర్లేదు. అన్నీ వజ్రాలు, వైడూర్యాలు, బంగారపు కడ్డీలు. అసలు నన్నడిగితే ఆ పడవ ఆ బరువుకే మునిగిపోయి ఉంటుందంటాను!" అన్నాడు నరసప్ప.

"ఆమాట నిజమైతే అంటే ఆ పడవలోనే గనుక వజ్రవైడూర్యాలు, బంగారపు కడ్డీలు ఉండి ఉంటే ఆ బరువుకే ఆ పడవ మునిగి ఉంటొచ్చు! అందులో సందేహం ఏమీలేదు" అన్నాడు ఈశ్వర్.

ఈశ్వర్ అలా అంటూనే ఒడ్డుకేసి చూశాడు యధాలాపంగా.

తీరంమీద అంతా ఒకటే జనం. తమకు ఏదో అఖండ స్వాగతం చెప్పడానికి వచ్చినట్లుగా అనిపించారు వాళ్లంతా లక్ష్మీపతి కంటికి. "మనం ఏకంగా ఆ పడవనే తెచ్చేస్తున్నాం అనుకొన్నారు కాబోలు!" అన్నాడు నవ్వుతూ.

"నిజమే...ఆ గార్డ్ ఆఫ్ ఆనర్ చూస్తోంటే అలాగే అనిపిస్తోంది!" అన్నాడు ఈశ్వర్ కూడా.

కానీ పడవ ఆగి, కిందకు దిగిన ఈశ్వర్‌కు అక్కడ అంత మంది గుమిగూడిన కారణం తెలిసి ఒక్కక్షణం గుండె ఆగిపోయినట్లయింది.



## 10

"ఘోరం జరిగిపోయింది బాబూ!" అంటూ ఎదురొచ్చాడు గంగులు ఈశ్వర్‌కు.

"ఏం జరిగింది?" అనడిగాడు ఈశ్వర్.

"ఎట్లా చెప్పమంటారు?. మీ పాప... మీ పాప.." అంటూ ఆగిపోయాడు గంగులు.

"ఏమైంది?"

ఏమీ కావటానికి వీల్లేదు. రాణి ఆరోగ్యం బాగానే ఉంది. పిల్లలన్నాక ఏదో ఒక ఇబ్బంది ఉండనే ఉండొచ్చు. కానీ తను బయలుదేరేటపుడు రాణి బాగానే ఆడుకొంటోంది. పాకుతూ ఎదురొచ్చింది కూడానూ! అలాటి రాణికి ఏం జరిగి ఉంటుంది?

"పదండి...ఇంటికి పోదాం!" అన్నాడు గంగులు.

"చెప్పు గంగులూ...ఏమయింది?"

"అయిపోయిందండీ. అంతా అయి పోయింది! పాప నీళ్లలో పడిపోయింది"

"ఎక్కడ?" అనడిగాడు ఈశ్వర్. అలా అడిగాడేగానీ అప్పటికే అతని గుండె ఆగినట్లయిపోయింది. నిత్యం కిలకిలా నవ్వుతూ ఉండే పాప...ఇపుడు లేదంటే నమ్మటం ఎలా? అసలిది సాధ్యమేనా? లేకుంటే తనే పొరబాటున వింటున్నాడా? ఒకటి వినబోయి ఇంకోటి వింటున్నాడా తను? కాకపోతే గంగులు ఒకటి చెప్ప బోయి వేరొకటి చెప్తున్నాడా??

అయి ఉండదు. తను విన్నది నిజ మయి ఉండదు.

కానీ ఇందరు జనం. ఎన్నడూ రానిది ఇప్పుడు ఇంతమంది ఇలా ఇక్కడ తన కోసం వేచి చూస్తున్నారంటే...ఇది నిజమే అయి ఉంటుంది. గంగులు చెప్పేది నిజమేఅయి ఉంటుంది...

అయితే ఎలా జరిగింది? ఎక్కడ?? ఎందుకు???

అదే అడిగాడు ఈశ్వర్.

"మీ ఇంట్లోనే. ఆ నేలబారు తొట్టిలో" అన్నాడు గంగులు.

ఈశ్వర్‌కు అంతాఅర్థమయిపోయింది. ఎపుడో ఎవరో కట్టించిన తొట్టి అది. నేలబారునే ఉంది. బహుశా పాప పాకుతూ వెళ్లి....ఆ సమయంలో ఉమ తన గురించి ఆలోచిస్తూ ఉండి ఉండొచ్చు. ఆ ఆలోచనలుపూర్తయితేరుకొని వెతుక్కునే సరికి ఏముంది...ఆలస్యం అయిపోయి ఉంటుంది-అనుకొన్నాడు.

అతనికి గుండెలొకసారి అవిసి పోయాయి. కొంతసేపటి కిందటివరకూ ఇంట్లో నవ్వుల వెన్నెలల్ని వెదజల్లిన పాప ఇపుడేదీ? ఏమయిపోయింది? అందాలన్నీ తన సొంత సొమ్ములుగా, అమాయకత్వం అంతా తనకే సొంతమన్నట్లుగావున్న పాప...ఇపుడేదీ? ఏమయిపోయింది??

పొరబాటు జరిగిపోయింది. కానీ అది ఉమకు షాక్ అయితేరుతుంది. సరిదిద్దుకో లేని పొరబాటు అది. తేరుకోలేని షాక్ అది!!

పసుగులాటి నడకతో ఇంటికి చేరాడు ఈశ్వర్. ఒడ్డుమీద ఎందరు తనకోసం వేచి చూస్తున్నారో ఇంటి దగ్గరా అంత మంది....ఇందరు తన బాధను పంచు కోవటానికి రావటమంటే .... ఏంచేశాడు తను వీళ్ళకు? ఏమవుతాడు తను వీళ్ళకు?

మనిషి మనిషి సాయం - అంతే! ఆపత్సమయంలో ఆదరం చూపవచ్చారు. 'నీ కష్టాన్ని తొలగించలేం కానీ నీ బాధను పంచుకోవటానికి మాత్రం సిద్ధం!' అన్న భావంతో వచ్చారు.

ఈశ్వర్ చేష్టలుడిగిన కట్టెలాగ ఇంట్లోకి ప్రవేశించాడు- ఆతర్వాత ఉమ దగ్గరగా వెళ్ళి భుజంమీద చెయ్యి వేశాడు.

ఉమ ఒక్కసారి భోరుమంది.

అంతక్రితం ఎప్పుడో తుఫానులు వచ్చినపుడు బంగాళాఖాతం మీదకు ఎత్తి వచ్చినపుడు-అంతగా ప్రకృతి చలించి పోయి ఉంటుంది కాబోలు-మళ్ళీ ఇపుడు...

ఈశ్వర్‌లోని జవసత్వాలన్నీ ఉడిగి పోయినట్లయింది.

కుప్పకూలినట్లు ఉమ పక్కకు కూలి, ముఖాన్ని చేతుల్లో దాచుకొన్నాడు.

గంగులు, లక్ష్మీపతి, సరసప్ప, కల్యాణి ఇంకా ఎందరో - అందరూ అక్కడే నిలబడి ఉన్నారు. మౌనంగా, విచారంగా.

లక్ష్మీపతి మొదట కదిలాడు. అటుపై జరగాల్సినవన్నీ పూర్తిచేశాడు. అతను చెప్పిందల్లా, గుండెలు బరువెక్కిపోతోంటే కష్టంమీద స్వాధీనంలోకి తెచ్చుకొని చేశాడు ఈశ్వర్.

ఇంటికి తిరిగి వచ్చేశారు అందరూ.

రాత్రయింది-

నిన్నటి వరకు చీకటి ఇంత భయంక రంగా ఉంటుందని తెలీదు. భయం ఇంత భీకరంగా ఉంటుందనీ తెలీదు. బాధ, ఒంటరితనం, ఏమీ చెయ్యలేని నిస్సహాయ స్థితీ...ఇవన్నీ ఇంత ఘోరంగా ప్రతీకారం తీర్చుకొంటుంటే మనిషి ఇలా నిలబడి పోయి చూస్తూ ఉండిపోవాల్సి వస్తుందని తెలీదు.

ఎక్కడో గుండె లోతుల్లోంచి బాధ తన్నుకు వస్తోంది. భార్యను సైతం ఓదార్చ లేని స్థితి అది. తన్ను తాను సంబాళించు కోలేని స్థితి అది.

ఈశ్వర్‌ఏమీ మాట్లాడలేకపోయాడు. ఒక్కమాట...ఒక్క ఓదార్పు మాట పైకి అంటే ఉప్పెనలా దుఃఖం ఉమను ముంచేస్తుందనీ తెలుసు. అందుకే మౌనాన్ని వహించి, బాధను సహించి నిశ్శబ్దంగా ఉండిపోయాడు.

ఉమ పైకేమీ అనలేదు. గొంతులోనే దుఃఖాన్ని అణిచిపెట్టేసుకొంది - ఉమ ఏదైనా పైకి అంటే బాగుండును అను కొన్నాడు. బాధను మాటల్లోకాక కన్నీళ్ళతో కలబోసుకోవాలనుకొన్నాడు.

ఆ ఆశ అడియాస అయింది.

చిచ్చుపెట్టిన రాత్రి చక్కగా పరచుకొని, నెమ్మదిగా వెళ్ళిపోతున్న సమయంలో-కొత్త జీవితంలా తూర్పు వైపునుంచి వెలుగు రేఖలు చిన్నగా పరచు కొస్తున్న సమయంలో....

ఉమ ఏదో అంది.

ఉలికిపడ్డాడు ఈశ్వర్.

"ఏంటి...అంటున్నావ్?" అనడిగాడు ఈశ్వర్.

"వినిపించలేదా?" అనడిగింది ఉమ.

"వినపడింది. కానీ...మళ్ళీ చెప్పు!"

"చెప్పటానికేముందీ...అంతా అయి పోయింది! మీ నిధివేట నా పాపను బలి తీసుకొంది. ఇప్పటికైనా మీ కళ్ళు

చల్లబడ్డాయా?" ఆవేశంగా అంది ఉమ.

ఈశ్వర్‌కు అంత బాధలోనూ నవ్వొచ్చింది.

మనసు చెడ్డది. మనసు కొంటెది. మనసు పోకిరిది. మనసు మంచిది– ఇవన్నీ ఈశ్వర్‌కు తెలుసు. కానీ మనసు బలహీనమైనదని కూడా ఈశ్వర్ ఆ క్షణంలోనే తెలుసుకొన్నాడు. లేకపోతే ఉమ అంతమాట అనదు. సొంత బిడ్డను ఎవరైనా బలి తీసుకొంటారా? ఎంతటి కఠినులైనా? ఎంతటి ఆశ ఉన్నా...! ఇది పిచ్చితనం.

ఆవరించిన బాధలో అర్థం తెలీని దశలో మనసు పయనిస్తోంటే జరిగే భాషణమే ఇది!

ఈశ్వర్ ఏమీ అనకపోవటంతో ఉమ మళ్ళీ అంది–"పోనీండి...జరిగింది జరిగిపోయింది. ఇప్పటికైనా మీ ప్రయత్నం మానుకొంటారా?"

ఈశ్వర్ తల అడ్డంగా వూపేశాడు. "అది జరిగేదికాదు ఉమా! దీనికీ దానికీ లంకె పెట్టకు'' అన్నాడు.

"లంకె పెట్టడం ఏమిటి? అది నిజం. తరతరాలుగా ఉన్న నమ్మకం అది. ఎవరి సొమ్మో ఆశించటం పాపం. ఆ పాపానికి ప్రాయశ్చిత్తం చెల్లించాల్సింది మీరైతే....శిక్ష నాకు పడింది!'' అంది ఉమ మళ్ళీ ఏడుపులోకి దిగుతూ.

"అర్థం లేకుండా మాట్లాడకు! తప్పుచేసింది నువ్వు. పాపను సరిగ్గా చూసుకోలేక చేజార్చుకొన్నదానివి నువ్వు. తప్పు నాదంటూ నేరంమోపే ప్రయత్నం చెయ్యకు...అయినా అదివేరు. ఇదివేరు. ఈ రెంటికీ పొంతనాలేదు, సంబంధమూలేదు. నువ్వు అనవసరంగా రెంటిని జోడించి మనసు కష్టపెట్టుకోకు'' అన్నాడు ఈశ్వర్.

"పోనీ..నాకోసం..ఆ ప్రయత్నాన్ని విరమించుకోండి. దానివల్ల నష్టమేనని నాకు నా మనసు చెప్తోంది! ఆమాట నిజమేనని ఈరోజు ఋజువయిందిగదా" అంది ఉమ.

"సరే...నువ్వన్నదే నిజమనుకొందాం! జరగాల్సిన నష్టం జరిగిపోయిందిగదా, ఇక వెనుదిరగటం దేనికీ..? ముందుకే వెడతా'' అన్నాడు ఈశ్వర్ ఖరాఖండిగా.

"ఆ ముదనష్టపు సొమ్ము ఇప్పటికే ఒకపూర్తి కుటుంబాన్ని నాశనంచేసేసింది. ఇపుడు మన కుటుంబంకూడా అలా అయితేగానీ, మీకు సరిపోదన్నమాట!''

ఈశ్వర్ ఏమీ అనలేదు.

"నా మాట వినండి.." అంటూ ఉమ ఏవేవో అనటం ఆరంభించింది. ఈశ్వర్ అదేమీ పట్టించుకోలేదు.

ఆఖరికి అతనిలా దిగిరాడన్న నమ్మకం పెరిగాక చిన్నగా అంది ఉమ – "పోనీ ఒక్కటి చెయ్యండి...నన్నే శివుడి గుడికో తీసుకెళ్ళండి. నాకు పసుపు కుంకుమలైనా మిగల్చమని కోరుకొంటాను!"

"ఉమా....ఎందుకింత పిచ్చిదానివై పోతున్నావో నాకర్థంకావటంలేదు !" అన్నాడు ఈశ్వర్.

"మీ ఇష్టం. పోనీ నా మీద గౌరవం ఉంచైనా...రండి!''

"సరే...అలాగే కానీ'' అన్నాడు ఈశ్వర్.

తనకు ఆ నమ్మకం లేకపోయినా భార్య నమ్మకానికి గౌరవం ఇస్తే తప్పేమీ లేదు. తన ప్రాణాలకోసమే ప్రార్థిస్తానంటుంటే వద్దనటం ఏమిటి?

వారంరోజుల తర్వాత ఈశ్వర్ ఉమ వెంట గుళ్ళోకి నడిచాడు.గుడి ప్రశాంతంగా

ఉంది. నిర్మలంగాఉంది. నీ నిర్ణయానికే నా ఆశీర్వాదాలు అన్నట్లుగా ఉంది.

ఉమ పెద్దఎత్తున పూజలుచేయించింది. అన్నీ అయి కిందకు దిగుతోంటే అంది – "మీరీ అన్వేషణలోంచి దిగ్విజయంగా తిరిగి వచ్చినా, అన్వేషణ విఫలమయి మీరే వచ్చినా మళ్లీవచ్చి దర్శనం చేసుకొంటా నని మొక్కుకున్నా!"

"మంచిదే ... అలాగే కానిద్దాం!'' అన్నాడు ఈశ్వర్.

"అంతేకాదు,మీరొకవేళ నిధినే సంపాదిస్తే అయిదుశాతం డబ్బీలో వేస్తానన్నా" అంది ఉమ.

''బాగుంది. రాబడి రాకముందే ఖర్చు ఆరంభమైందన్న మాట!'' అన్నాడు ఈశ్వర్ నవ్వుతూ.

''మీరేదో సంపాదిస్తారని, దాన్ని ఖర్చుపెడదామని నేను కూర్చున్నానని అనుకోకండి!" అందిఉమ. "నాక్కావాల్సిందంతా కేవలం మీ సేఫ్ రిటర్న్! ఇప్పటికే నేనెంతో నష్టపోయాను...'' అంటూ ఆగిపోయింది.

ఉన్నట్లుండి వాతావరణంలో విషాదం చోటుచేసుకోంది. ఈశ్వర్ కూడా కాసేపటిదాకా ఏమీ అనలేదు – "సరే.. నీ వాటా అది – అనుకుంటాను. దాన్ని నీ ఇష్టం వచ్చినట్లు చేసుకో'' అన్నాడు చివరికి.





మర్నాడు మళ్ళీ 'సాగరమథనానికి' బయలుదేరారు. చేపలుపట్టే మిషతో బయలుదేరటం, కొంత దూరం వెళ్ళి అక్కడ 'బేస్'లాటి సెటప్‌చేసుకొని, అక్కడే డైవింగ్ ఆరంభించి లోతుల్లోకివెళ్ళి వెతుకులాట ఆరంభించటం.

మొదటిరోజు వెళ్ళినపుడు ఈశ్వర్ మర్చిపోయాడుగాని ఈసారి మాత్రం అండర్‌వాటర్ ఫొటోగ్రఫీకి వీలుండే కెమేరా దగ్గరుంచుకొన్నాడు. ఏ క్రీడలోనైనా ఫొటోగ్రఫీకెంతో ప్రాముఖ్యం ఉంది. ముఖ్యంగా నీటిలోతుల్లో అయితే మరీనూ. సముద్రంలోపల ఒక్కోసారి అద్భుతమైన దృశ్యాలు కానవస్తుంటాయి-మనకు కనపడే ప్రపంచం ఎంత ఉందో దానిపై ప్రకృతి అందాలు ఎన్ని ఉన్నాయో, కనపడని అగాధాల లోపలకూడా అంతకు మించిన అద్భుత దృశ్యాలు ఉన్నాయి. ఒకసారి ఆశ్చర్యాన్ని కలిగించే శిల్పాలవంటి రాళ్ళతో నిండిన చిన్ని కొండలు. ఇంకోచోట పిచ్చిమొక్కలతో నిండిన అరణ్యాలు. ఇంకోచోట అందాలు ఒలికే అందమైన జెల్లీచేపలు. ఇక తను వెతుకుతున్న నౌకాశిథిలాల సంగతి వేరు!

ఇందులో ఏ ఒక్కటి కనిపించినా, ఆ అందాన్ని ఎంత వర్ణించినా సరిగ్గా చెప్పగలగటం అసాధ్యంగనుక ఫొటోలుతీసి దగ్గర ఉంచుకోవటమే మంచిది. సాధించిన విజయాలు లేకపోయినా, సాగించిన ప్రయాణాల గుర్తులుగా ఉండిపోతాయి ఇవి!!

"ఆ లోతుల్లో ఫొటోలు తీయటం కష్టమవుతుందేమో గద!" అన్నాడు లక్ష్మీపతి.

"ఎందుకు కష్టం? ఎటొచ్చీ కొన్ని కనీస జాగ్రత్తలు తీసుకోవాల్సి ఉంటుంది. అంతే!" అన్నాడు ఈశ్వర్.

"మామూలుగా అయితే రీలులోకి వెలుగు రాకుండా జాగ్రత్తపడితే సరిపోతుంది. నీళ్ళల్లో అంత వెలుగుఉండదు గదా!"

"వెలుగుతక్కువ ఉంటుందేమోగానీ, నీళ్ళు ఉంటాయిగదా! నీళ్లు కదలటం వల్ల బురదకూడా పైకి లేస్తుంటుంది. కానీ ఈ కష్టాలన్నిటినీ అధిగమించి ఎందరోఎన్నో సినిమాలు కూడా తీస్తున్నారు. 'ట్వెంటీ థౌజండ్‌లీగ్స్ అండర్ సీ' అన్న పేరుతో విలియమ్‌సన్ తీసిన సినిమా ఇలాటిదే! నిజానికి అండర్ వాటర్ ఫొటోగ్రఫీకి ఆయనే ఆద్యుడనాలి!"

"టెక్నిక్ అంతా ఒకటేనా!"

"ఆ...ఎటొచ్చీ కెమేరాలోకి నీళ్ళు వెళ్ళకుండా ఉండేలా వాటర్ అండ్ ప్రెజర్ ప్రూఫ్ హౌసింగ్‌తో ఉన్న కెమేరాలు ఉంటే చాలు" అన్నాడు ఈశ్వర్.

పడవ కదిలింది.

ఎండ చుర్రున కాలుతోంది. అదే ఎండ మామూలుగా అయితే అంత ఉష్ణతతో ఉండదు అనిపిస్తుంది. కానీ సముద్రం మీద ఎక్కువగా ఉన్నట్లు అనిపిస్తుంటుంది.

మొదటి సారి వెళ్ళినపుడు...రాణిని నష్టపోయాడు తను! అది పూర్తిగా తమ




నిర్లక్ష్యం వల్లనే జరిగినా, ఉమ మాత్రం దానికి తన ప్రయత్నాలనే నిందిస్తోంది. తప్పు తమదైనా తమది కాదనుకోవటం, ఎవరినో నిందించటానికి ప్రయత్నించటం కూడా ఒకరకమైన బలహీనతే ఏమో!!

నిధులకోసం, నిక్షేపాలకోసం ప్రయత్నించేవారికి కష్టాలు కన్నీళ్లు తప్పవంటారు. కానీ ఆ కష్టాలు యాదృచ్ఛికంగా సంభవించేవైనా, దీనికి ముడిపెట్టటం మాత్రం విచిత్రం. తను సముద్రంలో ఈ అన్వేషణకు బయలుదేరకుండా ఉండివుంటే, ఈ ప్రమాదం జరిగేది కాదా??

ఈశ్వర్‌కు మనసంతా చికాగ్గా ఉంది. ఎంతో ఏకాగ్రతతో, నిష్టతో చెయ్యాల్సిన పని ఇది. కానీ తనకు అన్నీ కష్టాలే. అన్నీ ఎదురు దెబ్బలే. ఒక్కోటీ అధిగమించుకొంటూ రావటం మాత్రం విచిత్రమే. లేకపోతే ప్రతీ పైసకు గడ్డి కరిచే మనుషులు ఉండే ఈ లోకంలో తనలాటి సాహసికుల్ని ప్రోత్సహించేందుకు సిద్ధపడే కల్యాణిలాటిస్త్రీ ఉండటమేమిటి? కూడా వస్తానంటూ సిద్ధపడే లక్ష్మీపతి సంగతేమిటి?

ఇలాటివి తల్చుకొంటే మాత్రం గెలిచి తీరతాననే నమ్మకం ఈశ్వర్‌లో నిండేది.

పడవ నెమ్మదిగా కదులుతూసముద్రం లోపలికి సాగుతోంది. ఈశ్వర్ నావిగేషన్ చార్ట్ తీసి చూసుకొన్నాడు. మొన్నటిసారి వెతికినదానికి రవ్వంత దూరంగా ఈసారి వెతకాలని నిర్ణయించి చార్ట్‌మీద అక్కడ పెన్సిల్‌తో గుర్తు పెట్టుకొన్నాడు.

లక్ష్మీపతి ఒకపక్కన కూర్చుని బిజీగా కెమెరా హౌసింగ్‌ను పరీక్షిస్తున్నాడు. అతనిలో ఎప్పుడూ ఏదో తపన. ఆ తపన ఉంటే మనిషి ఏదైనా సాధించగలడు. ఆ తపనతోనే అతను డైవింగ్ నేర్చుకొన్నాడు. తనతోబాటు అగాధాల అడుగులలోకి వచ్చి అన్వేషణ సాగిస్తున్నాడు.

"కలిసి వచ్చిందా రానీండి, రాకపోయిందా పోనీండి. మేం నష్టపోయేది ఏముంది...మా మామూలు జీవితం మాకుండనే ఉంది!" అని చెప్పగలిగిన ఆ అన్నాచెల్లెళ్లు నిజంగా ఆదర్శమూర్తులు.

ఈశ్వర్‌కు లక్ష్మీపతిని చూశాక మళ్ళీ గుండెలో ధైర్యం హెచ్చయింది.

అనుకొన్న స్థలానికి చేరగానే ఈశ్వర్ డైవింగ్‌సూట్ 'గేర్'ను వేసుకొన్నాడు. లక్ష్మీపతి, నరసప్ప ఇద్దరూ ఒకరి తర్వాత ఒకరు వంతుల ప్రకారం లోపలికి దూకేలాగ నిర్ణయించాడు. ఎప్పుడైనాసరే ఒకరు పడవమీదే ఉండేట్లుగా చూశాడు. ఆ ఇద్దరికీ తగినంత అనుభవం లేదు గాబట్టి ఎక్కువసేపు నీళ్ళల్లో ఉండొద్దని ఇద్దరినీ హెచ్చరించాడు. ఏ క్షణంలోనైనా లోపల ఇబ్బందిగావున్నట్లు అనిపిస్తే వెంటనే పైకి హేండ్ సిగ్నల్స్ ఇవ్వమని చెప్పాడు. వాటిని మరోసారి ఇద్దరిచేతా ప్రాక్టీస్ చేయించాడు. నీళ్లల్లో దూరం వెళ్లిపోవద్దనీ, దీనివల్ల ఎంతో ప్రమాదం ఉంటుందనీ, దూరం అధికమైతే తిరిగి పడవను చేరటం కష్టమవుతుందనీ చెప్పాడు. ఇద్దరూ తన సూచనలను, ఆదేశాలను స్పష్టంగా పాటిస్తారని నమ్మకం కలగగానే మళ్ళీ ఒకసారి 'జాగ్రత్త!' అంటూ హెచ్చరించి, ఈశ్వర్ నీళ్ళల్లోకి దూకాడు.

అన్నివైపులనుంచీ అతనికి స్వాగతం చెప్తున్నట్లు, నీళ్ళు అతన్ని లోపలికి ఆహ్వానిస్తున్నట్లూ, అతను దూకగానే



అక్కడినీళ్ళన్నీపక్కకు తప్పుకొన్నాయి. అతను దూకుతోంటే తమకెంతో సంతోషంగా ఉందన్నట్లుగా అన్ని వైపులా ఉవ్వెత్తున పైకి లేచాయి.

ఈశ్వర్‌కు డైవింగ్ కొత్తకాదు. అందుకే ఈ సాహసాన్ని తలపెట్టాడు. నీటిలోకి దూకిన వెంటనే ఆ ఆనందం అతనికి చెప్పనలవి కాకుండా ఉంటుంది. అంతకాలమూ కష్టాలూ కార్పణ్యాలూ, కోపాలూ తాపాలూ, ఈర్ష్యాద్వేషాలు నిండిన మనుషుల మధ్య మసిలే తనకు ఆ జలచరాల మధ్యకు రాగానే అనిర్వచనీయమైన ఆనందం లభించినట్లుగా ఉంటుంది.

ఈశ్వర్ నెమ్మదిగా లోపలకు 'దిగ' సాగాడు.

లోతుల్లోకి వెడుతున్నకొద్దీ ఎన్నో అందాలు ఆహ్వానిస్తూ కనిపిస్తాయి. కొత్త రకం 'జంతువే'దో జలప్రవేశం చేసిందా అన్నంత ఆత్రుత కంగారు అక్కడ జలచరాల్లో ఉంటుంది. అన్నీ క్రమంగా దూరం జరిగి, అక్కడినుంచి తనను చూస్తున్నట్టుగా అతనికి అనిపిస్తూ ఉంటుంది.

అనుకొంటాంగానీ ... వాటికి కూడా ఎన్ని తెలివితేటలు ఉన్నాయని! వచ్చినవాడు శత్రువో, స్నేహితుడో ఇట్టే పసిగట్టగలవవి!! సముద్రాల్లో ఈటెలలాటి సాధనాలతో చేపల్ని పట్టడమూ ఉంది. వలలువేసి పట్టుకోవటం ఒక పద్ధతి అయితే ఈటెలు విసిరి వాటిని పట్టుకోవటం ఇంకో పద్ధతి. అందుకే దూకినవాడు ఎవడో అవి కూడా క్రమంగా పసిగడ్తున్నట్లే అనిపిస్తుందతనికి!!

ఈశ్వర్ క్రమంగా లోపలికి, నెమ్మదిగా కిందకు దిగసాగాడు.

ఈశ్వర్ దూకిన తర్వాత నరసప్ప దూకాడు.

నరసప్పకూ సముద్రం కొత్తకాదు. అలలు, కెరటాలు, తుఫానులు, ఉప్పెనలూ అతనికి జీవితంలో భాగాలు. చేపలను పట్టుకోవటం, వాటితో తన జీవనాన్ని గడుపుకోవటం అతనికి వృత్తీ, ప్రవృత్తీ.

–నరసప్ప నీటిలోకి దూకగానే, లక్ష్మీపతి పడవను స్టడీ పొజిషన్‌లోకి తెచ్చాడు. అలలు ఎంత కదులుతున్నా, పడవ దాదాపు అక్కడే ఉంటుందన్న మాట!

–నీటిలో దూకిన నరసప్పకు మొదట అదోలా అనిపించింది. చెవుల్లోకి నీళ్ళు చేరుతున్నట్లుగా అనిపించింది. అక్కడి నుంచి తలలోకి కూడా అవి ప్రవహిస్తున్నట్లుగా ఓ భావన; మెదడు దిమ్మెక్కుతున్నట్లుగా, కళ్ళు తిరిగిపోతున్నట్లుగా, ఒళ్ళు స్వాధీనంతప్పుతున్నట్లుగా ఏమేమో అనిపించింది.

–నరసప్ప ఒకసారి తల విదిలించుకొన్నాడు. ఒంటిని స్వాధీనంలోకి తెచ్చుకొనే ప్రయత్నం చేశాడు. అదతనికి వీలుకాలేదు.

"ఏమాత్రం కష్టం తోచినా డిస్ట్రెస్ సిగ్నల్ ఇవ్వండి" అని ఈశ్వర్ చెప్పింది గుర్తుంది కానీ ఆ సిగ్నల్ ఏమిటో నరసప్పకు ఆ క్షణంలో గుర్తుకు రాలేదు.

అతనికి అర్థంఅయిపోయింది–కారణం ఏమిటో! చేసిన తప్పుకు ఇపుడు శిక్ష కాబోలు ఇది–అనుకొన్నాడు. 'రేపే బయలుదేరాలి మళ్ళీ' అని ఈశ్వర్ అనగానే నరసప్పకు ఎందుకో దృష్టి మళ్లింది–అలవాటు కొద్దీ ఓచుక్క వేసు




కొంచేగానీ సముద్రంపైకి వెళ్ళగలిగెలా అనిపించలేదు. మొదటిసారి అతి కష్టం మీద అది ఆపుకోగలిగాడుగానీ, ఈసారి మాత్రం అది అతనిచేత కాలేదు.

అందుకే నిద్రలేచి లేవగానే నెమ్మదిగా ఎవరికంటా పడకుండా వెళ్లి ఓ'చుక్క' వేసుకొచ్చేశాడు నరసప్ప. ఎక్కడ ఈశ్వర్ ఆ వాసన పసిగట్టేస్తాడోనన్న భయంతో అతనికి దూరంగా ఉంటూనే గడుపుకొచ్చాడు.

కానీ....

-అతవి ఆలోచనలన్నీ క్రమంగా మొద్దుబారసాగాయి. ఒంట్లోని అవయవాలన్నీ బరువుగా తోచాయి. చూపు మందగించిపోయింది. నరసప్ప క్రమంగా తెలివి తప్పిపోసాగాడు.

దూరంగా ఎవరో కదులుతున్నట్లయి ఈశ్వర్ నెమ్మదిగా అటు జరిగాడు. లక్ష్మీపతి అయితే ఇంకొంచెం కిందకు తీసుకెడదామన్నది ఈశ్వర్ అభిప్రాయం. ఈశ్వర్ కొంచెం అటు జరగగానే ఎదుటి వ్యక్తి కదలికలో ఏదో తేడా కొట్టొచ్చినట్లు కనపడిందతనికి. ఎదుట ఉన్నది ఎవరో స్పష్టంగా తెలీటంలేదుగానీ ఆ వ్యక్తి కదలికలు సహజంగాలేవు.

ఈశ్వర్ ఒక్కసారి ఎలర్ట్ అయ్యాడు. రవ్వంత వేగంగా ముందుకు జరిగాడు.

అనుకున్నది నిజమే-ఎదుటి వ్యక్తి నీటిలోకి జారిపోతున్నాడు. అంటే ఈశ్వర్‌కు అంత నీటిలోనూ తనకు చెమటపట్టడం స్పష్టంగా తెలిసింది. ఏం జరిగింది? ఏం జరిగి ఉంటుంది?? అనే ఆలోచన తలెత్తినా, ఆ ఆలోచనకు స్వస్తిచెప్పి వేగంగా ముందుకు చేరాడు. ముందున్నది నరసప్ప!!

ఈశ్వర్ నెమ్మదిగా నరసప్ప వెనకకు చేరాడు. ముందుకు వెళ్ళి ఏ చేతులో పట్టుకుంటే దానివల్ల ఇంకా ప్రమాదం ఉంటుందని ఈశ్వర్‌కు తెలుసు. ఒక్కోసారి తాను రక్షించదలచిన వ్యక్తే తనకు ప్రమాదం తెచ్చిపెడతాడు. భయంతో వాళ్లు భల్లూకపు పట్టుపడతారు. అది విడిపించుకోవటం అసలు సాధ్యంకాదు. దాంతో తాము మునిగిపోతూ తమను రక్షించవచ్చినవార్నీ వారు ముంచేస్తారు. అందుకే ఈశ్వర్ నెమ్మదిగా నరసప్ప వెనక్కుచేరి అతని సిలిండర్‌ను అందిపుచ్చుకున్నాడు. సిలిండర్ నరసప్ప వీపుకు ఉంది కాబట్టి సిలిండర్‌ను పైకి లాక్కొచ్చేస్తే కూడా నరసప్ప వచ్చేస్తాడు.

ఈశ్వర్ అంత బరువుతోనూ-నీళ్ళల్లో బరువు తగ్గినట్లు అనిపించినా ఇంకో మనిషిని పైకి లాక్కురావటం కష్టమే గాబట్టి ఈశ్వర్ నెమ్మదిగా పైకి కదిలాడు.

అతనలా నెమ్మదిగా రావటానికి ఇంకో కారణమూ ఉంది - సముద్రంలో ఉన్న అంత ఒత్తిడినుంచి ఒకేసారి ఒత్తిడి తక్కువగా ఉండే ఉపరితలం మీదకు రావటం ఎంతో ప్రమాదం. అందుకే నెమ్మదిగా పైకి రాగానే లక్ష్మీపతికేసి చూస్తూ చేతిని పైకెత్తాడు.

లక్ష్మీపతి కూడా వెంటనే ఈశ్వర్‌కు సాయంగా ముందుకొచ్చాడు. ఒక చేతో పడవకు నాలుగుపక్కలా ఉండే స్టీల్ బార్స్ పట్టుకొన్నాడు, రెండో చేత్తో నరసప్పను పైకిలాగి లక్ష్మీపతికి అందించాడు. లక్ష్మీపతి అతన్ని పైకి లాగుతోంటే ఈశ్వర్ కిందనుంచి నరసప్పను పడవలోకి చేర్చాడు.

"ఏమైంది?" అన్నాడు లక్ష్మీపతి ఆత్రుతతో ఈశ్వర్ పైకి రాగానే.

"ఏమో...బహుశా అలిసిపోయాడు కాబోలు! ఎంతసేపయింది నరసప్ప మునకి?" అనడిగాడు.

లక్ష్మీపతి వాచీకేసి చూసుకొన్నాడు. నాలుగు నిమిషాలు కూడా అయిందో లేదో నరసప్ప మునకి-అదే చెప్పాడు.

"ఈమాత్రానికే అలసిపోరే?" అంటూ ఈశ్వర్ తన డైవింగ్ సూట్ తీసి నరసప్పకేసి నడిచాడు.

ముందుగా నరసప్ప ముఖంమీదకు వంగాడు. గుప్పున సారా వాసన కొట్టింది ఈశ్వర్‌కు. ముఖం పక్కకు తిప్పుకున్నాడు. "వెధవ తాగొచ్చాడు. చావక బతుకుతాడా ఇంక!" అన్నాడు కోపంగా.

"తాగాడా?" అనడిగాడు లక్ష్మీపతి ఆశ్చర్యంతో.

"అవును. మనం మన ధ్యాసలో ఉండి గుర్తించలేదు! వీళ్ళకిబుద్ధి పోతేగానీ దార్లోకి రారు! ఏ పని చెయ్యాలన్నా తాగి తీరాల్సిందే! ఇంకా ఓ పక్క తూర్పున సరిగ్గా తెల్లారలేదుగానీ చుక్కమాత్రం గొంతులో పడాల్సిందే!" అన్నాడు ఈశ్వర్.

అలా విసుగ్గా అంటున్నాడేగానీ ఈశ్వర్ మరో పక్క నరసప్ప ప్రథమ చికిత్సకు ప్రయత్నాలు చేయటం ఆరంభించాడు. సముద్రం మధ్యలోంచి ఒడ్డుకు చేర్చి, అక్కడినుంచి దగ్గర్లో ఉండే ఆస్పత్రికి చేర్చేలోపున ఏదైనా ప్రథమ చికిత్స చేయకపోతే నరసప్ప గుటుక్కుమనడం ఖాయం.

నరసప్పను పడవలో వెల్లకిలా పడుకోబెట్టారు. అతని గుండెలు రవ్వంత ఎత్తుగా ఉండేలాగున కింద ఒత్తు పెట్టారు. ముఖాన్ని కొంచెం దిగువగా ఉండేలాచేసి అతని ముక్కుమూసి, నోటిలోకి నోరు పెట్టి గాలి అతనిలోకి వదలటం ఆరంభించాడు.

"మీరు ఒడ్డుకు నడిపించండి పడవను!" అన్నాడు ఈశ్వర్.

పడవ కదిలింది.

పడవ నడుస్తోంటే ఈశ్వర్ వరసగా నరసప్ప ముఖంలో ముఖంపెట్టి గాలిని అతని ఊపిరితిత్తులలోకి పంపటం ఆరంభించాడు. నరసప్ప ముఖంలోంచి గుప్పున సారా వాసన రావటంతో ఈశ్వర్‌కు కూడా తల తిరుగుతున్నట్లయింది. వాంతి వస్తున్న ఫీలింగు పెరిగింది.

ఎంతో కష్టంమీద ఆ బాధను భరిస్తూ నిమిషానికి పదిహేనుసార్లు నరసప్ప ఊపిరితిత్తులలోకి గాలి కృత్రిమంగా పంపించే ప్రయత్నాలు చేశాడు. నరసప్పలో క్రమంగా చలనం ఆరంభమయింది.

బరువుగా, బాధగా నరసప్ప గాలి పీల్చుకోనారంభించాడు.

ఈశ్వర్ గాఢంగా నిట్టూర్చుకుని పడవలోనే ఓ పక్కకు కదిలి కూర్చున్నాడు.

అతనికి చెప్పలేనంత బాధగా ఉంది. కోపంగా వుంది. ఉక్రోషంగా వుంది. చిన్నచిన్న కష్టాలవల్ల తన ప్రాథమిక లక్ష్యం దెబ్బతినేస్తుందేమోననీ భయం ఆవరించుకుంటోంది.

లక్ష్మీపతి ఏమీ మాట్లాడలేదు. ఈశ్వర్‌ను అలా చూస్తోంటే అతనికి భయంగా ఉంటోంది.

ఎందుకిలా జరుగుతోంది? నిజంగానే ఉమ అన్నట్లుగా ఈ నిధులను ఆవరించుకొని నష్టాలూ ఉంటాయా? ఆ నిధులకోసం ప్రయత్నించేవారిని ఆ




కష్టాలు వెంటాడి వేటాడితీరతాయా? లేకుంటే అవన్నీవట్టి మూఢనమ్మకాలేనా?

తెలీదు.

ఈ ప్రయత్నం పూర్తయితే తప్ప ఏ నిర్ణయానికీ రావటం కష్టం. ఈ ప్రయత్నంలో ఇలాటి కష్టనష్టాలెన్ని వచ్చినా ముందుకు సాగితేనే మంచిది. ప్రయత్నించి మానేయటంకన్నా, ఓడిపోయి చనిపోవటమే మేలనిపించింది లక్ష్మీపతికి.

అతను దృఢంగా నిర్ణయించుకున్నాడు.

ఎగిరిపడుతున్న అలలమీంచి పడవ ఒడ్డుకు చేరింది.

ముందుగా లక్ష్మీపతి దిగి పరుగు తీశాడు. వెళ్ళి గంగుల్ని, ఇంకొందర్నీ తీసుకొచ్చాడు.

అందరూ కలిసి నరసప్పను సాయం పట్టి జాగ్రత్తగా ఒడ్డుకు చేర్చారు.

"తీసుకెళ్ళి ఆస్పత్రిలో చేర్చండి" అన్నాడు ఈశ్వర్ చాలా కోపంగా.

గంగులు వాళ్ళకు నరసప్పను పట్టుకోగానే అంతా అర్థమయిపోయింది.అందుకే ఎవరూ ఏమీ అనలేదు.

నెమ్మదిగా వాళ్లు నరసప్పను ఆసుపత్రికేసి తీసుకెడుతోంటే, ఈశ్వర్ అక్కడే చూస్తూ ఉండిపోయాడు.

ఒక్క నిమిషం తర్వాత ఏమనిపించిందోగానీ, రెండడుగులు ముందుకువేసి ఆగి లక్ష్మీపతిని పిల్చాడు—"మీరూ వెళ్ళండి ఆస్పత్రికి! ఇంకేమీ పర్వాలేదు. కొంచెం కోలుకుంటే సరిపోతుంది. లెట్ హిమ్ టేక్ రెస్ట్! డాక్టరుకు చెప్పండి... ఎంత ఖర్చయినా పర్వాలేదు, మంచి అటెన్షన్‌పే చెయ్యమని" అన్నాడు.

లక్ష్మీపతి తల ఊపి, వెళ్ళి వాళ్ళను కలుసుకొన్నాడు.

ఈశ్వర్ ఒకసారి వెనక్కు తిరిగి చూశాడు. సముద్రం నిర్మలంగా ఉంది. ప్రశాంతంగా ఉంది. సాహసికుల్ని రమ్మని ఆహ్వానిస్తున్నట్టుగా అలలను అల్లాడిస్తోంది.

వెనక్కు తిరిగి ఇంటికేసి నడిచాడు. అప్పటికే నరసప్ప వార్త ఊళ్ళోకి చేరిపోయిందిలా ఉంది. ఉమ మెట్లు దిగుతూ ఎదురొచ్చింది.

"అమ్మయ్య!" అంది ఉమ గుండెల్లో భారం అంతా దిగిపోయినట్లు.

"ఏమిటి! అపుడే నీవరకు వచ్చిందా న్యూస్?" అడిగాడు ఈశ్వర్.

"ఆ ... అందుకే బయలుదేరాను మీకెలా ఉందోనని!"

"నాక్కాదు ప్రమాదం తెలుసా ... అయినా వాడు తాగొచ్చాడు, అందుకే అలా జరిగింది" అన్నాడు ఈశ్వర్, ముందు జాగ్రత్తగా కారణం చెప్తున్నట్లు.

ఉమ అది అర్థంచేసుకుంది.

"కారణం ఏదైనా కానీండి...కానీ నా మాట నిజమవుతోంది చూశారా! చెబితే వినటంలేదు మీరు....ఇలాటివి లాభం తెచ్చేమాట దేవుడెరుగు కానీ నష్టాల్ని మాత్రం తెచ్చితీరతాయి" అంది ఉమ.

"ఉమా ... అర్థంలేని విధంగా మాట్లాడకు! ఐ డోంట్ లైక్ దిస్. ఆఖరిసారి చెప్తున్నా – ఏ నష్టం జరిగినా ఈ ప్రయత్నాన్ని మానుకొనేది లేదు. నేను పోతేనే ఇది మానటం అనుకో" అన్నాడు ఖరాఖండిగా.

ఉమ ముఖం జేవురించుకుపోయింది.

"మీ ఇష్టం...కానీండి! అన్నిటికీ ఆ దేవుడే ఉన్నాడు" అంది ఇంకేమీ చెయ్యలేని నిస్సహాయ స్థితిలో.

అంతలో లక్ష్మీపతి వచ్చాడు. నరసప్ప

కేమీ ప్రమాదంలేదని, ఎటొచ్చీ కోలు కోవటానికి కొంచెం టైం పడుతుందని మాత్రమే డాక్టర్ చెప్పినట్లు చెప్పాడు.

"నాకు తెలుసు ఏ ప్రమాదమూలేదని. వాడు తాగి రాకపోతే ఆ ప్రమాదం వచ్చేదికాదు" అన్నాడు ఈశ్వర్.

"నిజమే...నేనొప్పుకొంటాను. ఇంకో మాట-ఈమాత్రానికే మనం డ్రాప్ అవటంలేదుగదా" అనడిగాడు లక్ష్మీపతి.

"ఆరంభించరు నీచ మానవులు, ఆరంభించి పరిత్యజింతురు మధ్యముల్... కానీ మనం ఆరంభించాం..అంతంచూద్దాం. సరేనా!" అన్నాడు ఈశ్వర్.

లక్ష్మీపతి లేచి, ఈశ్వర్‌కు షేక్ హాండ్ ఇచ్చాడు.

అలా అన్నాడేకానీ ఈశ్వర్‌కు ఎందుకో మళ్ళీ సముద్రం మీదకు వెళ్ళబుద్ధి కాలేదు.

ఉమ అంటున్నది నిజమా? ఇలాటి నిధి నిక్షేపాల వెనుక తప్పనిసరిగా 'చెడు' ఉండే ఉంటుందా? పెద్దిరాజు కుటుంబం నాశనం అయిపోవటంతో ఆరంభమైన కథ తన కుటుంబం వినాశనం కావటం తోనే సమాప్తి కానుందా? లేకపోతే నిక్షేపంగా ఇంట్లో ఆడుకొంటున్న రాణి అలా పాకుతూ పాకుతూ వెళ్ళి నేలబావు




నీటి తొట్టిలో పడిపోవటం ఏమిటి?
నరసప్ప తాగివచ్చి నీళ్ళల్లో ఉక్కిరిబిక్కిరి
అయి తను చావబోయి, తన పీకలమీదకు
ఉరితాడు తేవటం ఏమిటి?? చూస్తోంటే
ఉమ అనేది నిజమే అనిపిస్తోంది. మూఢ
ఆనంద్

నమ్మకం అని కొట్టి పారెయ్యటానికి వీల్లేని విధంగా ఉంటోంది ఇది.

ఈశ్వర్ మనసంతా పాడయిపోయింది. ఉదయమే లేచి నెమ్మదిగా సముద్రం కేసి నడిచాడు.

సముద్రం నిశ్చలంగా లేదు. చిన్న చిన్న అలలతో చిన్నగా కదులుతోంది. అగాధాల అడుగున బడబాగ్నిని దాచుకొని కూడా, పైకి చిరునవ్వులు చిందిస్తున్నట్లుగా నురగలు చిమ్ముతూ ఉండే ఆ సముద్రాన్ని చూస్తోంటే, ఈశ్వర్‌కు అద్దంలో తనను తాను చూసుకొంటున్నట్లుగా అనిపించింది.

తనూ అంతే! మనసులో ఎంత బాధను దాచుకొని పైకి నిశ్చలంగా ఉన్నట్లు కనిపిస్తున్నాడు!

రాణి...తన జీవితంలోకి నెమ్మదిగా వచ్చిన రాణి అలానే వెళ్ళిపోయింది. ఇక్కడ ఈ సముద్రం ముందు నిలబడి చూస్తోంటే ప్రతి నీటి బిందువులోనూ, ప్రతి నురగ, త ర క లో నూ రాణి ఆప్యాయంగా పలకరిస్తున్నట్లుగా ఉంది! ఈ సముద్రం లోతుల్లోకి తాను నిధులకోసం అన్వేషించే ప్రయత్నం చేపట్టడం ఏమిటి? అటు ఇంట్లో సరిగ్గా రెండు బక్కెట్ల నీళ్ళయినా ఉండని నేలబారు తొట్టిలో కూతురు ప్రాణాలు కోల్పోవటం ఏమిటి? జీవితంలోని వైరుధ్యాలకు ఇది ప్రతీకా?

రాబోయే మరిన్ని ప్రమాదాలకు ఇది సూచనా??

ఈశ్వర్‌కు అంతా అయోమయంగా ఉంది.

ఈ ప్రయత్నం చేపట్టి తను ఏం సాధిస్తున్నట్లు ? ఒక్కసారి ఈశ్వర్ తనను తాను ప్రశ్నించుకున్నాడు. తాళికట్టిన భార్య ఉమకు తన సాహసం సంతోషాన్ని అందజేస్తోందా??

లేదు.

పోనీ తనకైనా నిజంగా ఇంత సాధించా అని గర్వంగా చెప్పుకోగల విధంగా సాధించి తీరతానన్న నమ్మకం ఉందా?

అదీ లేదు.

పోనీ లక్ష్మీపతివాళ్ళ పెట్టుబడి అయినా వాళ్ళకు తప్పకుండా తిరిగి ఇవ్వగలనన్న నమ్మకం ఉందా?

అదీలేదు.

మరెందుకు ఈ ప్రయత్నం చేపట్టినట్లు? చేపట్టి ఏం సాధిస్తున్నట్లు? సాధించి ఎవర్ని ఉద్ధరిస్తున్నట్టు??

కేవలం ఆత్మతృప్తికోసం అనుకోవటం అర్థంలేని వాదం. ఎంతటి మూల్యం చెల్లించాల్సివస్తోంది తన తృప్తికోసం? నిజంగా అంతటి మూల్యం చెల్లించాల్సినంత అవసరం ఉందా??

సముద్రం ఆహ్వానిస్తున్నట్లున్నా, ఆ ఆహ్వానంవెనక తనకోసం ఆపదల్ని పోగుపోసివుంచిందా?? ఉమ అనేది, భయపడేది అక్షరాలా నిజంకానుందా?? మరెందుకు ఈ మధనంలోకి దిగి తను మధనపడటం??

ఇంకా ఎంత నష్టపోవాల్సివుంది తను? సముద్రం లోతుల్లో వెతికి తాను నిధుల్ని బెలికితీయగలడేమోగానీ..... ఇ ప్ప టి కే శాశ్వతంగా దూరమయిన రాణిని దగ్గరకు తెచ్చుకోగలడా ? దానికితోడు మానసికంగా ఉమ కూడా దూరం అయిపోతోందా? ఇంత నష్టపోయి చేపట్టాల్సిన కార్యమా ఇది?

ఈశ్వర్ ఇసుకమీద పిచ్చిగీతలు గీస్తూ ఉండిపోయాడు. ఏమీ నిర్ణయించుకోలేని సందిగ్ధ మానసికస్థితి అది.




కానీ చాలాసేపటి తర్వాత ఈశ్వర్ నిర్ణయించుకొన్నాడు. ఇక తను...తను వెళ్లడు ఈ సముద్రంమీదకు! ఇప్పటికి చవిచూసిన చేదు అనుభవాలు చాలు... ఇక కోరుకోడు తను మళ్లీ అలాటి అనుభవాలు!!

ఈశ్వర్ లేచి ఇంటికి నడిచాడు.




ఇల్లు సమీపించబోతోంటే ఇంటి ముందో కారు ఆగివుండటం చూసి ఈశ్వర్ ఆశ్చర్యపోయాడు. ఎవరు వచ్చి ఉంటారు తనకోసం??

అడుగులు వడివడిగా వేశాడు.

ఇంట్లోకి వచ్చేసరికి అప్పటికే ఆ వచ్చిన నలుగురూ టీ తాగిన గుర్తుగా ఖాళీ కప్పులు కనిపించాయి. అంటే వాళ్ళు వచ్చి చాలాసేపే అయినట్లుంది. ఉమ వాళ్ళకు తగిన అతిథి మర్యాదలూ చేసినట్లుంది. ఇంతకూ ఎవరు వాళ్ళు? ఎవర్నీ ఇంత క్రితం చూసిన గుర్తురాలేదు ఈశ్వర్‌కు.

నెమ్మదిగా లోపలకు నడిచాడు.

"అదిగో...ఆయన రానేవచ్చారు!" అంది ఉమ చెప్తున్నది ఏదో ఆపుతూ.

వచ్చిన నలుగురూ లేచి నిలబడ్డారు గౌరవమర్యాదల సూచకంగా.

"వీళ్లు...మీకోసం వచ్చారు. ఏదో మాట్లాడాలిట" అంది ఉమ పరిచయం చేస్తున్న పద్ధతిలో.

నలుగుర్నీ పరిశీలనగా చూశాడు ఈశ్వర్. ఒక్కొక్కరూ ఒక్కొక్క రకమైన దుస్తులలో ఉన్నా అందరిలోనూ ఒకే రకమైన ఆసక్తి ఉండటం ఈశ్వర్ గమనించాడు. అందరూ తనవైపే ఆసక్తిగా చూడటానికి కారణమూ గ్రహించాడు. చిన్నగా పలకరింపుగా నవ్వాడు.

"నమస్కారం.నాపేరుసోమసుందర్. మీ గురించి విన్నాం. పేపర్లో కూడా మీరిచ్చిన ఇంటర్వ్యూ చదివాం. ఆవిషయం మాట్లాడాలనే వచ్చాం" అన్నాడు అందులో ఒకతను.

"మీరు కూడా ఏదైనా ఇంటర్వ్యూ కోసమా వచ్చింది?" అనడిగాడు ఈశ్వర్.

సోమసుందర్ నవ్వాడు. "అబ్బే... కాదండీ..." అని ఆగిపోయాడు.

"మరి చెప్పండి....మీ రొచ్చిన పనేమిటో?'' అన్నాడు ఈశ్వర్. అలా అనటం అంత భావ్యంగా ఉండదని పించినా.

"మీరేమీ అనుకోకపోతే అడుగుతాం. మీ పరిశోధనలు, మీ ట్రయల్స్ ఎంత వరకూ వచ్చాయి?''

ఈశ్వర్‌కు నవ్వొచ్చింది – ఈ పత్రికలవాళ్ల పద్ధతే ఇంత! పనేమీ లేదంటారు. అడగాల్సిందేమీ అస్సలు లేదంటారు. కానీ క్రమంగా కూపీ లాగేస్తారు. అన్ని విషయాలూ తెలుసుకొంటారు. ఆ తర్వాతనే సెలవుపుచ్చుకొంటారు–వీళ్లు ఇంకా ఘోరం! ఏకంగా తాము పత్రికలవాళ్లమేకామని చెప్పి ప్రశ్నలు మొదలుపెట్టారు!

అదే అన్నాడు ఈశ్వర్.

"అరరె...మీరలా అనుకొంటే మాదే పొరపాటు. నిజాన్ని మేమే మీకు సరిగ్గా చెప్పాల్సింది... చెప్పనేలేదు! ఇపుడు

మాత్రం నష్టమేమిటి..." అంటూనే ఆగిపోయాడు సోమసుందర్ మళ్లీ.

ఈశ్వర్ నెమ్మదిగా అన్నాడు - "సర్లెండి...మీరెందుకు అడిగితే నాకేం కానీ నిజం చెప్తున్నాను... ఇదింకా ఓ కొలిక్కిరాలేదు. మాకు ఆ పడవ ఎక్కడ మునిగిపోయిందో కూడా తెలీదు. బయలుదేరింది ఇక్కడ. వెళ్తున్నది రంగానికి. అదే రంగూన్‌కు అని మాత్రమే తెలుసు. సాధారణంగా ఇలాటి పడవలు ఏవైనా మొదటి కొద్ది దూరంలోనే దెబ్బతినే ప్రమాదం ఉంది గనుక ఆ కొద్దిదూరాన్నే వెతకాలని నిర్ణయించుకొన్నా! ఆ పద్ధతి ప్రకారమే ఇన్నాళ్ళూ ప్రయత్నించాను"

సోమసుందర్ ముఖంలో ప్రశ్నార్థకం తలెత్తింది- "ఇన్నాళ్ళూ అంటున్నారు అంటే..."

"అంటే... ఇకపైన ఆ ప్రయత్నం చెయ్యటం ఇష్టం లేదని, నేను విరమించుకొంటున్నానని చెప్తున్నాను"

గదిలోని అందరూ వులికిపడ్డారు. వచ్చిన నలుగురూ ఒకరి ముఖం ఒకరు చూసుకొన్నారు.

"మీరనేది మాకు అర్థంకావటంలేదు" అన్నాడు సోమసుందర్.

"ఎందుకో... నాకు ఈ ప్రయత్నం విజయవంతం కాదేమోనన్న సందేహం పెరుగుతోంది. ఒక్కొటిగా నష్టాలే ఎదురవుతున్నాయి నాకు! అందుకే - నష్టాలు మరీ పెరిగి నేను నాశనం కాకముందే ఈ ప్రయత్నాలు విరమించుకోవాలని నిర్ణయించుకొని...."

"అయితే మీరు ఇక ఈ సాల్వేజ్ ప్రయత్నం..."

"డ్రాప్‌చేసుకొంటున్నట్లే లెక్క"

సోమసుందర్ దీర్ఘంగా నిట్టూర్చాడు. క్షణం ఆగి అన్నాడు- "బహుశా మేం బయలుదేరిన వేళావిశేషం మంచిది కాదనుకొంటా!"

"ఏం...?అసలు ఇంతకూ మీరెందుకు వచ్చారో అడిగానుకాను నేను" అన్నాడు ఈశ్వర్.

"ఇదిగో...ఇతని పేరు సురేంద్ర.ఇంత క్రితం గోవాలో ఉన్న ఓషియానోగ్రఫీ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్‌లో పనిచేసేవాడు. మంచి డైవర్. అతన్ని మీరేమైనా మీ దగ్గర సహాయకుడుగా తీసుకుంటారేమోనని అడిగేందుకు వచ్చాం! మీకు తెలుసోలేదో గానీ మేం దాదాపు ఏడాది కిందట అన్ని పేపర్లలోనూ ఒక ప్రకటన ఇచ్చాం- పాత కాలపు ఓడలు, నౌకలు మునిగిపోయినట్లు ఎవరికైనా తెలిస్తే తెలియజెయ్యమని. కానీ ఎవరూ మా ప్రకటనకు సరైన సమాధానం ఇచ్చారు కారు! ఆఖరికి మీ గురించి విని..." సోమసుందర్ ఆగిపోయాడు.

"మీరు ఎందుకా ప్రకటన ఇచ్చినట్టు?" ఆసక్తితో అడిగాడు ఈశ్వర్.

"ఈ సాల్వేజింగ్ బిజినెస్‌లోకి దిగుదాం అని అనుకొన్నాం మేం! మేం నలుగురమూ కలిసి పెట్టుబడిపెట్టి ఈ వ్యాపారం పెడదామనుకొన్నాం. ఈ దేశంలో కొత్తగా ఏ వ్యాపారం పెట్టినా నిలదొక్కుకోగలమనే మా నమ్మకం. కానీ ఏది ఆలోచించినా అన్నీ పాతగానే అనిపించాయి. ఆఖరికి ఇది తట్టింది. పైగా మాకు ఈ సురేంద్ర సాయం వుండనే ఉంటుందనుకొన్నాం! కానీ...."

"మరి ఎందుకు విఫలమయినట్లు?" అనడిగాడు ఈశ్వర్.

"కారణాలు చాలా ఉన్నాయి. కానీ వాటిలో ముఖ్యమైంది ఒకటే-ఈ దేశంలో




ఎక్కడ ఏ నౌక మునిగిపోయిందో మాకు తెలిసిందికాదు" అన్నాడు సోమసుందర్.

ఈశ్వర్‌కు ఆశ్చర్యంగా అనిపించింది. "అదేమిటి? గోవా ఇన్‌స్టిట్యూట్ ఇలాటి ప్రాజెక్టులు కొన్ని చేపట్టింది గదా...! మద్రాస్ ప్రాంతంలో మునిగిపోయిన డ్యూక్ ఆర్కియన్స్, మెరీజర్ ట్రూడో, వైన్ ఆమీ అనే ఫ్రాన్సు నౌకలు, క్రిస్టోవాగీ అనే పోర్చుగీస్ నౌకా, మహదేవ్‌పాల్ అనే మనవాళ్ళ యుద్ధనౌకా...ఇలా చాలా ఉన్నాయి గదా సముద్రం పాలైన నౌకలు... వాటిని పైకి తీయాలని గోవా సంస్థ తలపెట్టింది గదా...!"

సురేంద్ర అవునన్నట్లు తల వూపాడు. అంత సేపటి వరకు వచ్చింది నలుగురైనా, మాట్లాడిందంతా సోమసుందర్ ఒక్కడే సన్న సంగతి గుర్తురాగానే ఈశ్వర్‌కు ఆశ్చర్యంగా అనిపించింది.

"మీరన్నది నిజమే! కానీ అవన్నీ అప్పటికే వాళ్ళు చేపట్టిన ప్రాజెక్టులు కావటంతో మాకు పర్మిషను లభించలేదు. కొత్తగా ఏదైనా నౌక మునిగిపోయిన సంగతిని వాళ్ళ దృష్టికి తెస్తే, దాని సాల్వేజ్‌కు అనుమతి ఇస్తామని చెప్పారు వాళ్ళు"

అయితే అదన్నమాట తనకు ఈ విషయంలో అతి సులభంగా అనుమతి రావటానికి కారణం - అనుకొన్నాడు ఈశ్వర్.

"అందుకే మేం పత్రికల్లో ప్రకటనలు ఇచ్చాం. కానీ ఫలితం లేకపోయింది. ఇక అది లాభంలేదనుకొని, సురేంద్రను మీ దగ్గర చేర్చాలని వచ్చాం. కొంత ట్రైనింగ్ లాగా ఉంటుంది. ఇంకొంచెం మేమూ కొంత నేర్చుకోగలుగుతాం" ఆగాడు సోమసుందర్.

క్షణంఆగి అన్నాడు ఈశ్వర్-"సారీ. నేను నా ప్రయత్నం విరమించుకోవాలనే నిర్ణయించుకొన్నా! కానీ, ఒక్కటి... లక్ష్మీపతిగారని ఈ ప్రాజెక్టుకు ఇంత కాలమూ ఫైనాన్స్ చేసిన వ్యక్తి ఒకాయన ఉన్నారు. ఆయనకు చెప్పి, కావాలంటే ఏదో కొంత మొత్తానికి ఈ ప్రాజెక్టును మీ పరం చేయిస్తాను"

మొదట సోమసుందర్ తెల్లబోయినట్లు చూశాడు. ఆ తర్వాత సర్దుకొంటూ అన్నాడు – "అదయితే మరీ మంచిది. మేం ఏకంగా వ్యాపారంలోకే దిగొచ్చునన్నమాట. మీరు లక్ష్మీపతిగారితో మాట్లాడుదురుగాని..." సోమసుందర్ అలా అని అంటుండగానే ఉమ ఆ గదిలోకి వచ్చింది.

"మిమ్మల్నే! ఒక్కసారి మాట..." అంటూ ఈశ్వర్‌ను పిల్చింది.

ఈశ్వర్ ఉమ దగ్గరకు వెళ్లాడు.

"ఏమిటి మీరంటున్నది?" అంది ఉమ.

"అవును ఉమా...నువ్వన్నదే నిజం. ఆలోచిస్తోంటే అనిపిస్తోంది- సుఖాన ఉన్న ప్రాణాన్ని దుఃఖాన వేసుకొన్నానని! జరిగిన నష్టం చాలు, ఇకనైనా కోలుకుందామని ఆలోచిస్తున్నాను" అన్నాడు ఈశ్వర్.

ఉమ తీవ్రంగా చూసింది భర్తకేసి. "అర్థంలేకుండా మాట్లాడకండి. తెలివి తక్కువగా నేనేదో అని వుంటాను ఎందుకొచ్చిన బెడద ఇది అని. అంతమాత్రానే మీరుకూడా దానికి ఊకొట్టడం చాలా బాగుంది! ఇలాటి అర్థంపర్థంలేని ఆలోచనలు పెట్టుకోకండి! పొరపాటు నావల్లే జరిగిఉంటుంది. మాట తూలి వుంటాను.

అంతమాత్రాన మిమ్మల్ని ఆ ప్రాజెక్టు వదిలెయ్యమని కాదు!''

"కానీ ఉమా..."

"కానీ లేదు ఏంలేదు...నేను ఇంతక్రితం ఏదైనా అని వుంటే అదంతా మర్చిపొండి. జరిగిన నష్టం ఏదైనా ఉంటే అది జరిగేపోయింది. దాన్నిపుడు మనము నివారించుకోనూలేం, తప్పించుకోనూలేం! మరింకెందుకు ఇంకా వెనకడుగు? చెయ్యాల్సిన తప్పు మీరు ఈ ప్రాజెక్టు చేపట్టిన రోజునే జరిగిపోయింది. నో...ఇపుడు మీరు వెనక్కు తగ్గే ప్రశ్నే లేదు. ఆఖరికి దీనికి నా ప్రాణంఅయినా సరే ఖరీదుగా చెల్లించాల్సి వచ్చినాసరే మీరుమాత్రం మానే ప్రసక్తే లేదు'' అంది ఉమ ఖరాఖండిగా.

"కాని నువ్వు..."

"అవును. నేనే ... నేనే తప్పుచేశాను. మిమ్మల్ని పొరపాటున వెనక్కు లాగినట్లున్నాను. ఆ పొరపాటు నాదే. కానీ దానివల్ల మీరింతగా పిరికిపందలయిపోతారని నేను ఊహించలేదు. ఇంకా జరిగినది ఏదీలేదు. మీరుమాత్రం ఈ ప్రాజెక్టును కంటిన్యూ చేస్తున్నారు. వాళ్ళకి వీళ్ళకూ ఇచ్చే ప్రశ్నేలేదు'' అంది ఉమ.

అలా అంటూనే ముందు గదిలోకి వచ్చింది. "సారీ అండీ...ఆయన అలా అన్నారుగానీ అది జరిగేపని కాదు. మేమి ప్రాజెక్టును డ్రాప్‌చేసుకోవటంలేదు. మీరు వెళ్ళొచ్చు'' అంది ఉమ ఉన్నట్టుండి.

ఈశ్వర్ ఆ షాక్‌నుంచి తేరుకునేసరికి ఇంటిముందునుంచి ఆకారు వెళ్ళిపోయింది.

* * *

'మర్నాడు ఉదయం ఈశ్వర్‌ను ఉమే నిద్రలేపింది.

"ఏమిటీ...లక్ష్యం, ఆదర్శం, సాహసం అంటూ ఇన్నికబుర్లు చెప్పారు. అన్నీ ఏగాలికి ఎగిరిపోయాయి?'' అంటూ వేళాకోళం ఆడింది.

ఈశ్వర్ నిర్లిప్తంగా తల ఊపాడు – "ఎందుకో ఉమా! వెళ్ళాలనిపించటం లేదు. నీమాటలు నామీద బలంగా పని చేశాయి. మళ్ళీ ఆ ప్రయత్నం చేస్తే ఏం నష్టపోతానో అన్న భయం పట్టుకొంది నాకు'' అన్నాడు.

ఉమ నవ్వేసింది – "కోపంలో లక్ష అనుకొంటాం. అంతమాత్రంచేత అవన్నీ నిజమనుకొంటే ఎలా? జరగాల్సిన నష్టం జరిగింది...ఇంకేమీ జరగదు. అయినా మీరు సముద్రంలో అన్వేషణకు వెళ్ళటానికి, ఇక్కడ నా నిర్లక్ష్యం వల్ల పాప పోవటానికి ఏం సంబంధం ఉంది చెప్పండి! నా పిచ్చికొద్దీ ఏదో అన్నానుగానీ..." ఉమ అంటున్న మాటలు కేవలం పైపైనుంచి అంటున్నవేనని ఈశ్వర్‌కు తెలుసు. కూతుర్ని పోగొట్టుకున్న ఆ తల్లి మనసు ఈశ్వర్‌కు లీలగానైనా అర్థం అవుతోంది.

ఉమ అలా అంటూంటే ఏం అనాలో తెలీలేదు ఈశ్వర్‌కు. నెమ్మదిగా లేచాడు. అడుగులో అడుగువేసుకొంటూ నడవటం ఆరంభించాడు.

"నమస్కారం'' ఎవరో పలకరిస్తున్నట్లుగా అనిపించి తల తిప్పి చూశాడు ఈశ్వర్. ఎదురుగా సురేంద్ర!!

"ఓ మీరా... నమస్కారం'' అని క్షణం ఆగి అన్నాడు– "నిన్న జరిగిన సంఘటనకు నేనెంతో బాధపడుతున్నాను. నా ప్రమేయం లేకుండా జరిగిపోయిందది! సారీ..ఏమీ అనుకోవద్దు'' అన్నాడు ఈశ్వర్.

"ఇట్సాల్‌రైట్! మీరు నా గురించి ఏమీ చెప్పారు కాదు!" అన్నాడు సురేంద్ర.

క్షణం ఆగాడు ఈశ్వర్ "ఓ అదా! మీకు తెలీదుగానీ, నేనుకూడా డైవర్స్ కావాలని ప్రకటనలు వేయించాను. ఒకసారి రంగులు అనే డయర్ వచ్చాడు. రెండో సారి డ్రైవర్ ఒకడు వచ్చాడు. మన పత్రికల్లో అచ్చుతప్పులమీద వాళ్ళకు ఎంత నమ్మకమో అనిపిస్తుంది నాకు"

సురేంద్ర నవ్వాడు.

"ఆ ప్రకటన సంగతి నాకు తెలీదు. మీరుగనుక ఈ అంటే ఇపుడు చేరటానికి నేను సిద్ధం!"

"ఈ అనటం ఏమిటండీ, పేపర్లో ప్రకటన చేశాను అని చెప్తే...నేను మీకు ఆరోజునుంచే స్వాగతం చెప్పినట్లే లెక్క!" అంటూ ఈశ్వర్ తనున్న సందిగ్ధ మానసిక పరిస్థితి గురించి చిన్నగా వివరించి చెప్పాడు.

అంతా విన్నాడే తప్ప సురేంద్ర ఏమీ జవాబివ్వలేదు, ఏమీ వ్యాఖ్యానించనూ లేదు.

నడుచుకొంటూ వచ్చేసరికి దూరం నుంచి సముద్రం హోరు వినపడసాగింది.

"మీరీ ప్రాజెక్టు ఎలా చేపట్టారు? ఎవరు చెప్పారు మీకిక్కడ ఈ పడవ మునిగినట్లు?" సురేంద్ర ఆసక్తితో అడిగాడు.

ఈశ్వర్ జరిగిందంతా టూకీగా చెప్పాడు. అందర్నీ ఒప్పించి, అందరి దగ్గర పర్మిషన్లు తీసుకొని ఆఖరికి ఎలా ఆరంభించాడో అదీ చెప్పాడు.

"చాలా శ్రమే పడ్డారు!" అన్నాడు సురేంద్ర అంతా విని.

సురేంద్రను లక్ష్మీపతికి పరిచయం చేశాడు ఈశ్వర్. కాని నిన్న ఇంట్లో జరిగిన సంఘటన మాత్రం చెప్పలేదు.

"వెరీగుడ్! మనకిలాంటి ప్రొఫెషనల్ దొరికితే బాగుండును అనుకొన్నాంగదా... అదే ఇపుడు జరిగింది. ఇక మనం విజయం సాధిస్తామనే నా నమ్మకం" అన్నాడు లక్ష్మీపతి మరీ ఉత్సాహంగా.

అయితే, లక్ష్మీపతి ఊహించింది ఒకటైతే జరిగింది మరొకటి—ఆరోజురాత్రి అంతవరకు తాము అన్వేషించిన ప్రదేశాలు ఒక్కొక్కటిగా గుర్తుపెట్టుకొంటూ, ఇంకా ఎక్కడెక్కడ తాము ప్రయత్నించాలో అన్నీ వివరంగా చర్చించుకొన్నారు.

రాత్రిబాగా ఆలస్యం అయిపోయిందని సురేంద్ర ఆరోజు అక్కడే ఉండిపోయాడు.

లక్ష్మీపతికి రాత్రివేళ ఎందుకో మెలుకువ వచ్చి చూసేసరికి సురేంద్ర పడుకొన్న గదిలో ఏదో అలికిడి వినిపించింది.

తలుపు తీసుకొని లక్ష్మీపతి బయటకు వచ్చాడు.

సురేంద్ర ఏవేవో కాగితాలు, మాపులు దగ్గర పెట్టుకొని ఉన్నాడు. లక్ష్మీపతిని ఉన్నట్లుండి అలాచూడటంతో ఉలికిపడ్డాడు సురేంద్ర. అయినా లక్ష్మీపతి అది గమనించేలోపునే ముఖకవళికల్ని మార్చుకొని నవ్వాడు సురేంద్ర.

"ఏమిటి...ఏం చేస్తున్నారు?"

సురేంద్ర ఒకసారి తను ఉన్న పరిస్థితిని చూసుకొన్నాడు. ఎదురుగా ఎన్నో మాపులు... ఎన్నో కాగితాలు...ఇవన్నీ తను ఏం చేస్తున్నాడో స్పష్టంగా చెప్పేస్తూనే ఉన్నాయి. ఇంత సాక్ష్యం ఎదురుగా ఉండగా ఇంక అబద్ధం చెప్పినా నిలబడదు.

"నిద్రపట్టడం లేదు. కొత్త చోటు గదా ... అందుకే ఈ చార్ట్స్ అవీ చూస్తున్నాను" అన్నాడు సురేంద్ర.

లక్ష్మీపతి నవ్వాడు. "గుడ్! అపుడే




పనిలో పడ్డారన్న మాట! పనిమీద ధ్యాస అంటే ఇలా ఉండాలి" అన్నాడు అభినందన పూర్వకంగా.

సురేంద్ర నవ్వాడు జవాబుగా.

"మరీ అంత శ్రమపడకండి! అంతా ఒకేరోజు సొంతంచేసుకోవాలనే తత్వం అంత మంచిది కాదు. ఈరోజు కాకపోతే రేపు...రేపు కాకుంటే ఎల్లుండి...ఆ నిధిని కనుక్కోగలం! అది మనదే" అన్నాడు లక్ష్మీపతి.

"ఎవరికి వాళ్ళు ఆ నిధి తమదేనన్న ధ్యాసతో పనిచేస్తే తప్ప దాన్ని కనుక్కోగలగడం జరిగే పని కాదు" అన్నాడు సురేంద్ర.

"నిజమే!" అంటూ లక్ష్మీపతి వెనక్కు వచ్చి తన గదిలో నిద్రలోకి జారుకొన్నాడు.




మర్నాడు— మళ్ళీ అన్వేషణ ఆరంభం అయింది. సముద్రం మీద ఎండ చుర్రుమంటోంది. అలల మీద ఆ ఎండ తళతళ మని మెరుస్తోంది. ఆ అలల మీద పడవ నెమ్మదిగా ముందుకు సాగింది.

పడవ నడుస్తున్నంత సేపూ ఈశ్వర్ సురేంద్రను గమనిస్తూనే ఉన్నాడు. సురేంద్ర తన పని విధిలో తనకు తెలుసున్న పద్ధతిలో, నైపుణ్యంతో మాస్క్ వేసుకొన్నాడు. గేర్ పెట్టు కొన్నాడు. డైవ్ చెయ్యడానికి తగినంత కొన్నాడు. ఎప్పుడు ఆజ్ఞ లభిస్తే అప్పుడు నిప్పులోకి దూకమంటే దూకటానికి సిద్ధంగా ఉండే సైనికుడిలాగా రెడీగా ఉన్నాడు సురేంద్ర.

అతని పద్ధతి ఈశ్వర్‌కు నచ్చింది.

'ఈమాత్రం నైపుణ్యం ఉన్నవాడు లభిస్తే ఇంకేముంది ఏదైనా సాధించగలం' అనుకొన్నాడు ఈశ్వర్.

డైవింగ్ ప్లాట్‌ఫారమ్ మీదనుంచి నీళ్ళలోకి దూకాడు ఈశ్వర్. నీళ్ళలోకి మాకే దూకగానే ఈశ్వర్‌కు ఎందుకో చెవులన్నీ నెప్పిగా అనిపించాయి. చిన్నగా ఆపలించే ప్రయత్నం చేశాడు. ఆ ప్రయత్నంవల్ల చెవి నెప్పి తగ్గలేదు కానీ, కంటికి పైన నెప్పి ఆరంభం అయింది. 'ఎందుకిలా అవుతోంది?' అనుకొన్నాడు. పైకి 'వదిలితే' అనిపించింది. పడవమీదకు వెళ్ళి రవ్వంత సేపు విశ్రాంతి తీసుకొంటే తప్ప ఈ ఫీలింగ్ పోయేలా లేదు అనుకొన్నాడు ఈశ్వర్.

అలా అనుకొంటూనే పైకి మూవ్ అవబోయే సమయంలో పక్కనే ఏదో కదిలినట్లయింది.

ఒంట్లోంచి శక్తి అంతా దగ్గరకు చేర్చుకొని క్షణం ఆగి అటుకేసి చూశాడు ఈశ్వర్. అంతా నీళ్ళమయం. పైనుంచి ఎండవల్ల లోపల నీళ్ళన్నీ ఆకుపచ్చ రంగుతేలి ఉన్నాయి. ఆ అతి పలచని కాంతిలో ఈశ్వర్‌కేమీ కనిపించలేదు.

ఈశ్వర్ మళ్ళీ పైకి వెళ్ళాలని ఆలోచించ గానే, మళ్ళీ ఏదో కదలిక..

ఈశ్వర్ అటు చూసేసరికి మళ్ళీ అక్కడేమీ లేదు.

ఆ 'కదలిక' ఈసారి ఎటు ఉంది వచ్చిందని అనుకొంటూ ఈశ్వర్ అటుకేసి

చూశాడు. అటువైపునే–ఆ పల్చటి కాంతిలో సైతం నెమ్మదిగా కదులుతూ, అతి అందంగా మెరుస్తూ ... ఒక సొరచేప! ఎంతో నిబ్బరంగా, ధైర్యంగా, ఏమాత్రం కంగారులేనట్లుగా, అర్ధ చంద్రాకారంలో ఉండే తోకను వయ్యారంగా తిప్పుకొంటూ వస్తోందా సొరచేప!

ఈశ్వర్‌కు ఒకసారి గుండెలవిసి పోయాయి. సొరచేపల్ని నీళ్ళల్లో ఎదుర్కోవటం కష్టం. వాటికి అక్కడ స్వాసబలిమి కూడా ఉంటుంది. పైగా ఎదురుగా కనిపించేది ఎంత ఉందో అసలు?

ఎలా అంచనా కట్టాలి? ఆ నీళ్ళల్లో దాని పొడవు అంచనా వేసేందుకు సైతం వీల్లేని విధంగా ఉంది. పైగా అదసలు ఎంత దూరంలో ఉంది? ఇరవై అడుగుల్లోనా? ముప్పయి అడుగుల్లోనా? యాభై అడుగుల దూరంలో కూడా అయి ఉండొచ్చు. నీళ్ళల్లో ఆ దూరాన్ని అంచనా వెయ్యటం కూడా కష్టమే!

ఆ సొరచేప అంత దూరంలోంచే అందంగా వయ్యారాలు పోతున్నట్లుగా వంపులు తిరుగుతోంది. పైనుంచి పడుతున్న సూర్యకాంతి ఆ సొరచేప మీద అందంగా మిలమిలలాడుతోంది. ఆ వెలుగులోనే ఆ సొరచేప ఒంటిమీద సన్నటి గీతలు చూశాడు ఈశ్వర్ – గోధుమ, బూడిద రంగులు కలిసినట్లున్న ఆ వింత రంగులో దట్టమైన గోధుమరంగులో ఉన్న గీతలవి! ఆ సొరచేప ఒంటికన్నుతో ఓరగా తన కేసి చూస్తున్నట్లుగా అనిపించింది ఈశ్వర్‌కు.

కానీ ఆ సొరచేప చూపులో ఏ ఆసక్తి లేదు. అతి నిర్లిప్తంగా ఉన్నట్లుంది ఆ చూపు. ఇపుడు పైకి వెళ్ళటమంటే ప్రమాదాన్ని కొనితెచ్చుకోవటమే అవుతుంది అనుకుంటూ ఈశ్వర్ చిన్నగా కిందకు జారాడు.

చెవిలో నెప్పి క్రమంగా పెరుగుతోంది. తలనెప్పి, కణతల మధ్య పోటు కూడా పెరుగుతోంది.

అయినా మొండిధైర్యంతో ఈశ్వర్ తిన్నగా 'నేలను' తాకాడు. కాలికింద ఏదో గుండ్రంగా...పొడుగ్గా ఉన్నట్లు అనిపించింది. అంత బాధలోనూ ఈశ్వర్ కిందకి వంగాడు. దాన్ని అందుకున్నాడు. ఏదో తెలేటంలేదుగానీ చిన్న సైజు గొట్టంలా ఉందది.

ఇంకా ఆ లోతుల్లో వుంటే తల పగిలి పోతుందన్న భయం పెరిగింది ఈశ్వర్‌కు. ఏమైతే అవనీ అనుకున్నట్లుగా ఈశ్వర్ క్రమంగా పైకి కదిలాడు.

ఈసారి అతనికి ఎక్కడా సొరచేప ఉనికి కనిపించలేదు.

ఈశ్వర్ తిన్నగా పడవ దగ్గరకు వచ్చాడు. పైనుంచి లక్ష్మీపతి అతన్ని అందుకున్నాడు. పడవమీదకు వస్తూంటే చూశాడు ఈశ్వర్ తన చేతిలో ఏముందో– అదొక ఆర్టిలరీ షెల్!?

· యుద్ధంలో ఉపయోగించే షెల్ అది. సముద్రం లోతుల్లో కూరుకుని వుంది.

"ఏమిటిది?" అనడిగాడు లక్ష్మీపతి ఆసక్తితో.

"షెల్...ఆర్టిలరీ షెల్!"

''ఇది దొరికిందా లోపల?'' అనడిగాడు వేళాకోళంగా లక్ష్మీపతి.

''అవును...ఏం? ఇదైతే మాత్రం డబ్బు కాదా?'' అన్నాడు నవ్వుతూ ఈశ్వర్.

"ఏది ... ఇదా?" అంటూ పకపక నవ్వాడు లక్ష్మీపతి.

"అవును..ఇదే. దీన్ని ఇలాగే అమ్మితే కొనేవాడు ఎవడూ ఉండడు గానీ, దీన్ని

శుభ్రం చేసి, పైఇత్తడి ముక్కలు అమ్మితే ఎవరైనా కొంటారు" అన్నాడు ఈశ్వర్.

"శుభ్రం చెయ్యటండేనికి? అలా అమ్మేస్తే సరి!"

"అమ్మో..ఎంతకాలం పాతదైనా ఇది ప్రమాదకరమే" అని ఈశ్వర్ ఆ షెల్ కున్న లాక్‌ను రెంచ్‌తో విడగొట్టే ప్రయత్నంచేశాడు. ఎంతో కాలంనుంచీ నీళ్ళల్లో మునిగి ఉండటంతో అదసలు కదలలేదు. "బాగా బిగుసుకుపోయింది" అంటూ ఈసారి కాళ్ళను గట్టిగా షెల్‌కు అణచిపెట్టి, రెంచ్‌ను రెండు చేతులతోను నొక్కిపెట్టి తీసే ప్రయత్నం చేశాడు. ఆ ప్రయత్నంలో అతనికి మళ్ళీ చిన్నగా తలనొప్పి పెరిగినట్లుగా అనిపించింది.

ముఖం అంతా ఎర్రగా కందగడ్డలా అయిపోయింది. క్షణం ఆగి మళ్ళీ ఇంకోసారి ప్రయత్నం చేశాడు ఈశ్వర్. ఈసారి కొంచెం కదిలింది అది. క్రమంగా షెల్‌కున్న సీలు ఊడింది. కిందవున్న స్క్రూ విప్పి దాన్ని పక్కన పెట్టాడు.

"చూడండి లోపల ఎలావుందో" అన్నాడు ఈశ్వర్.లక్ష్మీపతి షెల్‌లోపలికి చూశాడు. లోపల బూడిదరంగులో ఉన్న పెన్సిళ్ళలాటివి వరసగా పేర్చి పెట్టినట్లుగా ఉంది.

ఈసారి ఈశ్వర్ ఆ వరసలోంచి ఒకటి తీశాడు. మిగిలినవాటిని బాగా దూరంగా తోశాడు. చేతిలో ఉన్నదాన్ని పట్టకారుతో పట్టుకొని,అగ్గిపెట్టె లక్ష్మీపతికి అందిస్తూ అన్నాడు - "దీన్ని అంటించండి!"

"ఏమిటిది?"

"దీన్ని 'కోర్డైట్' అంటారు. అంటిస్తేచాలు, ఇది పేలుతుంది"

లక్ష్మీపతి ఈశ్వర్ చెప్పినట్లే దాన్ని అంటించాడు. ఒక మెరుపులా మెరిసింది. తర్వాత మన దీపావళి సామానుల్లో వుండే మెగ్నీషియమ్ తీగ మండేటపుడు వచ్చే వెలుగు వచ్చింది.

"ఇంతే? షెల్ అంటే ఇదేనా?"

"ఇంతేనా? ఇలాటివి ఒక వందను కలిపి ఒకచోటపెట్టి, నిప్పుపెడితేచాలు - ఒక పెద్ద నగరానికి నగరమే హుష్‌కాకి అయిపోతుంది. తెలుసా?" అంటూ కాలిపోయిన ఆ కోర్డైట్‌ను నీళ్ళమీదకు విసిరాడు. నీళ్ళనుతాకగానే అది 'జుయ్యి' మంటూ శబ్దంచేసి, నీళ్ళలోకి మునిగిపోయింది. అది చూశాక, ఈశ్వర్ వెనక్కు తిరిగి "ఇన్నాళ్ళయినా ఇవన్నీ ఇంకా ఇంత పొడిగా ఉన్నాయి. వాటర్‌ప్రూఫ్ సిస్టమ్ పక్కాగా పనిచేస్తోందన్నమాట" అంటూ మిగిలిన కోర్డైట్‌లను అన్నిటినీ తీసి నీళ్ళల్లోకి విసిరేశాడు.

"ఎప్పటివో ఇవి? ఎవరిమీద ప్రయోగించినవో?" అన్నాడు లక్ష్మీపతి.

'ఏమో!' అన్నట్లుగా భుజాలు ఎగరేశాడు ఈశ్వర్.

అప్పటికి సురేంద్ర కూడా పడవ దగ్గరకు వచ్చాడు. చేయిఅందించి అతన్ని పడవమీదకు లాగారు.ఈశ్వర్, లక్ష్మీపతి.

"ఎంత లోతుకు వెళ్లావు?" అనడిగాడు ఈశ్వర్.

సురేంద్ర మాస్క్ తీసి పక్కనపెడుతూ చిన్నగా నవ్వాడు తప్పితే జవాబేమీ ఇవ్వలేదు. అప్పుడు చూశాడు లక్ష్మీపతి సురేంద్ర చేతిలో ఉన్న చిన్న పళ్ళెం లాటిది.

"అదేమిటి?" అనడిగాడు ఆసక్తితో.

అప్పుడు చూశాడు ఈశ్వర్, సురేంద్ర

తెచ్చిన వస్తువులకేసి-

"ఏమిటో దొరికింది...తెచ్చాను!" అన్నాడు సురేంద్ర.

ఈశ్వర్ దాన్ని అందుకొన్నాడు - "ఇదా...దీన్ని ఎస్క్యుషాన్ అంటారు"

"అంటే?"

"మనకు డాలు అని వుంటుంది చూడండి...అలాటిదే ఇది" అన్నాడు ఈశ్వర్.

లక్ష్మిపతి దాన్ని అందుకొని చూశాడు. దానిమీద ఏవేవో గుర్తులున్నాయి. ఆ పళ్ళానికి మూడుచోట్ల తాళంచెవి పెట్ట డానికి వీలుగా అన్నట్లుగా చిన్నచిన్న రంధ్రాలున్నాయి.

"మరి ఇవేమిటి ?" అనడిగాడు లక్ష్మిపతి.

"తాళంచెవులు పెట్టి తియ్యటానికే. దీన్ని 'త్రీలాక్ బాక్స్' అంటారు. ఇలాటివి ఉంటాయని విన్నాగానీ, నేనూ ఎప్పుడూ చూడలేదు. దీన్ని తీయాలంటే మొత్తం మూడు తాళంచెవులు ఉండి తీరాలి!"

"ఎందుకిన్ని తాళాలు, చెవులూ?"

"రహస్యాల్ని రహస్యంగా ఉంచ టానికి!సాధారణంగాఇలాటివిఅతికీలకమైన పత్రాల రవాణాకు ఉపయోగించే వారు. ఒకచోట ఒకరిదగ్గర మూడు తాళంచెవులూ ఉంటాయి. అతను లోపల ఏ పత్రాలూ, రహస్యాలూ అవతలి వ్యక్తికి చేర్చాలో అతని దగ్గర రెండు తాళాలు ఉంటాయి. మూడో తాళం చెవిని ఈ ప్లేట్ తీసుకెళ్ళే పడవ కెప్టెన్‌కు ఇచ్చి పంపుతారు. ఒకవేళ ఆ పడవ మునిగిపోయినా, ఆ ప్లేటు ఎవరికి దొరికినా, అది తీయటం కష్టంగనుక ఆ రహస్యమో, పత్రమో అలాగే ఉండి పోతుంది అందులో"

"అయితే ఇందులో చాలా ముఖ్యమైన పత్రమేదో ఉండివుంటుందన్న మాట?" అన్నాడు లక్ష్మిపతి.

ఈశ్వర్ నవ్వాడు.

సురేంద్ర చిన్నగా ముందుకు వచ్చి, ఆ ప్లేటును అందుకొని పడవలోకి ఓ మూలకు విసిరేశాడు.

"ఇలాటివి ఎన్ని దొరికితే ఎవడికి కావాలండీ! ఇలాటివి కావాలంటే సముద్రం లోపల కోటానుకోట్లు ఉంటాయి. అన్నీ పనికిరాని వస్తువులే! దిగినపుడల్లా ఒక్కోసారి ఒక్కో బండితీసుకురావచ్చు" అన్నాడు సురేంద్ర.

ఈశ్వర్ చిన్నగా నవ్వాడు.

"మన దృష్టి అంతా దాని మీదే ఉండాలి" అన్నాడు సురేంద్ర. "చెప్పండి.... మళ్ళీ వెడదామా ?" అని అడిగాడు.

ఈశ్వర్ తల ఊపేశాడు. "ఇంక ఈవేళ నావల్లకాదు. నాకెందుకో సైనస్ నెప్పులు వస్తున్నాయి" అన్నాడు.

సురేంద్ర ముఖంలో నిరాశ స్పష్టంగా కనిపించింది. కానీ అతనుపైకేమీ అనలేదు.

ఆరోజుకు పడవ ఇంటిముఖం పట్టింది. మర్నాడు మళ్ళీ అదే వేళకు సముద్రం మీద ఉన్నారు.

ఈశ్వర్ గేర్ వేసుకుని నీళ్ళలోకి దూకాడు. క్రమంగా అడుగడుగు చొప్పున నీళ్ళలోకి దిగాడు.

కొంచెం లోతులోకి వెళ్ళగానే అక్కడ తనకోసం కాపలా ఉన్నట్లుగా, తనకు స్వాగతం చెప్పేందుకు సిద్ధంగా ఉన్న ట్లుగా సొరచేప నిశ్చలంగా ఉంది. ఈశ్వర్ అక్కడే ఆగి దానికేసి పరీక్షగా చూశాడు.

ఆరేడు అడుగులు పొడవు ఉంటుం దేమో అది. కండలన్నీ తేలినట్టుగా

నునుపుగా ఉంది. సముద్ర నీటికాంతిలో ముత్యంలా మెరుస్తోంది. దాని పద్ధతి చూస్తోంటే అది సమయం చూసి మెరుపు దాడి చేసేలా ఉందనుకున్నాడు ఈశ్వర్. నీళ్లు ఎక్కువగా కదలకుండా జాగ్రత్త పడి నెమ్మదిగా నడుంమీద ఒరలోంచి పిడిబాకు తీశాడు. అది ఏ క్షణంలో దాడి చేసినా ఎదురు దాడికి సిద్ధం అయ్యాడు ఈశ్వర్. నీళ్ళల్లో కత్తి పదును తళతళా మెరుస్తోంది. ఆ మెరుపును సొరచేప చూసి నట్లుగావుంది. కనురెప్పపాటు సమయంలో మెరుపులా మాయమయింది.

క్షణంసేపు ఈశ్వర్ నలుదిక్కులా దృష్టి ప్రసరించి చూశాడు. ఆ నీళ్ళల్లో చూడగలిగే దూరం అతిస్వల్పం. ఆ కొద్ది దూరంలో ఎక్కడా అతనికి సొరచేప కనపడలేదు. కత్తిని నెమ్మదిగా మళ్ళీ ఒరలోకి తోశాడు ఈశ్వర్.

మళ్ళీ పక్కన ఏదో కదలిక కనిపిస్తే అటు చూశాడు అతను. పక్కన సురేంద్ర. ఏమిటన్నట్లుగా చెయ్యి కదిపాడు సురేంద్ర.

ఏమీలేదన్నట్లు జవాబుఇచ్చాడుఈశ్వర్. సురేంద్ర నెమ్మదిగా పక్కకు కదిలాడు.

అతను అటువెళ్ళగానే 'నేను సిద్ధం' అన్నట్లుగా మళ్ళీ సొరచేప కనపడింది ఈశ్వర్‌కు. అతను మళ్ళీ నడుంమీది ఒరమీద చెయ్యి వేశాడు. ఒరలోంచి పిడిబాకు తీసే లోపునే సొరచేప ఉన్నట్టుండి ముందుకు కదిలింది. ఆ చేప తోక తెరచాపలాగా గాలికి వయ్యారాలు పోతున్నట్లుగా అనిపించినా, ఆ వేగానికి దొరికితే, తనకది చావుదెబ్బే అవుతుందని ఈశ్వర్‌కు తెలుసు. అందుకే సమయోచితంగా కిందకు జారాడు.

సొరచేప కదిలి వెళ్ళిపోయింది. కానీ మళ్ళీ అది దాడి చేస్తుందని ఈశ్వర్‌కు తెలుసు. చేతిలోని పిడిబాకు అలాగే పట్టుకొని సిద్ధంగా ఉన్నాడు. మళ్ళీ అతను అనుకొన్నట్లుగానే ఆ చేప వెనక్కు తిరిగొచ్చింది. ఈసారి దాని వేగం మరింత పెరిగింది. అది దగ్గరకు వచ్చినట్లు అనిపించగానే ఈశ్వర్ కత్తిని దాని శరీరంలోకి గుచ్చాడు. సుతి మెత్తగా ఆ కత్తి దాని శరీరంలోకి దూసుకు వెళ్ళిపోవటం అతనికి తెలుస్తూనే ఉంది. ఆ కత్తి బహుశా రెండో పక్కకు వెళ్ళిపోయి ఉండొచ్చుననుకొన్నాడు ఈశ్వర్. ఎంత వేగంగా గుచ్చాడో, అంతే వేగంతో ఈశ్వర్ దాన్ని వెనక్కు లాగాడు.

ఈసారి లాగటంలో చేయిజారింది. కత్తి కిందకు పడిపోయింది. కత్తి వెనక్కు రావటంతో సొరచేపకు అయిన గాయంలోంచి రక్తం ఆకుపచ్చని మేఘంలాగా అక్కడి నీటినంతా ఆవరించుకో సాగింది. సొరచేప ఆ దెబ్బకు గిలగిలలాడుతున్నట్లుగా వంకర వంకరగా తిరుగుతూ ఈదుతూ కదిలింది. ఆ కదలికలో ఇంతక్రితం ఉన్న ఠీవిలేవు. ఆ వయ్యారం ఆ సోయగం ఇప్పుడెక్కడా లేవు. గాయానికి విలవిలలాడిపోతున్న బాధే కనిపించింది ఈశ్వర్‌కు. అతనికి మనసొకసారి కలుక్కుమంది.

ఇది నిజానికి ఆ సొరచేప నివాస గృహం. దోపిడీ దొంగలా తాను అక్కడ ప్రవేశించి, దాన్ని దాడిచేసి దెబ్బతీయడం నిజానికి అమానుషం! స్వార్థంకోసం ఎంతైనా చేయటానికి ఏ నీచానికైనా దిగజారటానికి సిద్ధపడే ఆధునిక మానవులకు నిజమైన ప్రతీకలా ఉన్నాడు తను-అనుకొన్నాడు ఈశ్వర్.

నోరూ వాయీ లేని ఆ జంతుజాలం

మీద ఇలా దాడిచేసి వాటిని గాయం చేయటం...ఎందుకో ఈశ్వర్‌కు మనసంతా పాడయిపోయింది. 'ఇక ఈరోజుకు పని ఆపేసి పైకి వెళ్ళిపోవటమే మంచిద'ని ఈశ్వర్ మనసులో అనుకోగానే, మళ్ళీ సొరచేప తగిలినట్టయి ఉలికిపడి వెనక్కి తిరిగి చూసాడు- ఈసారి సొరచేప కాదు ఎదురుగా ఉన్నది – సురేంద్ర!

అతని కళ్ళలో చింత నిప్పులున్నట్లు అనిపించింది. మనిషి కొత్తగా ఉన్నట్లు అనిపించింది. అతని పెదవులేవో కదులుతున్నాయి కానీ ఏ మాటలూ బయటకు రావటం లేదు.

సురేంద్రను ఇలా చూస్తుండగానే – అతను ఈశ్వర్ భుజాన్ని పట్టుకొని, రెండు కాళ్లతోనూ అతన్ని చుట్టుకొనే ప్రయత్నం చేసాడు. సురేంద్ర చేతి వేళ్ల ఈశ్వర్ భుజాన్ని గట్టిగా నొక్కాయి. ఈశ్వర్‌కు అతనిలా ఎందుకు చేస్తున్నాడో అర్థంకాలేదు. ఏం జరిగిందని అతనిలా చేస్తున్నాడు ? ఎందుకు తనమీద దాడి చేస్తున్నాడు?

ఇంకో క్షణం ఊరుకుంటే సురేంద్ర తనను చంపేస్తాడనిపించింది ఈశ్వర్‌కు.

అంతలోనే సురేంద్ర తన నడుంమీది ఒరలోంచి పిడిబాకు తీసాడు. ఈశ్వర్‌కు అంతటి జల సముద్రంలోనూ ఒంటినిండా చెమటలుపట్టాయి. అతని పట్టులోంచి,అతని ప్రయత్నంలోంచి ఎలా తప్పించుకోవాలా అని క్షణం ఆలోచించి, ఒంట్లోని బలం అంతా ఒక్కసారి కేంద్రీకరించి ఈశ్వర్ గట్టిగా విదిలించుకొన్నాడు.

అదే సమయంలో సురేంద్ర తన బాకుతో ఈశ్వర్‌మీద దాడిచేసాడు. అతను పొడిచినందువల్ల ఈశ్వర్‌కు భుజంకింద గాయం అయింది. రక్తం నెమ్మదిగా కారనారంభించింది. ఈశ్వర్‌కు ఆ క్షణంలో ఏదో తెలీని మొండితనం ఆవహించింది. అటో ఇటో తేల్చుకోవల్సిన సమయం ఆసన్నమయినట్లుంది. ఒక్కసారి సురేంద్ర మీదకు ఉరికాడు. అతని చేతిలోని బాకు లాక్కునే ప్రయత్నం చేశాడు. అది ఈశ్వర్‌కు అందలేదు. సురేంద్ర మళ్ళీ ఈశ్వర్ మీదకు ఉరికాడు. ఈసారి ఈశ్వర్ తెలివిగా తప్పించుకొని సురేంద్ర భుజాన ఉన్న సిలిండర్‌ను పట్టుకొన్నాడు. సరిగ్గా పట్టుదొరకటంతో, ఈశ్వర్ ఇంక క్షణం అయినా ఆగకుండా సురేంద్రను పైకి లాక్కువచ్చే ప్రయత్నం చేశాడు.

ఎలాగైనా ఈశ్వర్ పట్టుతప్పించుకోవాలనే శత విధాలుగా సురేంద్ర ప్రయత్నించాడుకానీ వీలుపడలేదు. ఈశ్వర్ ఒక పక్క భుజంమీద గాయం నొప్పిపెడుతున్నా సురేంద్రను పైకి లాక్కొచ్చాడు.

నీళ్ళల్లోంచి పైకి వస్తున్న అతన్ని లక్ష్మీపతి చేయూతనిచ్చి పైకిలాగాడు.

"ఏమిటిది, ఏమిటిది?" అంటూ లక్ష్మీపతి ఒకటే కంగారుపడుతోంటే, ఈశ్వర్ తను లాక్కువచ్చిన సురేంద్రను చూపించాడు. లక్ష్మీపతికి కొంత అర్థమయింది. ఇక ఆలస్యం చెయ్యకూడదన్న ధ్యాసలో లక్ష్మీపతి వెంటనే సురేంద్రను పైకి లాగాడు.

అతను పైకి రాగానే అప్పటికే సిద్ధంగా ఉన్న ఈశ్వర్ సురేంద్రను వెంటనే తాళ్ళతో కట్టేసే ప్రయత్నం చేస్తే లక్ష్మీపతి దానికి సాయపడ్డాడు. సురేంద్ర చేతిలో కత్తి ఆ పెనుగాటలో ఎప్పుడో జారిపోయినట్లుంది. ఇద్దరి ఒరలూ ఖాళీగా ఉన్నాయి.

"ఏం జరిగింది అసలు?" అనడిగాడు లక్ష్మీపతి.

జరిగిందంతా చెప్పాడు ఈశ్వర్. అతను చెప్తొంటే విని ఆశ్చర్యపోయాడు లక్ష్మీపతి. ఈలోగా ఈశ్వర్ భుజంమీది దెబ్బకు కట్టుకట్టాడు లక్ష్మీపతి.

"ఎందుకు చేశారీ పని?" అనడిగాడు లక్ష్మీపతి.

నెమ్మదిగా అన్నాడు సురేంద్ర- "ఎన్నాళ్ళనుంచో ఉన్న కోరిక ఇదినాకు! సముద్రంలో నిధిని సంపాదించుకోవాలని ఎన్నో ప్రయత్నాలు చేశా! అన్నీ దెబ్బ తినేశాయి! ఆఖరికి ఇది..."

"దీనికోసం ఈశ్వర్ మీద దాడి ఎందుకు?"

"నా పాత ప్రయత్నాలన్నీ నిధు లెక్కడ మునిగాయో తెలీకే దెబ్బతిన్నాయి తెలిసినచోట్ల ప్రయత్నించటానికి ప్రభుత్వం అనుమతి ఇచ్చిందికాదు. ఇక్కడ నిధి ఉందని తెలిసింది గనుక, ఈశ్వర్‌ను చంపేస్తే ఏ సొరచేపో అతన్ని చంపేసిందని చెప్పేవాడిని. మీకివీలులో ఏమీ తెలీదుగనుక, ప్రాజెక్ట్ మొత్తం నా చేతిలోకి వచ్చేది"అన్నాడు సురేంద్ర.

ఇలాటివి జరుగుతాయని వినటమేగానీ ఇలాటి అనుభవం తన జీవితంలోనే ఎదురవుతుందని ఈశ్వర్ ఊహించు కోలేదు. ఇపుడు ఇలా జరగటం అతన్ని అప్రతిభుడిని చేసింది.

సురేంద్రకేసి చూడాలన్నా అతనికి అసహ్యం వేసింది.

తనను చంపి, తన ప్రయత్నాన్ని సొంతం చేసుకోవాలనుకొన్న సురేంద్ర దారిదోపిడీగాళ్ళకన్నా ఎందులో తక్కువో అతనికి అర్థంకాలేదు.ఈశ్వర్ ఒకపక్కన కూర్చునిదూరంగాచూస్తూవుండిపోయాడు.

దూరంగా ఆ సముద్ర జలాల మీద కూడా ఏదో పెద్ద యుద్ధం జరుగుతున్నట్లే వుంది. సొరచేపలన్నీ ఎగిరెగిరి పడు తున్నాయి. తన కత్తికి గాయపడ్డ సొర చేపనుమిగిలినసొరచేపలుచంపేస్తున్నాయి. దేనికి దొరికిన మాంసంఖండాల్ని అదినోట కరుచుకొని తీసుకుపోతున్నాయి. ఎగిరెగిరిపడుతున్న ఆ సొరచేపలన్నీ తలోరకం రంగులో ఉన్నాయి. కొన్ని గోధుమరంగులో, మరికొన్ని ముదురు గోధుమ రంగులో, ఇంకొన్ని బూడిద రంగులో. కానీ అన్నిటిలోనూ ఒకే ఆవేశం....ఒకే కక్ష.

ఈశ్వర్ అటు చూడటంతో లక్ష్మీపతీ అటు చూశాడు.

"ఏమిటది?"

ఈశ్వర్ చెప్పాడు.

"ఎంతసేపు ఉంటాయి అవలా అక్కడ?"

"ఆహారం అయిపోయేంతవరకూ! ఈలోగా ఇంకొన్ని గాయపడతాయి. మిగిలినవివాటిని చంపేస్తాయి. అపుడు ఇంకొన్ని గాయపడతాయి. ఇదిలా కొంత కాలం జరిగి తీరుతుంది. అంతవరకు అవి ఎవర్నీ ఈ దరిదాపుల్లోకి కూడా రానీవు"

"అంటే, మనంకూడా ఒకటి రెండు రోజులు విశ్రాంతి తీసుకోవాల్సిందే నన్న మాట" అన్నాడు లక్ష్మీపతి.

"ఆ...అలాగేవుంది పరిస్థితి"అన్నాడు ఈశ్వర్ తన భుజంకేసి చూసుకొంటూ.

పడవ ఒడ్డుమీదకు రాగానే సురేంద్రని తీసుకెళ్ళి పోలీసు స్టేషన్‌లో అప్పగించాడు లక్ష్మీపతి.

ఈశ్వర్ మాత్రం అదో పీడకలలాగ మర్చిపోయే ప్రయత్నం చేశాడు.

* * *

మూడునెలలు గడిచిపోయాయి.

రోజూ అదేపనిగా ఉదయమే బయలు

దేరటం, చార్ట్‌మీద గుర్తుపెట్టుకొన్న స్థలానికి చేరటం, కొంతసేపు ఆశగా ఆ లోతుల్లో వెతకటం, ఆఖరికి నిరాశను పడవమీద వేసుకొని తిరుగుముఖం పట్టడం మామూలయింది.




నరసప్ప ఆనాటి సంఘటన తర్వాత మళ్ళీ ఎప్పుడూ తన ముఖాన్ని వీళ్ళకు చూపించలేదు.

"ఇం కెవరూ వద్దు గంగులూ...వస్తావా నువ్వు రా! రేకపోతే లేదు...!" అన్నాడు ఈశ్వర్. ఆ రోజునుంచీ గంగులు వస్తున్నాడుగానీ అతనికి కేవలం పడవమీద ఉండే పనిని మాత్రం అప్పగించారు. డైవింగ్, ఆ తర్వాత సెర్చ్ అన్నీ లక్ష్మీపతి, ఈశ్వర్‌లే చేస్తున్నారు.

"ఇంత చిన్న టీమ్‌తో సాల్వేజ్ యత్నాలు ప్రపంచంలో ఎక్కడా జరిగి వుండవు" అన్నాడు లక్ష్మీపతి.

"అంతేకాదు- ఇంకా ఎన్నో విషయాల్లో మనకెంతో ప్రత్యేకత ఉంది. విదేశాల్లో అయితే ఒకచోట సాల్వేజ్‌కు వీలుగా షిప్ ఉందని తెలిస్తే, ఎంతోమంది డైవర్స్ పోటీపడతారు. వాళ్ళకు ఒక్క సెర్చ్‌కు ముందు ఏళ్ళ తరబడి రీసెర్చ్ ఉంటుంది, ప్లానింగ్ ఉంటుంది. ఎంతో మంది మార్బలమూ ఉంటాయి. కోట్లాది రూపాయల పెట్టుబడి ఉంటుంది...ఇవేమీ మనకు లేవు. కర్ణాకర్ణిగా విన్న కథ మన సెర్చ్‌కు పునాది. సాహసం మన పెట్టుబడి. అందుకే మనకు పోటీలేదు. పైగా మనం విజయం సాధిస్తే నిజంగా చెప్పుకోవాల్సిన విషయం అదే అవుతుంది" అన్నాడు ఈశ్వర్.

మొదట్లో ఉమ రోజూ 'ఎందుకొచ్చిన బెడద' అంటూ వచ్చేది కానీ ఇపుడా పద్ధతి తగ్గిపోయింది.

"ఏంటండీ... మీరేది తల్చుకున్నా క్షణంలో సాధించగలరు. కానీ ఈ విషయంలో ఇ దే మి టీ...ఇలా వెనకబడిపోయారు!" అంది ఈమధ్య. ఆమెలో వచ్చిన ఆ మార్పు ఈశ్వర్‌కు సంతోషం కలిగించింది.

"ఇన్నాళ్ళకు నువ్వు ఇలా అంటున్నావు. ఇక చూస్కో...విజయం నాదే!" అన్నాడు ఈశ్వర్.

"విజయం సాధించే ప్రతి మగాడి వెనుకా ఒక స్త్రీ ఉంటుంది అంటారు. ఇన్నాళ్ళూ మీ వెనక లేకనే మీకు విజయం సిద్ధించలేదు గాబోలు!" అంది ఉమ.

కాని, రోజులు గడిచినా తమ అన్వేషణలన్నీ ఇలా ఏ ఫలితాన్నీ ఇవ్వకుండానే గడచిపోతున్నాయి.

పడవ వెనుక వేలాడదీసిన మాగ్నెటో మీటర్, రాము చేతిలో పట్టుకొని, ఆ అగాథాల్లో తిరుగుతున్నపుడు ఏదైనా రవ్వంత సూచన ఇస్తుందేమోనని అనుకొన్నా ఏ ఫలితమూ ఇవ్వని మెటల్ డిటెక్టర్—

ఎందుకిలా విఫలమయిపోతున్నాయి తమ ప్రయత్నాలు?

ఈశ్వర్‌లో నిరాశ పెరుగుతున్న కొద్దీ, పట్టుదలకూడా పెరుగుతోంది.

ఊళ్ళోకూడా కొందరు తనను 'పెద్దిరాజు' అనటం తానే స్వయంగా విన్నాడు. అంటే ఆ పెద్దిరాజు తన ఆస్థిని దక్కించుకోవాలని ప్రయత్నించి పిచ్చాడయితే, తను ఆయన ఆస్తుల్ని దక్కించుకోవాలని ప్రయత్నించిన పిచ్చాడిగా మిగిలిపోతాడా! అదే ఆ మాట అనే జనంఅభిప్రాయమా??

సముద్రం లోతుల్లో ఎక్కడో మునిగిపోయి, చనిపోనయినా చనిపోతాడుగాని, ఓటమిని అంగీకరించి ఒడ్డుమీద జీవచ్ఛవంలా మాత్రం బతకడు తను!!

ఈశ్వర్‌కు ఆ పడవ ప్రయాణాలన్నీ చిత్రంగా అనిపిస్తున్నాయి ఇపుడు. ఏదయినా ఒక్కరోజు 'యురేకా!' అంటూ తానూ సంతోషంతో పరుగుతీయగలడా? ఆ సంతోష క్షణాలు తన జీవితంలో ఉన్నాయా లేదా??

ఆశా నిరాశాలమధ్య ఊగిసలాడుతూ అతను తన ప్రయత్నాలను మాత్రం కొనసాగించాడు.

ఆ రోజూ గంగులు పడవను ఈశ్వర్ చెప్పిన చోటుకు నడిపించాడు. అనుకొన్న స్థలందగ్గర దాన్ని ఆపాడు. ఈశ్వర్ యాంత్రికంగా గేరు వేసుకొని నీళ్ళలోకి దూకాడు. మరికొన్ని నిమిషాల తర్వాత లక్ష్మీపతి దూకాడు.

మెటల్ డిటెక్టరు, కెమేరా ఇపుడతనికి బరువుగా ఉంటున్నాయి. మొదట్లో ఉన్న ఆశా, ఆసక్తి ఇపుడతనిలో లేవు.

నెమ్మదిగా లోతుల్లోకి దిగటం ఆరంభించాడు. ఆ రోజు మామూలుకన్నా కొంచెం ఎగువన ఉండగానే చెవుల్లో అతనికి రొద ఆరంభమయింది.

ఈశ్వర్ ఉలిక్కిపడ్డాడు. సముద్రం లోతుల్లోఉన్నపుడు కలిగే చెవి నెప్పికాపది కొత్తరకం రొద— 'బజ్!'

అతనికి అర్థం అయింది. ఏదో బలీయమయిన అయస్కాంత క్షేత్రంలోకి ప్రవేశించినట్లు తెలియజేసే మెటల్ డిటెక్టర్ 'రొద' అది!

ఈశ్వర్‌లో కదలిక ఆరంభమయింది. ఇన్నాళ్ళూ వినపడని శబ్దం అది. ఇపుడు అతనికి అది విజయధ్వానంలావినపడింది. ఆ నిధి తనను సాదరంగా పిలుస్తున్న స్వాగతగీతిలా వినిపించింది.

ఈశ్వర్ క్రమంగా ఇంకొంచెం కిందకు దిగాడు.

బజ్ పెరుగుతూ వచ్చింది. అంటే— ఇక్కడే ఎక్కడో... ఉండివుంటుంది. శబ్దం కూడా పెరుగుతూ ఉందంటే, తప్పనిసరిగా ఈ కిందనే ఉండివుండాలి అనుకొన్నాడు ఈశ్వర్.

అగాధాల అంచుకు చేరాడు. అక్కడంతా బురదబురదగా ఉంది. సన్నని, మెత్తని బురదను ఎవరో పనికట్టుకొని నీళ్ళల్లో కలిపినట్లుగా ఉంది. ఆ బురదలో ఏమీ కనిపించటంలేదు. అయినా ఎంతో ఓపిక తెచ్చుకొని ఈశ్వర్ ఆ ప్రాంతమంతా కలియదిరిగాడు.

బజ్ ఒకటే రొదచేస్తోంది. కానీ ఏమీ కనిపించడంలేదు. తను పొరబడ్డాడా? కొంపదీసి ఆ మెటల్ డిటెక్టర్ కాస్తా పాడయిపోయి, ఇలాటి శబ్దాన్ని సృష్టిస్తోందా?

విధి ఎదురుతిరిగినపుడు తాడుసైతం పామై కరుస్తుందంటారు. ఇపుడు తనపాలిట అదే జరిగిందా?

ఈశ్వర్‌లో నిరాశ పెరిగింది. ఆ అగాధాలలోనే నెమ్మదిగా ఒకచోట 'కూర్చు'న్నాడు.

అతను కూర్చున్న వెంటనే కర్ర విరుగుతున్న చప్పుడు నెమ్మదిగా ఆరంభ

మయింది. ఈశ్వర్ ఉలికిపడ్డాడు– అంటే..తను సరిగ్గా ఆ పెద్దిరాజు పడవ మీదే కూర్చున్నాడా...?

కర్ర ఫెళ్ళున విరిగింది.

ఈశ్వర్ కిందకు పడకుండ నిలదొక్కుకొన్నాడు.

ఇంత కాలమూ బురద, మట్టి–అన్నీ ఆ పడవ మీద పరుచుకొన్నవి కాస్తా ఆ విరగటంతో చెదిరాయి. నీళ్ళన్నీ మడ్డిగా తయారయ్యాయి.

ఈశ్వర్ కళ్లు మసకబారాయి. ఒకసారి పైకి లేచి వచ్చాడు. ఆ కదలిక కాస్త సర్దుకొన్నాక మళ్ళీ దిగాడు.

ఇపుడు పడవ స్పష్టంగా కనిపిస్తోంది, పైన ఉన్న మట్టి, మకిలి పోవటంతో. పాత కాలం కర్ర ఒకటి రెండు చోట్ల స్పష్టంగా దర్శనం ఇస్తున్నా మిగతా చోట్ల మాత్రం నాచు, బురద పట్టి అలాగే ఉంది. కానీ అంతా ఒక్కసారి ఆ కర్ర విరగటంతో చెదిరి, స్పష్టమైన ఆకృతిని కనిపింపజేస్తోంది.

ఈశ్వర్ నెమ్మదిగా మళ్ళీ కిందకు దిగాడు. ఎక్కడ ఏది గుచ్చుకొంటుందో తెలీని విధంగా ఉంది. అతి నెమ్మదిగా పడవలోకి దిగి నడిచాడు. విజయం! ఇన్నాళ్ళకు తాను ఆశించింది సరిగ్గా జరిగింది!

ఎవరూ ఊహించలేని విధంగా తాను విజయం సాధించగలిగాడు!

ఏ ఆచూకీ లేకుండా కేవలం పుక్కిటి కథలమీద ఆధారపడి అగాధాల లోతుల్లో మునిగిపోయిన పడవ ఆచూకీ కనుగొన్నాడు! అందులో నిధి ఉండనీ, ఉండకపోనీ నష్టం లేదు?

తన ప్రయత్నాలకు ఫలితం ఇదే!

ఒక్కసారి పైకి ఎగిరి, పడవ మీదకు ఉరికి, ఊళ్ళోకి పరిగెట్టి అందరికీ చెప్దామని ఉంది. 'పెద్దిరాజు పడవ దొరికింది!' అంటూ పది ఊళ్ళల్లోనూ డప్పుకొట్టి చాటాలని ఉంది!!

కానీ...

ఈశ్వర్ ఉత్సాహానికి రవ్వంత బ్రేక్ పడింది.

'ఏంవుంది ఇందులో?' ఎవరైనా అడిగే మొదటి ప్రశ్న అదే. ఎవరూ అడగక మునుపే ఆ సంగతికి సమాధానం తానే కనుక్కొంటే మంచిది. అదే చేస్తాడు తను!

ఈశ్వర్ నెమ్మదిగా పడవ లోపల బురదనంతా తప్పించుకొంటూ 'నడవ' సాగాడు.

–గంగులు చెప్పింది నిజమే. పెద్దిరాజు సామాన్యుడు కాడు. ఇంత పెద్ద పడవను సిద్ధం చేయించి పారిపోయే ప్రయత్నాలు చేశాడంటే–అందులో ఎంతో నిధి ఉండే ఉంటుంది. ఆ పడవను ఒక పద్ధతి ప్రకారం పరిశీలించుకొంటూ ఈశ్వర్ ముందుకు నడిచాడు.

ఒకచోట అతనికి ఒక పెద్ద గ్లాస్ కనపడింది. బురద దట్టంగా పట్టినా, దాని ఆకృతిమాత్రం పోలేదు. ఈశ్వర్ నెమ్మదిగా దాన్ని పైకెత్తి చూశాడు. బురదను తొలగించి చూశాడు. అంతకాలం నీళ్లల్లో ఉన్నా తళతళమంటూ తెల్లగా మెరిసింది ఆ గ్లాసు.

పలకల వెండి గ్లాసు అది!!

ఎప్పటి కాలందో అది!!–ఏ పూర్వీకుల నాటినుంచి పెద్దిరాజు ఇంట్లో అది రాజ్యం ఏలిందో! ఎందరు అతిథులకు అది స్వాగతం చెప్పిందో...

ఈశ్వర్‌కు ఇంకా లోపలికివెళ్ళి, మరింతగా పరిశీలించి చూద్దామనిపించింది గానీ, ఈ వార్త వెంటనే లక్ష్మీపతికి,

గంగులుకుచెప్పడం భావ్యం అనిపించింది అలా తోచగానే అతను పైకిచేరుకొన్నాడు.

ఈశ్వర్ పైకి వచ్చేసరికే లక్ష్మీపతి పైకి వచ్చేసి ఉన్నాడు.

స్టీల్ బార్ పట్టుకొని ఈశ్వర్ పైకి ఎక్కుతోంటేనే లక్ష్మీపతికి అర్థమయింది

''గెలిచారా?'' అనడిగాడు.

ఈశ్వర్ తల ఊపుతూ చేతిలోని గ్లాసు చూపించాడు. లక్ష్మీపతి దాన్ని ఆత్రంగా అందుకొన్నాడు. గంగులు తొందరలో దానివంక చూశాడు.

తళతళా మెరుస్తున్న వెండి గ్లాసు. ఇంతకాలమూ ఆవరించుకొన్న నిరాశను తొలగించి తమకు జీవితంమీద ఆశ, గెలిచామన్న నమ్మకాన్ని కలిగిస్తున్న గ్లాసు!!

లక్ష్మీపతి ఒక్కసారి ఆ గ్లాసును గాలిలోకి ఎగరేసి పట్టుకొన్నాడు.

"మేమే గెలిచాం...మేమే గెలిచాం!" అంటూ లక్ష్మీపతి ఎంతో ఉత్సాహంతో పడవమీద కేకలు వెయ్యటం ఆరంభించాడు. గంగులు ఓ పక్క పడివున్న ఒక డబ్బా అందుకుని డప్పు కొడుతున్నట్లుగా వాయిస్తూగుండ్రంగా తిరగనారంభించాడు.

ఆ ఉత్సాహం క్రమంగా సద్దుకోగానే, లక్ష్మీపతి ఈశ్వర్ దగ్గరకొచ్చి అడిగాడు-

"అందులో ఇంకా ఏం ఉన్నాయి?"

ఈశ్వర్ నవ్వాడు. "నేనింకేమీ వెతకలేదు. ఇది కనపడగానే పైకివచ్చేశా- మీకీ వార్త చెప్పాలని!!"

"లోపల ఇంకా చాలా ఉంటుం దయ్యా!" అన్నాడు గంగులు.

ఈశ్వర్ గంగులుకేసి చూశాడు. చిన్నగా నవ్వుకొన్నాడు. గంగులు వయసు ఎంతలేదన్నా డెబ్బయి-ఎనభై ప్రాంతంలో ఉండివుంటుంది.ఆ వయసులో ఉన్నా ఇంకా ఈ ఆటుపోటులకు తట్టుకొని నిలబడి ఉంటున్నాడంటే కారణం- జీవితంమీద ఆశ. బతుకుమీద కోరిక. ఏదైనా చెయ్యాలనే తపన. అంత పెద్ద మాటలు అతనికి తెలియకపోవచ్చుగానీ అతని జీవితం చెప్పేది అదే!

-యధాలాపంగా చెప్పాడు – తనకు పెద్దిరాజు పడవ గొడవ. అది ఎందుకో తన మనసుకు హత్తుకుపోయింది. ఉన్న ఉద్యోగానికి రాజీనామాచేసి ఈ ప్రయత్నంలో పడ్డాడు, నిలిచి గెలిచాడు.

"ఎంత ఉన్నా అందులో కొంతే మనది!" అన్నాడు ఈశ్వర్.

"రోజూ మనం ఇలాగే వచ్చి కొంచెం కొంచెం తీసుకెళ్లిపోతేపోలా?" అన్నాడు గంగులు.

-ఈశ్వర్‌కు నవ్వొచ్చింది. లభించ నంతకాలమూ ఎంతోకొంత లభిస్తే చాలునన్న కోరిక. లభించాక అంతా ఎలా సొంతం చేసుకోవాలా అన్న ఆలోచన! ..ఈ ఆశలకు, ఆలోచనలకు వయస్సుతో సంబంధంలేదు కాబోలు! లేకుంటే ఈ వయసులో ... ఇంకా అనుభవించాలని గంగులుకు ఈ కోరిక!!

ఎవరూ ఏమీ జవాబివ్వకపోయేసరికి గంగులు మళ్ళీ ఆ ప్రసక్తి తేలేదు.

* * *

'పెద్దిరాజు పడవ దొరికింద'న్న వార్త ఊరు ఊరంతా వ్యాపించిపోయింది. ఎలా వెళ్ళిందో ఆ వార్త పట్నానికీ చేరింది. మర్నాడు ఇంకా తూర్పు తెల్లవారక ముందే ఓ విలేకరి వచ్చాడు.

"క్షమించండి....మీకు చెప్పేందుకు అవసరమైన వివరాలేవీ నాకే తెలీదు!'' అన్నాడు ఈశ్వర్.

"అలా కాదండీ..ఏ అంచనా లేకుండా

మీరు ఈ నౌకోద్ధరణకు ఉత్సాహంచూపి ఉండరుగదా. ఆ అంచనాల ప్రకారమే చెప్పండి ఎంత ఉండి ఉండొచ్చు ఆ నౌకలో?''

''తెలీదు! మాకసలు ఏ అంచనాలూ లేవు... ఈ చుట్టుపక్కల గ్రామాల్లో వ్యాప్తిలోఉన్న ఓ కథ ఆధారంగా ఈ సాహసంచేశాం. దానికి ఇంకే ఆధారాలూ లేవు... అంచనాలూ లేవు!''

''పోనీండి...ఇది చెప్పండి—ఆ నౌకను పైకి ఎలా తీస్తారో!''

''నీళ్ళల్లో మునిగిన పడవల్ని పైకి తియ్యటానికి నాకు తెలిసినంతవరకు రెండు పద్ధతులున్నాయి. ఒకటి పాన్ టూన్ పద్ధతి. రెండోది...''

''పా న్ టూ న్ పద్ధతిలో ఎలా తీస్తారు?''

''ఇది మామూలుగా పెద్ద పెద్ద బరువులకింద రాళ్ళలాటివో, చెక్కలలాటివో పెట్టి ముందుకు జరుపుతాం చూడండి..అదే పద్ధతి. మునిగిపోయిన నౌకకు పెద్ద పెద్ద గొలుసుల్ని కట్టి దాన్ని సముద్రంలోని నీటి కదలికలకు అనుగుణంగా ఈ పాన్ టూన్‌ల మీ ద కు జరుపుతుంటారు. క్రమంగా అది అలాగే ఒడ్డుకు చేరుతుంది. కానీ ఇది శ్రమతో కూడిన పద్ధతి. పైగా చాలాకాలం పడుతుంది''

''మరి రెండో పద్ధతి?''

''ఇది కెమికల్ ట్రీట్‌మెంటు పద్ధతి. ఎన్నో శతాబ్దాలు, దశాబ్దాల కాలంగా నీళ్ళల్లో ఉండిపోయి అక్కడి స్థితిగతులతో సమతుల్యం పొందినవాటిని మన వాతావరణంలోకి తెస్తే అవి భగ్గున మండిపోయే ప్రమాదంఉంది.అందుకే వాటిని అదేనీటితో నిండిన కంటైనర్స్‌లోపెట్టి పైకితేవటం జరుగుతుంది. లేకుంటే మైనపుపూత పోసి పైకి తీయటమూ ఉంది. కానీ ఇదికూడా పూర్తిగా నిపుణులు చెయ్యాల్సినపనే! ఆషామాషీగా, ఆదరాబాదరగా జరిగేదీ కాదు. అందరూ చెయ్యగలిగేదికాదు!'' అన్నాడు ఈశ్వర్.

''పోనీండి మిగిలినవాళ్ళ గురించి ఎందుకూ....మీరు తీస్తున్నారుగదా?''

ఈశ్వర్ పకాలున నవ్వాడు—''ఆమాట నేనన్నానా? మునిగినవాటిని ఎలా తీస్తారంటే చెప్పాను...అంతే!''

''అయితే మరి మీరు...''

''ఇప్పుడు మేం కనిపెట్టిన ఆ నౌకలో ఎంతవున్నా ఆ నిధినిక్షేపాల్ని తీసుకొచ్చేస్తాం! ఆ తర్వాత ఆ వివరాలతో సహా నౌక పరిస్థితి ఏమిటి, దాన్ని ఎలా పైకి తీసుకురావచ్చు— అన్నీ వివరంగా ఒక నివేదిక రాసి ప్రభుత్వానికి పంపిస్తా. ఆ తర్వాత అది వాళ్ళ ఇష్టం!''

''మరైతే మీరు ఆ నౌకను పైకి తీసే...''

''ప్రసక్తే లేదు! అది ఒకరిద్దరివల్ల జరిగే పనికాదు. దానికి తగిన ఆర్థిక స్తోమతా మాకు లేదు. మన దేశంలో కూడా ఇలాటి పద్ధతులకు ప్రోత్సాహం ఇవ్వటం అవసరమని ప్రభుత్వానికి తెలియజేయటమే నా లక్ష్యం''

''చివర్న ఒక్క ప్రశ్న..మాటవరసకు అనుకుందాం— మీకు ఆ నౌకలో ఓ కోటి లభించిందనుకోండి...ఏం చేస్తారు?''

ఈశ్వర్ నవ్వేశాడు. ''మీరు ప్రశ్న అయితే వేశారుగానీ నాకు ఆ ఆశాలేదు... నమ్మకమూ లేదు! మేం పసిగట్టిన నౌక నిజానికి అది నౌక కూడా కాదు. చాలా అనాగరికమైన పద్ధతిలో సిద్ధమైన పడవ! ఒక వ్యక్తి తన సంపదతోసహా విదేశాలకు పారిపోవాలని యత్నించటానికి చేసిన




ప్రయత్నం అది. వేసిన పథకం అది! శాస్త్రీయపద్ధతిలో సముద్రాన్ని అక్కడి వాతావరణాన్ని ఎదుర్కోగలిగే స్థితిలో పడవ తయారుకాలేదుగాబట్టి అది మార్గ మధ్యంలోనే జలసమాధి అయిపోయింది. అలాటి పడవలో కోట్లు ఉంటాయను కోవటం వెర్రితనం! ఈ ప్రాజెక్ట్ కు లక్ష్మీపతిగారు ఖర్చుపెట్టినంతా తిరిగి వచ్చేస్తే మా కదే చాలు! అంత లేకపోయినా ఫర్వాలేదని మేం ముందే అనుకున్నాం!" అన్నాడు ఈశ్వర్.

ఆ విలేకరి అందరి దగ్గరా సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు. వెళ్ళేటపుడు గంగులు, లక్ష్మీపతితోబాటు ఈశ్వర్ ఫొటో ఒకటి, ఆ వెండి గ్లాసు ఫొటో ఒకటి తీసుకెళ్ళాడు.

అతను వెళ్ళిపోయాక ఆ విలేకరి వేసిన ప్రశ్నల గురించే అందరూ చర్చించుకున్నారు.

''మొత్తానికి మీరు సాధించారండీ!'' అంది కల్యాణి.

''మీరు వెనక నిలబడబట్టిగానీ లేకుంటే ఏముందీ...కథే ఉండేదిగాదు! నిజానికి ఇది మీ విజయం!'' అన్నాడు ఈశ్వర్ మనస్ఫూర్తిగా.

''విలేకరిలాగే అడుగుతున్నాననుకోకండి! నిజం చెప్పండి...ఎంత ఉండి ఉంటుందా పడవలో?" కల్యాణి అడిగింది.

"నేనూ నిజమే చెప్తున్నాను... ఇదిగో నికరంగా దొరికింది మాత్రం ఎదురుగానే ఉంది. ఈ పలకల వెండి గ్లాసు! ఇంకా ఏమైనా ఉందో, లేకుంటే మొత్తం ఇదేనో కూడా నాకు తెలీదు. ఈ గ్లాసు దొరకగానే పైకి వచ్చేశాను....ఇక్కడ తేలాను!'' అన్నాడు ఈశ్వరరావు.

''తప్పుచేశారండీ మీరు! అందులో ఉండేది ఎవరైనా దోచుకుపోలేనో...?'' అంది ఉమ.

''ఎవరు దోచుకుపోతారు? ఇన్నేళ్ళ నుంచీ అది అక్కడే ఉంది. ఎవరూ దోచుకువెళ్ళలేదేం?''

''అందులో ఇంత ఉందని ఎవరికీ తెలీదు. పైగా అది ఉందో లేదో కూడా ఎవరికీ తెలీదు ఇప్పటివరకు! ఇప్పుడు అందరికీ తెలిసిపోయింది. ఎవరైనా వచ్చి దోచుకుపోవచ్చు?''

''ఎవరొస్తారంటావు ఇక్కడికి?''

''సముద్రపుదొంగలని ఉంటారుగదా- పైరెట్స్...''

ఈశ్వర్ నవ్వాడు-''ఉంటారుగాని... ఇక్కడ ఉండరులే! నువ్వు చెప్పేది విదేశాల్లో సంగతి! ఇలా నౌకను పైకితీస్తామంటే అక్కడ ప్రభుత్వం అనుమతి ఇస్తుంది. దానితోబాటు ఆ ప్రాంతాలలోకి ఎవర్నీ రానీయకుండా కోస్ట్ గార్డులచేత గస్తీ పెట్టిస్తుంది. మనకా బాధే లేదు!"

''లేకేం..?రేపు మీరు ఇంత కష్టపడి తెచ్చిందంతా వాళ్ళు లాక్కుపోరూ..?''

ఈశ్వర్ నవ్వాడు- ఆడది! ఉమ అచ్చం పదహారణాల ఆడది. అందుకే ఎంత చదువుకొన్నా ఆ లక్షణాన్ని పోగొట్టుకోందిగాదు! లేకుంటే ఏమిటిలా మాట్లాడటం?

"మీరు ఎన్నిఅయినాచెప్పండి.గంగులు అంటున్నదే నాకు నచ్చింది! ఏదో మాట వరసకు కొంచెం చూపించి, మిగిలింది మనం లెక్కేసుకొంచేసరి!"

ఈశ్వర్ ఒక్కసారి భార్యకేసి చూశాడు. ఉమ ఆ తర్వాత ఇంకేమీ మాట్లాడలేదు.

మర్నాడు, వద్దంటున్నా వినకుండా ఉమ, కల్యాణి కూడా బయలుదేరారు.

"మీకు చెప్తే మీరు వినటంలేదు. సముద్రంమీదకు వెళ్లటం అంటే ఏమిటో అనుకొంటున్నారు. అక్కడ ఎండకు మీరు తట్టుకోలేరు.దెబ్బకు మాడిపోతారు. మీ ఇష్టం!'' అన్నాడు ఈశ్వర్.

"అయినా వస్తాం" అన్నారు ఆ ఇద్దరు ఆడాళ్లు.

"సీ - సిక్‌నెస్ అని ఉంటుంది. సముద్రంమీదకు వెళ్లగానే మీకు వాంతులు పట్టుకుంటాయి. తలతిరుగుతుంది. క్షణం కూడా నిలబడలేని స్థితి వచ్చేస్తుంది. వద్దు... నామాట వినండి!" అన్నాడు ఈశ్వర్.

వాళ్లు దానికి ఒప్పుకోలేదు. "మేం వచ్చేది మేం వచ్చేదే!" అన్నారు ఇద్దరూ.

"ఆడాళ్లు ముందుకు రావాలి అంటూ కబుర్లు చెప్తారుగాని, మేం ముందుకొస్తే వెనక్కిపొమ్మంటూ ఇలా తోసెయ్యడం ఏంబాగుంది?'' అంది ఉమ.

"సర్లె...ముందుకు రమ్మంటే, ఇదా ముందుకొచ్చే విధానం?'' అంటూ నవ్వాడు ఈశ్వర్.

"అవునండీ నిన్ననే మీతో మేం ఉన్నా మనుకోండి ఆ విలేకరి ఏం రాసేవాడు? 'నట్టనడి సంద్రాన పతికితోడు నిలిచినసాహససతి' అని రాసేవాడు కదా? మీరా అవకాశం ఇవ్వందే!'' అంటూ వేళాకోళం ఆడింది ఉమ.

ఇక తప్పదనుకొంటూ వాళ్ళనూ రమ్మన్నాడు. కాని సీ-సిక్‌నెస్ పోయేందుకు ముందుగానే ఇద్దరికీ చెరో టాబ్లెటూ ఇచ్చాడు.

"అక్కడివరకూ వచ్చాక...కూడా దిగుతాం, అనకండి!''

"ఆ హామీ ఇస్తున్నాంలెండి!'' అంది ఉమ నవ్వుతూ.

పడవ నిర్ణీత స్థలానికి చేరాక-ఉమను, కల్యాణిని జాగ్రత్తగా ఉండమని చెప్పి, లక్ష్మీపతి, ఈశ్వర్‌లు నీళ్లలోకి దూకారు.

ఈసారి ఇద్దరూ తిన్నగా నీటిలో ఉన్న శిథిలాల వద్దకు చేరారు. ఈశ్వర్ ముందు కదులుతోంటే, లక్ష్మీపతి అతన్ని అనుసరించాడు.

ఎన్నో దశాబ్దాల కాలంనుంచీ నీటిలో ఉండిపోయిన శిథిలాలలోకి వెళ్ళేటపుడు ఎంతో జాగ్రత్తగా ఉండాలి. ఆ శిథిలాలు పూర్తిగా దెబ్బతిని, ఏమాత్రం ఒత్తిడికైనా నాశనం అయిపోనూవచ్చు లేదా గట్టిగా ఉన్నా కూడా లోపల రకరకాల చేపలు, ఇతర జలచరాలు తమ నివాసాన్ని ఏర్పాటుచేసుకునీ ఉండొచ్చు. అందుకే లోపలికి తగినంతగా వెలుగు ప్రసరింపజేసుకొంటూ కదిలారు.

పడవలో ఓ మూల కుప్ప పోసినట్లుగా ఎన్నో వస్తువులు. పళ్లాలు, కంచాలు, గ్లాసులు-ఇంకా ఇతర వంటసామగ్రి అన్నీ ఉన్నాయి. అన్నీ వెండివే. వాటిని చూసి ఇంకొంచెం ముందుకు కదలగానే ఈశ్వర్ తన వెనక ఏదో చప్పుడయి వెనక్కి తిరిగి చూశాడు.

అంతటి చీకటిలోనూ ఏవో మెరుస్తూ కిందపడటం అతనికి స్పష్టంగా కనిపించింది.

అంటే లక్ష్మీపతి కదులుతోంటే ఏదో తగిలిందన్న మాట. ఆ కదలికకు అవన్నీ కిందపడ్డాయి.

ఈశ్వర్ వెనక్కి వచ్చాడు.

కిందపడ్డవి తీసి చూశాడు...ఉలిక్కిపడ్డాడు. అన్నీ బంగారు నాణాలే! సవరసులే!!

ఈశ్వర్ గుండెలొక్కసారి అవిసిపోయాయి. కిందపడ్డవాటిని కదిపి




చూశాడు. ఆ గుట్టలో కిందనుంచి ఇంకొన్ని తీసి చూశాడు. అవీ నాణాలే! అందులోనూ నవరసులున్నాయి!

పెద్దిరాజు ఇంత ఎలా సంపాదించాడు? ఎక్కడినుంచి సంపాదించాడు??

అతని సంపాదన ఇంత అధికంగా ఉంది గాబట్టే పారిపోవాలనుకొన్నాడు. ఏదో ఆషామాషీ ఆస్తిపాస్తులయితే ఎవరూ దేశం వదిలి పెట్టాలనుకోరు. ఇంత మొత్తం ఉంది గనుకే ధైర్యంచేసి నౌకాయానం తలపెట్టాడు. ఇంత నష్టపోయాడు గనుకనే పిచ్చివాడయిపోయాడు!!

ఈశ్వర్‌కు పెద్దిరాజును తల్చుకోగానే మనసొకసారి కలుక్కుమంది.

నడుముకు చుట్టుకున్న వెయిట్ బెల్ట్ మీంచి నైలాన్ సాక్ (నైలాన్ గోనెసంచుల్లాటివి) తీశాడు ఈశ్వర్. లక్ష్మీపతికి ఒకటి ఇచ్చాడు. ఇద్దరూ కిందపడ్డ నాణాలు, నవరసులు తీసి సంచుల్లో పోశారు.

ఒకసారి, రెండుసార్లు, మూడుసార్లు నింపి వాటిని పడవవరకు తెచ్చి పడవలో పోసి మళ్లీ కిందకు దిగారు.

ఆఖరుసారి పడవలో ఉన్న వంట సామగ్రి గిన్నెలు వంటివి మాత్రం పైకి తెచ్చారు.

ఇద్దరూ పడవకు నాలుగు దిక్కులా ఉన్న స్టీల్ బార్స్ పట్టుకొని పైకి ఎక్కేసరికి పడవలో ఉన్న ఇద్దరు ఆడాళ్లూ ఆ నాణాల కుప్పలముందు కూర్చునిఉన్నారు.

ఇద్దరి కళ్ళల్లోనూ ఆశ్చర్యం!

గంగులు కళ్లలో ఆనందం...అనిర్వచనీయమైన సంతోషం!!

ఈశ్వర్ పైకిరాగానే ఆ కుప్పను చూసి నివ్వెరపోయాడు.

ఇంత డబ్బు ఇంతకాలం ఈ అగాథాలలో ఉండిపోయింది? దాన్ని తానే పైకి తీయగలిగాడా??

నమ్మగలిగిన సంగతేనా అది?

లక్ష్మీపతి స్థితి కూడా అలాగేవుంది. ఎవరూ ఆశించనంత ఫలితాన్ని ఇచ్చింది ఆ ప్రయత్నం!!

ఆ ఫలితానికన్నా, తమ లక్ష్య సాధనలో విజయం సాధించగలిగామన్న సంతృప్తే వారిలో అధికంగా ఉంది.

పడవ కదిలింది. పడవను నడిపించటం ఆరంభించగానే అన్నాడు గంగులు–

"అంతా తెచ్చినట్లేనా బాబూ?"

"ఆ..అంతా తెచ్చాం!ఇంక అక్కడేమీ లేదు" అన్నాడు ఈశ్వర్.

పడవ తీరం సమీపంలో ఉండగానే– తీరం అంతా ఒకటే జనం! ఇసకవేస్తే రాలనంత జనం!!

"బాబూ! ఒడ్డుమీద జనం..అంత మందిలోకి పోవటం మంచిది కాదేమో! అందరూ మన మీదకు వచ్చేస్తారేమో..?" అన్నాడు గంగులు భయంగా.

ఈశ్వర్ నవ్వాడు– "సరిగ్గా చూడు! అక్కడ జనాన్ని అదుపులో పెడుతూ పోలీసులు కూడా ఉన్నారు...నా ఊహ ప్రకారం కలెక్టరుగారు కూడా వచ్చే ఉండాలి! నేను ఆయనను కూడా రమ్మనమని చెప్పాను?"

"అంటే–ఇదంతా ఇప్పుడు వాళ్ళే తీసుకుపోతారా?" అనడిగింది ఉమ.

"ఇది వాళ్ళ సొమ్ము. అంటే ప్రభుత్వానిదేఈ సొమ్ము. అంతా లెక్కలు చూసి మనకు రావల్సింది ఆ తర్వాత ఇస్తారు" అన్నాడు ఈశ్వర్.

ఉమలో నిరుత్సాహం నిండుకొంది.

పడవ నడుపుతున్నాడు గానీ గంగులులోనూ ఇంత క్రితం ఉన్నంత

ఉత్సాహం లేదు.

"ఈమాత్రందానికి మనం ఇంత శ్రమ పడటం దండగేమో బాబూ!" అన్నాడు గంగులు.

"ఇందులో మనకు దొరికేది ఎంతని నీ ఉద్దేశం? దొరికిన నాణాల్ని ఏదైనా మ్యూజియంకు ఇచ్చేయండంటాను. వంట సామాగ్రి, గిన్నెలు వగైరాలూ అంతే!! మిగిలిన నికరమైన బంగారు అచ్చులు, నవరసుల్లో మాత్రమే వాటా ఇమ్మంటాను! మనకొచ్చేదాంట్లో మనం, మన శ్రమను బట్టి తీసుకొందాం" అన్నాడు ఈశ్వర్.

ఆ ప్రతిపాదనను లక్ష్మీపతి, కల్యాణి కూడా బలపరిచారు.

పడవ ఒడ్డుకు చేరింది.

ముందునుంచి తోసుకొస్తున్న జన సముద్రం వెనకనుంచి ఆ సంబరంలో పాలుపంచుకోవాలన్న ఆసక్తితో అలలతో ముందుకొస్తున్న జలసముద్రం.

ఈశ్వర్, ఉమ, లక్ష్మీపతి, కల్యాణి, గంగులు-వరసగా పడవలోంచి దిగారు.

ఈశ్వర్ చెప్పినట్లు కలెక్టర్ గారు కూడా అక్కడ సిద్ధంగావున్నారు. అందరికీ పూలమాలలు వేసి స్వాగతం చెప్పారు. ఆ నిధి నిండిన పడవను పోలీసులు స్వాధీనం చేసుకొన్నారు.

కలెక్టర్ గారి ముందే ఆ వస్తువుల్నీ, నాణాల్నీ, నవరసుల్ని లెక్కగట్టి ఈశ్వర్ ప్రభుత్వపరం చేశాడు.

ఇంతకన్నా సాధించాల్సింది ఏముం దన్నట్లుగా తృప్తిగానిలబడ్డాడు ఈశ్వర్. ఉమ అతని పక్కకు చేరింది. క్షణం తర్వాత కల్యాణి, లక్ష్మీపతి, గంగులు - అందరూ నెమ్మదిగా ఊళ్ళోకి నడవడం ఆరంభించారు.

ఆకాశంలో నడవవలసినవాళ్ళు ఉన్నట్లుండి నేలమీద నడుస్తున్నారన్న పద్ధతిలో ఆరోజువరకూ ఆరోడ్లమీదె నడిచినవారిని-వింతగా విస్మయంతో, ఆశ్చర్యంతో, ఆనందంతో చూడ నారంభించారు.

అందరూ ఇంట్లోకి చేరాక అన్నాడు ఈశ్వర్ "లక్ష్మీపతిగారూ, కల్యాణిగారూ.. మీకెంతో ఋణపడ్డాను. ఎవరూ సాధించ లేనిది నాచేత చేయించారు మీరు! ఈ సాగర మథనంలో లక్ష్మిని అందుకొ న్నట్లు చేసినా, నిజానికి నా విజయం అది కాదు...ఎలాటి సామాన్యులైనా ఏదైనా సాధించగలరన్న విషయాన్ని చాటి చెప్ప గలగటమే నా విజయం! అందుకు నేను మీకు ఎంతో కృతజ్ఞుణ్ని!"

లక్ష్మీపతి, కల్యాణి నవ్వారు.

"లాటరీ వచ్చిన రోజున నిజంగా ఆ లాటరీలో వచ్చిన డబ్బును ఏం చేయాలో తెలీలేదు. అనుకోకుండా వచ్చి పడిన మొత్తం అది! అందుకే మీరీ పథకం చెప్పగానే సరేనన్నాం! ఇపుడు పేరూ వచ్చింది, దానికి మించిన డబ్బూ వచ్చింది! ఇప్పుడు ఈ మొత్తాన్ని ఏం చేయాలో మేం ఇంకోసారి పత్రికా ప్రకటన చేస్తేగానీ మాకు తెలిసేలా లేదు!" అంది కల్యాణి.

"సర్లెండి...డబ్బు ఖర్చు పెట్టడానికి తగిన మార్గాలా? మావార్ని అడగండి లక్ష...లక్ష చెప్తారు!" అంది ఉమ నవ్వుతూ.

"ఎన్ని అయినా చెప్పగలనుగానీ... దానికి మాత్రం మా ఆవిడ ఇచ్చే టీయే నాకు పెట్టుబడి....అది ఉంటేనే నా బుర్ర సరిగ్గా పనిచేసేది!"

"టీ కావాలని అడగొచ్చుగదా... ఈ డొంక తిరుగుడు దేనికి?" అంటూ ఉమ ఇంట్లోకి వెళ్ళింది, నవ్వుతూ. ★

# చమత్కార ఫీచర్

# మనిషిన్నర పొడుగు



తన తమ్ముడితో 8 అడుగుల 11.1 అంగుళాల పొడగరి రాబర్ట్ వాడ్లో*

'రాబర్ట్ పెర్షింగ్ వాడ్లో' ఇల్లినాయిస్ లోని ఆల్టన్ ప్రాంతంలో 1918 ఫిబ్రవరి 22న ఓ ఇంజనీరుకి ప్రథమ సంతానంగా జన్మించాడు. పుట్టినప్పుడతను అందరిలా మామూలుగానే వున్నాడు. కాని, నెలలు గడిచేకొద్దీ అతని ఎత్తు, బరువుల్లో విపరీతమైన మార్పులు రాసాగాయి. సంవత్సరం నిండేటప్పటికే అతను 44 పౌనుల బరువు వున్నాడు. అది ఆ వయసులో వుండ వల్సిన బరువుకి రెట్టింపు. పెరిగే దశలో పిల్లలలో ఆమాత్రం హెచ్చు తగ్గులుండటం సహజమేనని దాన్ని అంతగా పట్టించుకోలేదు అతని తల్లిదండ్రులు.

రాబర్ట్ వాడ్లో 5 ఏళ్ల వయసుకి 105 పౌన్ల బరువు, 5అడుగుల 4 అంగుళాల ఎత్తుకి చేరుకున్నాడు. అతన్ని ఆ ఆకారంతో చూసినవాళ్లు బాలుడంటే నమ్మేవారు కాదు. అతను అప్పటికే యువకుడిలా కనబడేవాడు.

అతను భీమా పాలసీ కోసం పోస్టు ద్వారా ఫొటోతోపాటు దరఖాస్తు చేసినప్పుడు భీమా కంపెనీ అదే సందేహాన్ని వెల్లడించింది. అతని వయసు గురించో, అతని బరువు, ఎత్తు గురించో చెప్పడంలో పొరపాటు జరిగివుండాలని ఆ కంపెనీ భావించింది. అవన్నీ ఖచ్చితమైనవేనని డాక్టర్లు నిర్ధారించాకగానీ రాబర్ట్‌కి పాలసీ ఇవ్వలేదు.

రాబర్ట్ అయిదున్నర ఏళ్ల వయసులో స్కూలుకు వెళ్లడం మొదలుపెట్టాడు. అతని క్లాసులో పిల్లల కోసం వేసిన టేబిల్స్, కుర్చీలూ అతనికి చిన్నవయ్యేవి. తెలివితేటల్ని పరీక్షించే ఐ. క్యూ. టెస్టులో అతనికి మార్కులు అధికంగా వచ్చేవి. రాబర్ట్ తన తోటి పిల్లలు ఆడే ఆటల్నే ఆడుతూ ఆనందం పొందేవాడు.

రాబర్ట్ తొమ్మిదేళ్ల వయసుకి ఆరడుగుల వాడై ఎత్తులో తన తండ్రిని మించిపోయాడు. వార్తాపత్రికలవాళ్లు అతని పుట్టినరోజునాడు ఫొటోలు తీసి ప్రచురించేందుకు ఉత్సాహపడేవారు. పదవ పుట్టినరోజునాటికి అతను ఆరడుగుల అయిదంగుళాల ఎత్తు, 210 పౌనుల బరువు వున్నట్టు పత్రికలు ప్రకటించాయి.

అంత పొడగరిని అంతకుముందు చూసి వుండకపోవడంతో డాక్టర్లకి రాబర్ట్‌పై ఆసక్తి జనించింది. అతను సెయింట్ లూయీస్‌లోని బార్నెస్ ఆసుపత్రికి క్రమం తప్పకుండా వెళ్తుండేవాడు. అక్కడి వైద్యులు ఎప్పటికప్పుడు అతని కొలతలు తీసుకుని, అతను విపరీతంగా పొడుగు పెరగడానికి గల కారణాలను పరిశోధిస్తుండేవారు. కొంత కాలం తర్వాత పిట్యూటరీ గ్రంథిలో ఏర్పడిన లోపం ఆ విపరీతమైన పొడుగుకి కారణమని నిర్ధారించారు. ఆపరేషన్ ద్వారా ఆ లోపాన్ని సరిజేయవచ్చు. కాని, అది ప్రాణాపాయకరమైంది కావడంతో ఆ ఆలోచన విరమించుకోవల్సి వచ్చింది. ఆ దశలోనే వారు రాబర్ట్‌ని వాషింగ్టన్ యూనివర్సిటీ మెడికల్ స్కూలు దగ్గిర వైద్య విద్యార్థులకి ప్రదర్శించి చూపారు.

మరీ ఎత్తు వుండటంవల్ల కొన్ని చికాకులు ఎదురైనా ఆ ఎత్తే రాబర్ట్‌ని ప్రసిద్ధుడిని చేసింది. 12వ పుట్టినరోజునాటికి అతను ఆరడుగుల పదిన్నర అంగుళాల పొడుగయ్యాడు. 1[illegible]వ పుట్టినరోజుకి ఏడడుగుల ఒకటి ముప్పావు అంగుళాల పొడుగు, 255

పౌనుల బరువు వున్నాడు.

1931లో రాబర్ట్ 'స్కౌటు'లో చేరాడు. అది అతనికే కాక అమెరికాలోని స్కౌటుకి కూడా ప్రసిద్ధిని తెచ్చింది. ప్రపంచం మొత్తం మీదగల స్కౌటు సభ్యులలో అత్యంత పొడుగైనవాడు అతనే!

ఆ వయసుకే రాబర్ట్ తనక్కావాల్సిన డబ్బుతనే సొంతంగా సంపాదించుకోవడం మొదలుపెట్టాడు. అతని పాదాలకు సరిపడే బూట్లు దొరకక, ప్రత్యేకంగా ఆర్డరిచ్చి తయారు చేయించుకోవల్సి వచ్చేది. బూట్లు తయారుచేసే సంస్థ ప్రచారంకోసం అతన్ని తమ దుకాణంలో కూర్చోమనేది. ఆవిధంగా రాబర్ట్‌కి బూట్లు వుచితంగా రావడమే కాక కొంత ఫీజుకూడా దక్కేది. బూట్ల తయారీ సంస్థ అతనివల్ల తమ అమ్మకాలను పెంచుకునేది. పిల్లల బూట్ల వ్యాపార ప్రకటన చిత్రంలో అతను దర్శన మిస్తుండేవాడు.

1932లో 14 ఏళ్ల వయసుకి చేరు కున్న రాబర్ట్ 7 అడుగుల 5 అంగుళాల పొడుగు, 301 పౌన్ల బరువు అయాడు. అతనావిధంగా ప్రతి సంవత్సరం 3 అంగుళాల చొప్పున పెరుగుతూ పోతు న్నాడు. సగటు ఎత్తు వుండే తండ్రి, తల్లి, తమ్ముడు, చెల్లెళ్లకంటే రాబర్ట్ ఎంతో ఎత్తు పెరిగిపోయాడు. మొదట్లో రాబర్ట్ తల్లి మునిగాళ్లపై నిలబడి చెయి చాచి కొడుకు భుజాన్ని తాకగలిగేది. అతని పెద్ద చెల్లెలు పక్కన నడుస్తు న్నపుడు అతని చేయి పట్టుకుని నడవ గలిగేది. కాని, కొన్నాళ్లకి అది వాళ్ళకి అసాధ్యమైపోయింది.

16 ఏళ్లకి రాబర్ట్ 7 అడుగుల 10 అంగుళాల ఎత్తుకు పెరిగాడు. బరువుకూడా 400 పౌన్లకి చేరుకుంది. ఉత్తర అమెరికా ఖండంలో ఎవరూ అతనిఅంత ఎత్తు లేరు. అంత పొడుగు వుండటం వల్ల అప్పు డప్పుడూ అతని పాదాలకి దెబ్బలు తగిలి గాయాలవుతుండేవి.

18 ఏళ్లకి రాబర్ట్ 8 అడుగుల మూడున్నర అంగుళాల పొడుగయ్యాడు. 1936లో కాలేజీలో చేరిన అతన్ని లాయర్ వృత్తి ఎక్కువగా ఆకర్షించ డంతో భవిష్యత్తులో వకీలు కావాలను కున్నాడు. భారీ ఆకారంవల్ల కాలేజీలో అతను ఎన్నో సమస్యలను ఎదుర్కో వలసి వచ్చేది. పెద్ద ఫౌంటెన్ పెన్ను కూడా పెద్దదైన అతని చేతికి అమరినట్టు వుండకపోవడంతో, మిగిలిన విద్యార్థులంత వేగంగా నోట్సు రాసుకోవడం అతనికి కష్టమయ్యేది. లేబరేటరీలో చిన్న చిన్న పరికరాలతో 'ప్రాక్టికల్స్' చేయడం కుదిరేది కాదు. మైక్రోస్కోపుని సున్నితంగా అమర్చి చూడటం అసాధ్య మయ్యేది. భారీగావుండే అతనికి ప్రతి పరికరం చిన్నపిల్లల కోసం తయారు చేసినట్టు కనబడేది.

శీతాకాలంలో భూమి మంచుతో కప్ప బడి వుండటంవల్ల రాబర్ట్ చాలా ఇబ్బం దుల్ని ఎదుర్కొనేవాడు. మంచుపై జారి పోకుండా నడవటానికి ఇతరులపై ఆధార పడవల్సి వచ్చేది. దానికోసం వాళ్ల భుజాలపై చేతులు వేసే అతని బరువుకి వాళ్లు మంచులో అణిగిపోయేవారు. అతను పొరపాటున జారి కిందపడితే ఆ దెబ్బలకి ఆసుపత్రిలో చాలాకాలం వుండాల్సి వచ్చేది.

బూట్ల తయారీదార్ల అమ్మకాలను పెంచడంలో పబ్లిసిటీకి బాగా ఉపయోగ




పడి రాబర్ట్ పెద్దమొత్తంలోనే ధన మార్జించేవాడు. కొంత కాలానికి అతనికి లాయర్ అవడంకంటే సొంతంగా ఓ బూట్ల దుకాణం నడుపుకోవడం మేలనిపించింది. కాని, అందుకవసరమైన పెట్టుబడి అతని దగ్గిర లేదు.

1937లో రింగ్లింగ్ సోదరులనేవారు రాబర్ట్‌ని కలిసి బోస్టన్, న్యూయార్క్ నగరాలలో నడపబోయే తమ సర్కస్‌లో ప్రదర్శనలిమ్మని కోరారు. హోటల్లో తనకూ, తండ్రికీ ప్రత్యేకమైన గది ఏర్పాటు చేసి అన్ని ఖర్చులూ భరిస్తే దానికి అంగీకరిస్తానని రాబర్ట్ తన షరతు చెప్పాడు. తను ప్రదర్శన ఇస్తుండగా, మరే ప్రదర్శన జరగరాదని మరో షరతు పెట్టాడు. ఆవిధంగా రోజుకి రెండు సార్లు కొన్ని నిమిషాలపాటు సర్కస్‌లో రాబర్ట్ ప్రదర్శన వుండేది. సర్కస్ యజమానులు రాబర్ట్‌ని అతని ఎత్తు మరింత ఎక్కువగా కనబడే ప్రత్యేకమైన దుస్తులు ధరించమనేవారు. కాని అతను తన మామూలు సూటులోనే సర్కస్ రింగులోకి వచ్చేవాడు. కేవలం అతన్ని చూడ్డానికే ఆ సర్కస్‌కి జనం విపరీతంగా వచ్చేవారు.

21 ఏళ్ళ వయసులో రాబర్ట్ 8 అడుగుల ఎనిమిదింపావు అంగుళాల ఎత్తుకు ఎదిగాడు. 1940లో 22 ఏళ్ళకి అతని ఎత్తు 8 అడుగుల 11.1 అంగుళాలు, బరువు 439 పౌనులు!

మామూలుగానే రాబర్ట్ వూళ్ళు తిరుగుతూ ప్రదర్శనలిస్తున్నాడు. జూలై 4న అతను మిచిగాన్‌లో వున్నాడు. అక్కడ జరుగుతున్న ఉత్సవంలో ఓ పెరేడ్‌లో అతను గుర్రపు స్వారీ చేయాల్సివుంది. లంచ్‌లో రాబర్ట్ ఏమీ తినకపోవడం తండ్రి గమనించాడు. కాసేపటికి తనకు వంట్లో బాగోలేదని చెప్పాడు రాబర్ట్.

అతనికి చీలమండ దగ్గిర చీము పట్టి జ్వరం వచ్చింది. డాక్టర్ ఆసుపత్రిలో చేరమని సలహా ఇస్తే రాబర్ట్ అందుకు నిరాకరించాడు. దాంతో అతన్ని రోజంతా కనిపెట్టుకుని వుండేందుకు నర్సుని నియమించారు. కాని, అతని పరిస్థితి క్షీణించసాగింది. తీవ్రమైన నొప్పితో బాధపడసాగాడు. దాంతో అతని తల్లిని రప్పించారు. తల్లిదండ్రులిద్దరూ రేయింబవళ్లు అతని బెడ్ వద్దనే గడపసాగారు. అలా రోజులు గడుస్తున్నాయి. ఒక్కొక్కప్పుడు రాబర్ట్‌కి నొప్పి తగ్గడం చూసి అతనికి నయమవుతుందని ఆశపడసాగారు. కాని, అంతలోనే నొప్పి తిరిగి అతనిలో ప్రవేశించి బాధిస్తోంది. అలా అతను బాధపడుతూ జూలై 14న తీవ్రమైన నొప్పికి గురై 15వ తేదీ వేకువనే మృతిచెందాడు.

రాబర్ట్ మృతదేహాన్ని అతని తల్లిదండ్రులు స్వస్థలమైన ఆల్టన్‌కు తీసుకెళ్లారు. అతని శవాన్ని చూసేందుకు జనం విపరీతంగా వచ్చారు. అతనికోసం 10 అడుగుల పొడవు, 32 అంగుళాల వెడల్పుతో ప్రత్యేకమైన పెట్టెను తయారు చేయించారు. ఆ పెట్టె చర్చిద్వారం కంటే పెద్దది కావడంతో, రాబర్ట్ శవాన్ని చర్చిలోకి తీసుకెళ్ళకుండా ఇంటివద్దనే కర్మకాండను ముగించి, పెట్టెతోపాటు అతన్ని ఖననం చేశారు.

—జాస్తి శ్రీకృష్ణ వరప్రసాద్

# చాతుర్య కథలు

## డిటెక్షన్

అరవింద టేబుల్ మీద అన్నీ పడ్డించాక భోజనానికి పిలిచింది కొడుకు మురళిని. మురళి మౌనంగా వచ్చి తల్లిదండ్రుల కెదురుగా కూర్చుని భోజనం చేస్తున్నాడు.

అరవిందకుమాత్రం అన్నం సయించడం లేదు. మురళి డిటెక్టివ్ ట్రయినింగ్‌కు ఢిల్లీ వెళ్తానని పట్టుబట్టి కూర్చున్నాడు. ఇరవయి ఏళ్ళు కడుపులో పెట్టుకు పెంచిన కొడుకుని ఒంటరిగా అంత దూరం పంపించాల్సి వచ్చినందుకు ఆమె కన్న కడుపు ఒప్పుకోవడంలేదు.

"అయ్యో బాబోయ్!" అని ఉన్నట్టుండి కుర్చీలో విరుచుకుపడిపోయాడు రాజారావు.

"ఏమయిందండీ?" ఆత్రంగా భర్త పద్దకు అడుగేస్తూ అంది అరవింద.

"పొరబాటున ఓ ఇనుపగుండు మింగేశాను" అన్నాడు రాజారావు గొంతు పట్టుకొంటూ.

అరవింద శోకాలు ప్రారంభించింది.

"ఎలా వుందా గుండు?" అడిగాడు మురళి.

"చిక్కుడుగింజంత పరిమాణంలో, ఎర్ర రంగులో గుండ్రంగా వుంది" వివరంగా చెప్పాడు రాజారావు.

"ఇంకా ఏమైనా వివరాలు చెప్పగలరా నాన్నా?"

"ఆఁ! అన్నట్టు దానికి ఒకవేపున చిల్లుకూడా వుంది!"

"వెరీగుడ్!" అనేసి తన కుర్చీలో కూర్చొని తాపీగా తిరిగి భోజనం చేయడం మొదలెట్టాడు మురళి.

"ఏమిట్రా నీ ఉద్దేశం? మీ నాన్నగారేదో ఇనుపగుండు మింగితే మెదలకుండా కూర్చుంటావ్. వెంటనే డాక్టర్‌కి ఫోన్ చేయి!" గుడ్లనీరు కుక్కుకొంటూ కోపంగా అరిచింది తల్లి.

"డాక్టర్ వచ్చి ఏం చేస్తాడమ్మా?" తాపీగా అన్నాడు మురళి.

అతడి నిర్లక్ష్యానికి ఒళ్లుమండిపోయింది అరవిందకు. "ఒరేయ్! మీ నాన్నగారు చెప్పింది వినలేదట్రా? పైగా డాక్టరెందుకని ఎదురు ప్రశ్నిస్తావా?" మరింత గట్టిగా కేకలేసింది అరవింద.

"ఆయన చెప్పింది వివరంగా విన్నాను కాబట్టే డాక్టర్ అవసరం లేదంటున్నాను!!"

"అంటే....??" విస్తుపోతూ అడిగింది అరవింద.

"అంటే, ఏముందమ్మా? పొరబాటున ఎవరయినా చిక్కుడు గింజంత పరిమాణంలో, ఎర్ర రంగులో గుండ్రంగా ఉండి, ఓ వేపున చిల్లుకూడా ఉన్న ఓ ఇనుపగుండును మింగగలరా? ఇంత వివరంగా ఓ ఇనుపగుండును పరిశీలించిన వ్యక్తి పొరబాటున ఆ గుండును మింగేశాడంటే ఎలా నమ్మగలం? కాబట్టి నాన్నగారెందుకనో మనతో అబద్ధమాడుతున్నారని

పించింది. అందుకే డాక్టర్ అవసరం లేదంటున్నాను" వివరంగా చెప్పాడు మురళి.

అరవిందకు అర్థం కాలేదు. అయోమయంగా తండ్రీ కొడుకుల్ని చూస్తోంది.

"ఇప్పటికయినా అర్థమయిందా అరవిందా డిటెక్షన్‌వల్ల లాభమేమిటో? మరి ఇకనయినా మురళిని డిటెక్టివ్ ట్రైనింగ్‌కి పంపడానికి అనుమతిస్తావా?" కుర్చీలోంచి నవ్వుతూ లేచాడు రాజారావు.

"భలేవారే! భయంతో ఎంత హడలి చచ్చానో తెలుసా? సరే, మురళిని మీ ఇష్టప్రకారమే, అహ... మన ఇష్టప్రకారమే డిటెక్టివ్ ట్రయినింగ్‌కి పంపిద్దాం!" ఆనందంగా ఒప్పుకొంది అరవింద.

స్కూల్లో పిల్లలు చాలా తక్కువ సంఖ్యలో ఉన్నారు. అందుకు కారణం- ఆదేరోజున సిటీలో భారత, వెస్టిండీస్ జట్ల మధ్య మొదటి క్రికెట్ మాచ్ ఆరంభం కావడమే!

సరిగ్గా ఆ సమయంలో స్కూళ్ళ ఇన్‌స్పెక్టర్ ఆ స్కూలును హఠాత్తుగా తనిఖీచేయడానికొచ్చాడు.

ఎదురుగా కనిపించిన క్లాసురూంలోకి వెళ్ళి విద్యార్థుల మీద ప్రశ్నల వర్షం కురిపించాడు.

విద్యార్థులంతా తెల్లమొఖాలు వేశారు జవాబులు చెప్పలేక. ఒక్క విద్యార్థిమాత్రం ఎంతో కష్టమయిన ప్రశ్నలకు కూడా సమాధానాలు చెప్పేడు.

అనుమానం వచ్చిన స్కూళ్ళ ఇన్‌స్పెక్టరు ఆ కుర్రాణ్ని క్లాసురూం పక్కకు తీసుకుపోయి "నిజం చెప్పు? నీదీ క్లాసేనా...?" అంటూ గదమాయించాడు.

"క్షమించండి సార్! నాదీక్లాసు కాదు, నేను పైతరగతిలో ఉన్నాను. మా తమ్ముడు క్రికెట్ మాచ్ చూడటానికి వెళ్తూ నన్ను తన స్థానంలో ఉంచి వెళ్ళాడు" భయపడుతూనే అసలువిషయం వెల్లడించాడా విద్యార్థి.

పశ్చమందిన ఇన్‌స్పెక్టర్ క్లాసు టీచర్‌ని కొరకొరా చూస్తూ – "మీ

సంజాయిషీ కావాలి....!" అన్నాడు.

టీచర్ గడగడ వణికిపోతూ "అయ్యా! నిజం చెప్పాలంటే నేను వీళ్ళ క్లాసు టీచర్ని కాను. వీళ్ళ టీచరు క్రికెట్ మాచ్ చూడటానికి వెళ్ళిపోయాడు. నేను అతడి విధి నిర్వహిస్తున్నాను ... అంతే!" అన్నాడు.

ఇన్‌స్పెక్టర్‌కి కోపం నషాళాని కంటింది. ప్రధానోపాధ్యాయుడి దగ్గరకు పరుగుతీశాడు. విషయం చెప్పి భగ్గుమన్నాడు అతనిమీద.

చేతులు నులుముకుంటూ ఇలా చెప్పాడు ప్రధానోపాధ్యాయుడు-

"నేను హెడ్‌మాస్టరును కాను. అసలు హెడ్‌మాస్టారు టెస్ట్ మాచ్ చూడ్డానికి వెళ్ళారు. ఏవయినా అత్యవసర పరిస్థితులు ఏర్పడితే చక్కదిద్దడం కోసం నేనీ సీట్లో కూర్చొన్నాను"

ఇన్‌స్పెక్టర్ ముఖంచూసిన స్టాఫ్ మెంబర్స్ అంతా భయంతో వణికిపోతున్నారు. ఎర్రగా కందగడ్డలా అయిపోయిన అతడి నుంచి ఎలాటి దూషణాదులను వినాలో అనుకొంటూ గుడ్లప్పగించి చూస్తూండిపోయారు.

మూడు నిముషాల తర్వాత మౌనాన్ని భంగపరుస్తూ గొల్లుమని నవ్వేశాడా ఇన్‌స్పెక్టర్.

తెల్లబోయారు స్టాఫంతా.

ముసిముసిగా నవ్వుతూ చెప్పాడా స్కూళ్ళ ఇన్‌స్పెక్టర్- ''వండర్‌ఫుల్.. మీరంతా లేచిన వేళా విశేషం బాగుంది. మీ అదృష్టవశాత్తు అసలు స్కూళ్ళ ఇన్‌స్పెక్టర్ కూడా క్రికెట్ మాచ్ చూడ్డానికి వెళ్ళాడు. నేను అతని స్నేహితుణ్ని! అతను చేయాల్సిన డ్యూటీ నేను చేయడానికొచ్చాను.''

—కె. హరిబాబు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 004.

# మామిడి పండ్లలోని మాధుర్యం ఇదే! ఇదే!!









**సోమా మాంగో**

**సోమరస విహారం**
**ఎప్పుడైనా. ఎక్కడైనా.**

మార్గదర్శి మార్కెటింగ్ ప్రైవేట్ లిమిటెడ్

ప్రస్తుతం హైద్రాబాద్, సికింద్రాబాద్‌లలోనే లభ్యం.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004. Regd No. H/HD/402